శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీవరవరముని వైభవ ప్రకాశిక

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఎ. శింగరాచార్యస్వామి

ప్రకాశకులు

**శ్రీరామానుజ సిద్ధాంతసభ**

సికింద్రాబాద్

**2020**

# శ్రీవరవరముని వైభవ ప్రకాశిక

## ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ప్రథమ ముద్రణ : 2020

ప్రతులు :

అన్నిహక్కులు : రచయితవే.

సందర్భము :

వెల : అమూల్యము

ముఖచిత్రం : శ్రీమణవాళమహామునులు.

అక్షరయోజనము : 1. యస్. చంద్రశేఖర్, తిరుపతి.
2. శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, తిరుపతి.

ముద్రణ :

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# మంగళాశాసనం

వైదిక సంప్రదాయాలు అన్నిటిలో ఆచార్యుని స్థానం చాలా గొప్పది. వేదం కూడా "యస్య దేవే పరా భక్తిః యథాదేవే" అని ఆచార్యుని దైవంతో సమానంగా ఆరాధించాలని తెల్పింది. "ఆచార్యదేవో భవ", "దేవమివాచార్య ముపాసీత" మొదలైన పలు సూక్తులు ఆచార్యోపాసనను, దాని ప్రాధాన్యాన్ని తెల్పుతున్నాయి.

తెన్నాచార్య సంప్రదాయానికి చెందిన ఆచార్య పరంపరలో శ్రీమణవాళ మహామునుల స్థానం చాలా విలక్షణమైనది. ప్రథమాచార్యుడైన శ్రీరంగనాథునకు కూడా ఈడు వ్యాఖ్యానాన్ని కాలక్షేపంగా చెప్పిన వైభవం వీరిది. "శ్రీశైలేశ" ఇత్యాదిగా నిత్యం అనుసంధింపబడే వీరి తనియన్ శ్లోకాన్ని శ్రీరంగనాథుడే అనుగ్రహించిన వృత్తాంతం వీరి చరిత్రలో ప్రసిద్ధం.

శ్రీమణవాళమహామునులు అవతరించి ఈ ఏటికి 650 సంవత్సరాలు పూర్తి అయినవి. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఆ ఆచార్య సార్వభౌములకు సంబంధించిన కొన్ని లఘుగ్రంధాలు చేర్చి ప్రపన్నుల ఆనందంకోసం ముద్రింప బడుతున్నవి. ఈ గ్రంథముద్రణా కైంకర్యం కోసం తమ పవిత్ర ద్రవ్యాన్ని వినియోగించే శ్రీమతి కటకం వెంకటేష్ వాణిశ్రీ గారు, వీరి మనుమడు చి. కృష్ణకార్తిక్ రాజ్, మనుమరాలు, చి. నాగశ్రావణి ధన్యులు. వీరు చేసికొనే ఈ ఆచార్య సేవ వీరి సంప్రదాయ శ్రద్ధను తెలుపుతున్నది. వీరికి శ్రీమణవాళ మహామునుల అనుగ్రహం

వల్ల సకల శుభాలు కలగాలని ఆశిస్తూ, మంగళా శాసనాన్ని చేస్తున్నాను. వీరిని ఈ సత్కార్యంలో ప్రోత్సహించిన ఉ.వే. శ్రీమాన్ కె.కె. పరకాలన్ స్వామివారు, భాగవతశేఖరులైన శ్రీ శశిధర్‌గారు అభినందనీయులు. ఈ గ్రంథం ఆస్తిక పాఠకలోకానికి ఆనందం కలిగించగలదని నమ్ముతున్నాను. ఇంతవరకు ఎన్నో సంప్రదాయ గ్రంథాలను ముద్రించిన శ్రీరామానుజ సిద్ధాంత సభ ద్వారా ఈ గ్రంథం ప్రచురింపబడడం బంగారానికి సువాసన కలిగినట్లు కాగలదు.

శ్రీమతే రమ్యజా మాతృమునీంద్రాయ మహాత్మనే ।
శ్రీరంగవాసినే భూయాన్నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

భాగవత దాసుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీమణవాళమహామునులవిషయంగా
కోయిల్‌కన్దాడై అణ్ణన్ అనుగ్రహించిన

# కణ్ణినుణ్ శిఱుత్తాම్బు

( మణవాళమహామునులు అనుగ్రహించిన తనియన్ )

**ఎక్కు్ణత్తోర్ ఎక్కు్లత్తోర్ ఎవ్వియల్‌వోర్ ఆయిడినుమ్**
**అక్కు్ణత్తే నమ్మిఱైయవరావరే - మిక్క పుకళ్**
**క్కారార్‌పొళిల్ కోయిల్ కన్దాడై యణ్ణనెనుమ్**
**పేరాళనై యడైన్ద పేర్**

మిక్క పుకళ్ =మిక్కిలి (పూర్ణం అయిన) కీర్తిని కలవారై, కార్ ఆర్ పొళిల్= మేఘాలు సంచరించే (నిలచి ఉండే) తోటలచేత పరివేష్ఠితం అయిన, కోయిల్ = శ్రీరంగాన్ని నిరూపకంగా కలవారై, కన్దాడై = కన్దాడైకులంలో అవతరించినవారై, అణ్ణన్ ఎనుమ్ = అణ్ణన్ అని ప్రసిద్ధిని పొందినవారైన, పేరాళనై= మహానుభావులను, ఎక్కు్ణత్తోర్ ఆయినుమ్ = ఎటువంటి చెడ్డగుణాలను కలవారై ఉన్నా, ఎక్కు్లత్తోర్ ఆయినుమ్ = ఏవిధమైన తక్కువ కులంలో జన్మించినవారైనా, ఎవ్వియల్‌వోర్ ఆయిడినుమ్ = ఎటువంటి తగని స్వభావాన్ని కలవారై ఉన్నా, అక్కు్ణత్తే =అణ్ణన్‌ను ఆశ్రయించిన ఆ క్షణంలోనే, నమ్ ఇఱైయవర్= మాకు స్వాములుగా, ఆవర్ ఏ = కాగలరు అన్నది నిశ్చయం. (ఏకారం నిశ్చయార్థకం)

ఉన్నతవంశంలో పుట్టుక, దానికి తగిన జ్ఞానభక్తివైరాగ్యాది సద్గుణాలు, వాటితో చేరిన మంచి ప్రవర్తన - అనే వీటిచేత మిక్కిలి కీర్తిని సంపాదించినవారు, కోయిల్కన్దాడై అణ్ణన్ అనే విశిష్టనామంతో వ్యవహరింపబడే మహనీయులు. వీరిని శరణంగా ఆశ్రయించిన ఒక వ్యక్తి తక్కువ కులంలో జన్మ, దుర్గుణాలు, తగని ప్రవర్తన - అనే వీటిని కల్గినవాడైనా, అణ్ణన్‌కు ఆశ్రయించిన ఆ క్షణంలోనే వారి మధురమైన కృపచేత దోషం అంతా తీరి ఔన్నత్యాన్ని పొందుతాడు. కాబట్టి, మణవాళమహామునులు అణ్ణన్‌ను తమ దాసులుగా చేసుకొన్నారు.

భగవత్సమాశ్రయణాన్ని చేసినవారినే ఆళ్వార్లు **“పరమనై ప్పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్ అవర్ కణ్డీర్ ఎమ్మై యాళుమ్ పరమర్”** (పరమాత్మను కీర్తించే సిరిని కలవారు ఎవరైనా వారేసుమా, మమ్ములను పాలించే గొప్పవారు), **“ఆళిప్పిరాన్ తన్నై పణియుమవర్ కణ్డీర్ ఎమ్మై యాళుడై నాదర్”** (శ్రీసుదర్శన

దారిని సేవించేవారే సుమా మమ్ములను పాలించే నాథులు.) ఇత్యాదిగాను, "**కడల్ మల్లైత్తలైశయనత్తుఱైకిన్ఱ ఞానత్తినొళియురువై నినైవార్ ఎన్ నాయకర్**" (కడల్ మల్లైత్తలైశయనం అనే దివ్యదేశంలో నివసించే జ్ఞానస్వరూపుడైన పరమాత్మను ధ్యానించేవారు మా నాయకులు.), "**కడల్మల్లై త్తలైశయనత్తుఱైవారై క్కొండాడుమ్ నెఞ్జుడైయార్ అవర్ ఎజ్గళ్ కులదెయ్వమ్**" (కడల్ మల్లైత్తలైశయనమ్ అనే క్షేత్రంలో నిత్యవాసం చేసే స్వామిని కీర్తించే మనసు కలవారు మా కులదైవం) ఇత్యాదిగాను తమకు స్వాములు అని అనుగ్రహించగా, పరమభాగవతులైన అణ్ణన్‌ను ఆశ్రయించినవారిని మాములులు తమకు స్వాములుగా అనుగ్రహించడం కింపునః న్యాయసిద్ధంకదా! ఈ తనియన్ యతీంద్రప్రవణప్రభావంలో కన్పిస్తున్నది.

ఈ తనియన్‌ను ఆచార్యులైన మణవాళమహామునులు తమ శిష్యులైన కోయిల్అణ్ణన్‌నుగూర్చి అనుగ్రహించారు. మణవాళమహామునుల దృష్టిని బట్టి చూస్తే మామునులు తమకు తమకు సబ్రహ్మచారి అయిన అణ్ణన్‌కు తనియన్‌ను అనుగ్రహించారనికూడా చెప్పవచ్చు. "**తాన్ హితోపదేశమ్ పణ్ణువ్బోదు తన్నైయుమ్, శిష్యనైయుమ్, ఫలత్తైయుమ్ మాఱాడి నినైక్కై క్రూరనిషిద్ధమ్**" (**శ్రీవచన-308**) (తాను హితోపదేశం చేసేటప్పుడు తనను, శిష్యుని, ప్రయోజనాన్ని వేరేవిధంగా భావించడం చాలా నిషిద్ధం) అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన తీరులోనే, ఆచార్యుడు తన శిష్యుని తనకు శిష్యునిగా తలచకుండా తన ఆచార్యుని శిష్యునిగానే - అంటే తనకు సబ్రహ్మచారిగానే భావించాలి. కాబట్టి శ్రీవచనభూషణంలోని గంభీరార్థాలను అన్నిటినీ గ్రహించి, ఆ సూక్తి క్రమంలో అనుష్ఠించేవారిలో మామునులు ఒకరు కనుక, అణ్ణన్‌ను తమకు సబ్రహ్మచారిగా భావించడం తగినదే కదా!

"**తన్నాశిరియన్ తన్నోడు క*ఱ్ఱో*న్ తన్మాణాక్కళ్ తకు మురైకారన్ ఎన్ఱిన్నోర్ పాయిర మియమ్బుదల్ కడనే**" (తన ఆచార్యులు, తనతో కలసి అధ్యయనం చేసిన సబ్రహ్మచారి, తన శిష్యులు - అని వీరు తనియన్‌ను రచించడానికి అర్హులు) (నన్నూల్-51) అని చెప్పబడ్డ రీతిలో ఆచార్యుడు తన శిష్యునకు తనియన్ అనుగ్రహించడం, సబ్రహ్మచారులిద్దఱిలో ఒకరు ఇంకొకరికి తనియన్ వ్రాయడం యుక్తమే. "**తన్నోడు క*ఱ్ఱో*న్**" అంటే సబ్రహ్మచారి.



శ్రీమణవాళమహామునులవిషయంగా
కోయిల్కన్దాడై అణ్ణన్ అనుగ్రహించిన

# కణ్ణినుణ్ శిఱుత్తామ్బు

అవ :- కోయిలణ్ణన్ ఈ మొదటి పాశురంలో సదాచార్యసంబంధాన్ని పొందిన మణవాళమహామునులను తాము అగతికులై ఆశ్రయించిన వైనాన్నిగూర్చి అనుగ్రహిస్తున్నారు.

**శీరుఱ్ఱ శెఞ్జొల్ తిరువాయ్మొழிప్పిళ్ళై శెమ్ముకముమ్**
**తారుఱ్ఱ మార్బుమ్ తళిరేయ్ పదఙ్గళుమ్ తమ్మనత్తు**
**పూరిత్తు వాழுమ్ మణవాళ మాముని పొన్నడికళ్**
**పారిల్ తనిత్త అడియేన్ శరణెన్ఱు పఱ్ఱిననే**

శీర్ ఉఱ్ఱ = గొప్పతనాన్ని కల్గిన, శెమ్ శొల్ = సత్యమైన శ్రీసూక్తులను అనుగ్రహిస్తున్న, తిరువాయ్మొழிప్పిళ్ళై = తిరువాయ్మొழிప్పిళ్ళై అనే తమ ఆచార్యుల, శెమ్ ముకమ్ = ఎఱ్ఱని (అందమైన) తిరుముఖమండలాన్ని, తార్ ఉఱ్ఱ = తామరపూసల, తులసిపూసల దండలను పొందికగా కల, మార్బుమ్ = వక్షః స్థలాన్ని, తళిర్ ఏయ్ పదఙ్గళుమ్ = చిగురుతో సాటి వచ్చే వారి శ్రీపాదాలను, తమ్ మనత్తు = శిష్యులైన తమ మనస్సులో, పూరిత్తు = నిండిస్తూ(ధ్యానిస్తూ), వాழுమ్ = ఆనందిస్తున్న, మణవాళమాముని పొన్ అడికళ్ = మణవాళ మహామునుల బంగారంవలె అభిలషించతగిన శ్రీపాదాలను, పారిల్ = ఈలోకం లో, తనిత్త = వేఱు ఉపాయం, గతి లేకుండా అనన్యగతికునిగా ఉన్న, అడియేన్= దాసుడనైన నేను, శరణ్ ఎన్ఱు = ఇవే మనకు రక్షకం అని, పఱ్ఱినేన్ = స్థిరమైన నమ్మకంతో ఆశ్రయించాను.

తిరువాయ్మొழிప్పిళ్ళై శ్రీసూక్తులు గొప్పవి, సత్యమైనవి. "శెమ్మై" అంటే భవిష్యత్తులో మంచినికల్గించే స్వభావం. యథార్థాన్ని తెలిపే స్వభావం. "శీర్" అంటే వినేటపుడు మధురంగా ఉండేవి. "**శీరుఱ్ఱ**" అనే విశేషణాన్ని తిరువాయ్ మొழிప్పిళ్ళైకు విశేషణంగా చేసి "కల్యాణగుణాలతో పూర్ణులైన" అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

'తిరువాయ్మొழிప్పిళ్ళై''- వీరు శ్రీపిళ్ళైలోకాచార్యులవారి శిష్యులు. శ్రీశైలేశులు, తిరుమలైయాழ்వార్ అనే తిరునామాలతో ప్రసిద్ధిని పొందిన వీరు, ఆழ்వార్లు అనుగ్రహించిన తిరువాయ్మొழிప్రబంధంలో అత్యంతాభినివేశాన్ని కల్గినవారు కావడంవల్ల తిరువాయ్మొழிప్పిళ్ళై- అనే పేరుతో వ్యవహరింపబడ్డారు.

వీరు మణవాళమహాමునులకు సాక్షాదాచార్యులు. వీరే శ్రీమణవాళ మహాముని లకు భగవద్రామానుజులపట్ల ఉత్కటమైన భక్తిని కలుగజేసి తన్మూలంగా యతిరాజవింశతి స్తోత్రరచనకు కారణభూతులయ్యారు. **“శ్రీమన్! యతీంద్ర! తవ దివ్యపదాబ్జసేవాం, శ్రీశైలనాథకరుణాపరిణామదత్తామ్”** అని యతిరాజవింశతిలో మణవాళమహామునులు ఈ అంశాన్ని తెలిపారు. ఇటువంటి గొప్పతనాన్నికల తిరువాయ్‌మొ*ళ్ణి* ప్పిళ్ళై తిరుముఖం, వక్షఃస్థలం శ్రీపాదాలు - అనే వీనిని సదా ధ్యానం చేసి, ఆనందించే మణవాళమహామునులను కోయిలణ్ణన్ తాము శరణంగా ఆశ్రయించిన విషయాన్ని ఇందులో తెలియజేశారు. **“తేశారుమ్ శిచ్చన్ అవన్ శీర్‌వడివై”** (తేజస్సు నిండిన శిష్యుడు గురువు యొక్క గొప్ప రూపాన్ని ధ్యానించాలి) అనే ఉపదేశరత్తినమాలై సూక్తిని అనుసంధేయం. **“పొన్”** (బంగారం) తనను అలంకరించుకొన్నవారికి తాను ప్రాప్యమై, రత్నాలు మొదలైన అమూల్యవస్తువులను పొందడానికి ఉపాయమై ఉన్నట్లే, శ్రీమణవాళమహామునుల శ్రీపాదాలుకూడా స్వయంప్రాప్యంగాను భగవానుని, భగవద్రామానుజులను పొందడంలో ఉపాయం గాను ఉండడంవల్ల మామునుల పాదాలు **“పొన్నడికళ్”** అని అనబడ్డాయి. ఇక, పావనత్వంలో, భోగ్యత్వంలో సువర్ణంతో సమానం కాబట్టి వారి శ్రీపాదాలు **“పొన్నడికళ్”** అని అనబడ్డాయి - అని అనడంలో కూడా ఔచిత్యం ఉన్నది. అచ్యుత పదాంబుజ యుగ్మరుక్మవ్యామోహాన్ని కలవారు శ్రీరామానుజులు కాగా, ఆచార్య పదాంబుజ యుగ్మరుక్మవ్యామోహాన్ని కలవారు అణ్ణన్. **“శరణ్”** - ఇష్టప్రాప్తి - అనిష్టనివారణరూప రక్షణానికి ఏ లోటు లేని ఉపాయం.

అవ:- తాము మణవాళమహామునులను ఆశ్రయించడానికి గల కారణాన్ని ఇందులో అణ్ణన్ తెలుపుతున్నారు. వారి ముఖోల్లాసంకోసం తిరువాయ్‌మొ*ళ్ణి*ప్పిళ్ళై శ్రీచరణాలను శరణాగతి చేస్తున్నారు.

**2. ప*ఱ్ఱి*నన్ శెమ్మై త్తిరువాయ్‌మొ*ళ్ణి*ప్పిళ్ళై ప్పాదఙ్గళ్**
**ఉ*ఱ్ఱ*నన్ శెమ్ మఱైయుళ్ళ దెల్లా మివై యుణ్మై యెన్డే**
**క*ఱ్ఱ*నన్ కోయిల్ మణవాళమాముని క్కార్‌ముకిలై**
**ప్పెఱ్ఱనన్ ఇఙ్గడియేన్ ఇనిమేల్ పిఱవామలుక్కే**

అడియేన్ = దాసుడను అయిన నేను, శెమ్మై = ఎట్టని, తిరువాయ్ మొ*ళ్ణి*ప్పిళ్ళై పాదఙ్గళ్ = తిరువాయ్‌మొ*ళ్ణి*ప్పిళ్ళై శ్రీచరణాలను, ప*ఱ్ఱి*నన్ = శరణంగా ఆశ్రయించాను. శెమ్ మఱై = ఋజువైన వేదాలలో, ఉళ్ళదు ఎల్లామ్= ఇపుడు అధ్యయనం చేయబడుతున్న శాఖలు అన్నిటిని, ఉవై ఉణ్మై ఎన్డు ఏ =

ఇవి అన్నీ యథార్థాన్ని ప్రతిపాదించేవి అని భావించే, ఉ*గ్ర్ర*నన్ = ఊనికను కల్గినవాడనై, క*గ్ర్ర*నన్ = అభ్యసించాను, ఇని మేల్ = ఇకపై వచ్చే దినాలలో, ఇఱ్ఱ పిఱవామలుక్కు= ఈ లోకంలో పుట్టకుండా, పరమపదాన్ని పొందడానికి, కోయిల్ మణవాళమాముని కళ్ = శ్రీరంగంలో నిత్యవాసం చేసే మణవాళమహామునులు అనే, కార్ ముకిలై = జలపూర్ణం అయిన మేఘాన్ని, పె*గ్ర్ర*నన్ = ఆచార్యునిగా ఆశ్రయించాను.

**"మఱై"** (వేదం) అనే పదం శిక్షా మొదలైన షడంగాలకు, మీమాంస మొదలైన ఎనిమిది ఉపాంగాలకు ఉపలక్షకం. **"మఱై యుళ్ళదెల్లావ*గ్ర్రై*యుమ్ క*గ్ర్ర*నన్"** అనే ప్రయోగంద్వారా అణ్ణన్ తమ విద్యావైభవాన్ని తెలుపుతున్నారని భావించరాదు. మఱి ఈ ప్రయోగంలోని తాత్పర్యం ఏమంటే - వేదాల్లో ప్రతిపాదింపబడే భక్తిమార్గం, ప్రపత్తిమార్గం జీవాత్మయొక్క స్వరూపం అయిన భగవత్పారతంత్ర్యానికి విరుద్ధాలు కాబట్టి, భగవానుడే ఉపాయం అనే మహావిశ్వాసం కల్గడం దుర్లభం కాబట్టి, అది నిష్ఫలం కాగా, వేదాధ్యయనాదులతో మాత్రమే మోక్షం సిద్ధించే అవకాశం లేదు -అని తెలుపడంకోసం ఈ ప్రయోగం చేయబడింది.

ఇంత నేర్చినా, మోక్షం కలిగే దారి లేదనే విషయం గ్రహించిన తరువాత, అందుకోసం మణవాళమామునులను ఆశ్రయించాను - అని కవి అంటున్నారు. **"పిఱవామలుక్కే మణవాళమాముని క్కార్ముకిలై పె*గ్ర్ర*నన్"** అనే ప్రయోగం ద్వారా మామునులు మోక్షాన్ని అనుగ్రహించడం తథ్యం - అని తెలుపడంకోసం వారిని **"కార్ ముకిల్"** అని అన్నారు. నీటిని నిండుగా కల మేఘం వర్షిస్తుంది అనే విషయం ఏ విధంగా తథ్యమో, ఆ రీతిలోనే మామునులు **"నీర్మై"** (కరుణ)ను కలవారు కనుక, అగతికులైనవారికి మోక్షాన్ని అనుగ్రహించడం తథ్యం- అన్నది ఇచటి తాత్పర్యం. **"భక్తియిల్ అశక్తనుక్కు ప్రపత్తి, ప్రపత్తియిల్ అశక్తునుక్కు ఇదు"** (ఆచార్యాభిమానం) అని వచించారుకదా శ్రీవచనభూషణంలో శ్రీపిళ్ళైలోకా చార్యులవారు.

శ్రీకూరేశులు శ్రీవైకుంఠస్తవంలోని మొదటి శ్లోకంలో **"రామనుజస్య చరణౌ శరణం ప్రపద్యే"** అని భగవద్రామానుజులను శరణాగతి చేసి, వారి ముఖోల్లాసం కోసం **"సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్"** అని అంటూ రెండవ శ్లోకంలో నమ్మాళ్వార్లను శరణాగతి చేసినట్లే, అణ్ణన్‌కూడా మొదటి పాశురంలో మాముసు లను శరణాగతి చేసి, వారి ఆనందంకోసం తిరువాయ్‌మొ***ழி***పిళ్ళైను రెండవ పాశురంలో శరణాగతి చేస్తున్నారని చెప్పవచ్చు.

అవ:-తాము ఆశ్రయించిన మణవాళమామునులకు తిరువాయ్మొళ్రిప్పిళ్ళై మధురమైన కృపచేత లభించిన భగవద్రామానుజుల శ్రీచరణాలలోని ప్రావణ్యాన్ని గూర్చి చెప్పి, అటువంటి యతీంద్రప్రవణులైన మామునులను అందరూ మంగళా శాసనం చేయవలసి ఉండగా, ఆ రీతిలో చేయనివారిని ఇందులో నిందిస్తున్నారు.

3. **పిఱవామల్ వాళ్రవిక్కుమ్ పేరరుళాళర్ పెరుమై యెన్ఱుమ్**
**తుఱవాద శిన్దై యెతిరాశన్ తుయ్యపదఙ్గళ్ నెఞ్జిల్**
**మఱవాద శీలన్ మణవాళమాముని మామలర్త్తాళ్**
**పఱైయాద వాశకర్ యార్ అవర్ పఞ్జమాపాతకరే**

పిఱవామల్ = ఈ భూమిలో జన్మించి, దుఃఖించకుండా ఉండేటట్లు, వాళ్రవిక్కుమ్ = మోక్షానందాన్ని అనుగ్రహించడానికి కారణం అయిన, పేరరుళాళర్= పూర్ణమైన కృపను కలవాడైన శ్రీకాంచీ వరదరాజస్వామియొక్క, పెరుమై = మహిమలను, ఎన్ఱుమ్ తుఱవాద = ఎల్లప్పుడూ విడవకుండా అనుసంధించే, శిన్దై= మనస్సును గల, ఎతిరాశన్ = భగవద్రామానుజుల, తుయ్య పదఙ్గళ్ = పరిశుద్ధాలైన శ్రీపాదాలను, నెఞ్జిల్ మఱవాద = తమ మనస్సులో మఱువకుండా ఉండే, శీలన్= స్వభావాన్ని కల, మణవాళమాముని = శ్రీమణవాళమహామునులయొక్క, మా మలర్= ఎఱ్ఱని తామరలవంటి, తాళ్ = శ్రీచరణాలను, పఱైయాద = స్తుతించని (చాటింపు వేయని), వాశకర్ = పలుకులను కలవారు, యార్ = ఎవరో, అవర్ = వారు, పఞ్జ మా పాతకరే = అయిదు గొప్ప పాపాలను చేసినవారే కాగలరు.

భగవద్రామానుజులకు తిరుక్కచ్చినమ్బి మూలంగా ఆఱు వార్తలను అనుగ్రహించి, తన్మూలంగా పెరియనంబి శ్రీపాదాలలో వారిని ఆశ్రయింపజేసి, వారిని, ఆ రామానుజుల శ్రీచరణసంబంధంద్వారా లోకులను అందఱినీ ఉజ్జీవింపజేసేవాడు కాబట్టి కంచి వరదరాజస్వామిని **"పిఱవామల్ వాళ్రవిక్కుమ్ పేరరుళాళర్"** అని అన్నారు. **"పఱై"** అంటే డప్పువంటి వాద్యం. డప్పువేయడమంటే ప్రచారంచేయడమేకదా!

ఈ రీతిలో ఆఱు వార్తలను కృపజేసి, వింధ్యారణ్యంనుండి వేటగాని వేషంలో పెరున్దేవిత్తాయార్, తాను కలసి తమను కాంచీపురానికి తీసికొని వచ్చి, **"శాలక్కిణఱు"** నుండి శ్రీరామానుజులు తీసికొనివచ్చి సమర్పించిన తిరుమంజన తీర్థాన్ని స్వీకరించి ఆనందించి, వారి తిరువారాధనలోని అర్చామూర్తిరూపంలో

వేంచేసి ఉండి, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనే మహాపండితులను తమకు శిష్యులుగా మార్చి- ఈవిధంగా చేసిన పలు ఉపకారాలను శ్రీరామానుజుల కృతజ్ఞతానుసంధానరూపంగా నిరంతరం అనుసంధించేవారు కాబట్టి వారినిగూర్చి **"పేరరుళాళర్ పెరుమై యెన్ఱు న్తుఱవాద శిన్దై యెతిరాశన్"** అని అన్నారు.

తిరువాయ్‌మొళిప్పిళ్ళై కరుణమూలంగా తమకు కల్గిన యతీంద్ర ప్రావణ్యంచేత ఆ శ్రీరామానుజులను సదా ధ్యానం చేసే మామునులను ఉద్దేశించి **"ఎతిరాశన్ తుయ్య పదజ్గళ్ నెఞ్జిల్ మఱవాద శీలన్"** అని సాయించారు.

**"తెన్నత్తియూరర్ కழలిణైక్కీழ் పూణ్డవన్ పాళన్"** అయిన భగవద్రామానుజుల విషయంలో ప్రావణ్యాన్ని అత్యంతంగా కల్గి ఉండి, లోకులను ఉజ్జీవింపజేసే మామునులను **"శెయ్యతామరై త్తాళిణై వాழియే"** అని మంగళాశాసనం చేయడం ఉచితం కాగా, ఆ రీతిలో చేయకుండా, వ్యర్థప్రలాపాలను చేసే వంచకులను **"పఞ్జమా పాతకరే"** అని ఇందులో నిందించారు. అబద్ధంచెప్పడం, హత్య చేయడం, కల్లు తాగడం, దొంగిలించడం, పరస్త్రీలను కామించడం- అనే ఈ అయిదు మహాపాతకాలు అని అంటారు. పాశురంలోని చివరి ఏకారం నిశ్చయార్థకం.

అవ :- మణవాళమహామునులకు అనుకూలురు కానివారిని నిందించిన తరువాత, అనుకూలురైనవారికి మణవాలమామునులు మోక్షోపాయభూతులై ఉండే స్వభావాన్నిగూర్చి తెలుపుతున్నారు.

**4.** **పాతక ముళ్ళవై తామే యొழిత్తు ప్పరిన్దవర్క్కు**
**శ్శాతక మానదుమ్ ఈదెన్ఱు కొణ్డు చరణ్ కొడుక్కుమ్**
**మాతకవోన్ మణవాళమాముని ప్పరన్ మామలర్త్తాళ్**
**పాదుకైయై చ్చరణాయ్ ముడిమేల్కొణ్డు పற்றினర్క్కే**

మా తకవోన్ = గొప్ప కరుణను కల, మణవాళమాముని పరన్ = మణవాళ మహామునులు అనే మహాపురుషులు, మా మలర్ తాళ్ పాదుకైయై = ఎఱ్ఱని తామరపూలవంటి తమ శ్రీపాదాలలో సమర్పింపబడ్డ శ్రీపాదాలను, శరణ్ ఆయ్ = మోక్షోపాయంగా భావించి, ముడిమేల్ కొణ్డు = శిరస్సుపై దాల్చి (శిరసా వహించి), పற்றினర్క్కు = వానిని ఆశ్రయించినవారికి, పాతకమ్ = మోక్షానికి అవరోధాలై, ఉళ్ళవై = ఉన్న కర్మలను అన్నిటినీ, తామే పరిన్దు = (వారు కోరకపోయినా) తామే కోరి, ఒழిత్తు = పోగొట్టి, శాతకమానదు = (సాధకం) మోక్షోపాయం అనేది, ఈదు ఎన్ఱు = ఈ మా పాదాలే అని, కొణ్డు = నిశ్చయించి, చరణ్ = తమ చరణాలను, అవర్క్కు = వారికి, కొడుక్కుమ్ = (మోక్షోపాయంగా) అనుగ్రహిస్తారు.

**"మా తకవు"** - అంటే గొప్ప కరుణ. ఇక్కడ కరుణకు గొప్పతనం ఏమంటే ఏవిధమైన ప్రత్యుపకారాన్ని ఆశించని స్వభావం. తమ పాదుకలను శిరసా వహింపజేసి, తద్ద్వారా వారికి గల మోక్షేచ్ఛను వ్యక్తం చేయడం తప్ప వేఱు దేన్ని భావించకుండా ఉండడం. **"చరణ్ కొడుక్కుమ్"** అనే ప్రయోగానికి తమ శ్రీచరణాలను ఉపాయంగా అనుగ్రహించి, తన్మూలంగా వారికి మోక్షసిద్ధిని కల్గిస్తారు- అని భావం. ఇందువల్ల మాములు శరణ్యులని తెల్పినట్లయినది. **"తకవు"** అంటే అవరోధాలను పోగొట్టి, ఫలాన్ని ఇచ్చే శక్తిని, గొప్ప కరుణను కల్గి ఉండడం.

అవ :- పాపాన్ని పోగొట్టి, పరమపదాన్ని పొందించే మాముసుల పావనత్వాన్ని తెలిపిన తరువాత, భోగత్వాన్ని (అనుభవించదగిన సౌందర్యాన్ని కల్గి ఉండడాన్ని) గూర్చి ఇందులో ప్రస్తావిస్తున్నారు. లేక, మనకు మోక్షం అనుగ్రహించ కుండా పడరాని పాట్లు పెట్టినా, విడువడానికి వీలులేనట్లు కన్నులకు, మనస్సునకు మాధుర్యాన్ని కల్గించే తిరుమేని అందాన్ని మాముసులు కల్గి ఉండడాన్ని ప్రస్తుతిస్తున్నారు- అని కూడా చెప్పవచ్చు.

**5.** **నఱ్కేశవన్‌తమర్ న*ఱ్ఱ*వత్తోర్ నయనఙ్గళుక్కు**
**పొఱ్కోలమేనియన్ పూతలత్తోర్ శెయ్‌ద పుణ్ణియమామ్**
**ముక్కోల్ తరిత్త మణవాళమాముని మూర్‌త్తితనై**
**ఎక్కోడికాలముమ్ శిన్దై శెయ్‌వార్‌తముక్కు ఈడిలైయే**

నల్ కేశవన్ తమర్ = దాసులకు హితాన్నే చేసే కేశవునకు దాసులై, నల్ తవత్తోర్ నయనఙ్గళుక్కు =గొప్ప తపస్సు అయిన ఆచార్యాభిమానాన్ని కల్గినవారి కన్నులకు (విందుగా), పొన్ కోల మేనియన్ = మిక్కిలి అందమైన తిరుమేనిని కలవారు, పూ తలత్తోర్ = ఈ భూమిలో జన్మించినవారు అందఱు, శెయ్‌ద = చేసిన, పుణ్ణియమ్ ఆమ్ = పుణ్యంగా అవతరించినవారు, ముక్కోల్ తరిత్త = త్రిదండాన్ని ధరించినవారు అయిన, మణవాళ మా ముని= మణవాళమహాముసుల, మూర్‌త్తితనై = తిరుమేనిని, ఎక్కోడి కాలముమ్ = ఎన్ని కోట్ల యుగాల కాలం అయినా, శిన్దై శెయ్‌వార్‌క్కు = ధ్యానించి, ఆనందించేవారికి, ఈడు ఇలై = సాటివచ్చే వారెవరు లేదు. ఇది తథ్యం.

**"పొన్నుమ్", "కోలమ్"** అనే ఈ రెండు పదాలకు అందమనే అర్థం. ఒకే అర్థాన్ని చెప్పే ఈ రెండు పదాలను కలిపి **"పొఱ్కోలమ్"** అని ప్రయోగించడంవల్ల ''మిక్కిలి అందమైన'' అనే అర్థం వ్యక్తం అవుతుంది. లేక, ఒక పదంద్వారా

సముదాయశోభ అనే లావణ్యం, వేఱొక పదంద్వారా ప్రత్యంగశోభ అనే సౌందర్యం- అనే రెండూ చెప్పబడ్డాయని అనవచ్చు. **"తవమ్"**- ఆచార్యాభిమానం అనే తపస్సు. **"కోళరియై వేఱాక ఏత్తి యిరుప్పారై వెల్లుమే మఱ్ఱవరై చ్చార్త్తియిరుప్పార్ తవమ్"** (నరసింహమూర్తిని విలక్షణుడని స్తుతించేవారి తపస్సును, ఆ భక్తులను సేవించేవారి తపస్సు జయిస్తుంది) (నాన్ముకన్-18) అనే తిరుమழிశైప్పిరాన్ శ్రీసూక్తిలో **"తవమ్"** అనే పదం ఆచార్యాభిమానం అనే అర్థంలో ప్రయోగింపబడడాన్ని గమనించవచ్చు. నిజమైన అందం అందంగా తోచాలని అంటే దానికి పుణ్యం చేసి ఉండాలికదా! అదే ఇచట ఆచార్యాభిమానరూపమైన తపస్సుగా చెప్పబడింది.

**"ఎప్పొழுదుమ్ నాళ్ తిఙ్గళ్ ఆణ్డూழி యూழிతోఱుమ్ అప్పొழுదైక్క ప్పొழுదు ఎన్నారావముదమే"** (ఏ సమయంలోనైనా దినాలు, వారాలు, సంవత్సరాలు, యుగాలు, యుగాలతరబడి అనుభవించినా ఎప్పటికప్పుడు తృప్తిని కలిగించని విలక్షణమైన అమృతంవలే తోచేవాడు) అనే రీతిలో భగవానుని దివ్యమంగళ విగ్రహం భక్తులకు అపర్యాప్తామృతంగా (ఇక చాలు అని తృప్తిని కల్గించని అమృతంగా) భాసించేటట్లే, ఆచార్యభక్తిని కలవారికి మామునుల తిరుమేని ఆరావముదంగా తోస్తుంది. **"ఈడిలై"** అనే ప్రయోగంద్వారా సదా భగవానుని అనుభవించే నమ్మాழ்వార్లు మొదలైనవారు, మామునుల దివ్యతిరు మేనిని సదా చింతన చేసే తమకు సాటిరారు అనే భావం స్ఫురిస్తుంది. దీనినిబట్టి భగవానుని తిరుమేనికంటే మామునుల తిరుమేని గొప్పది - అని వ్యక్తం అవుతున్నది. **"ఞాల ముణ్డ ఞానమూర్త్తి"** అయిన నారాయణుని తిరుమేని కేవలం **"కోలమేని"**. మామునుల తిరుమేని **"పొఱ్కోలమేని"** కదా!

శ్రీవేదాంతదేశికులు యతిరాజసప్తతిలో భగవద్రామానుజులను **"త్రిజగత్పుణ్యఫలం త్రిదండహస్తమ్"** (త్రిదండాన్ని చేతిలో కలిగిన ముల్లోకాల పుణ్యం) అని కీర్తించారు. వీరు యతివరపు నరవతారభూతులైన మామునులను **"పూతలత్తోర్ శెయ్‌ద పుణ్ణియమామ్ ముక్కోల్ తరిత్త మణవాళమాముని"** అని అన్నారు. **"పూతలత్తోర్ శెయ్‌ద పుణ్ణియమాయ్ ముక్కోల్ తరిత్త"** అనే ఇంకొక పాఠం కనబడుతున్నది. తదనుసారం మామునులు త్రిదండాన్ని ధరించడం - భూలోకవాసులు చేసిన పుణ్యంయొక్క ఫలం - అనే భావం స్ఫురిస్తుంది.

అట్లే, **"కోటి"** **(కోడి)** అనే పదానికి **"మూలై"**- ఒక చిన్న భాగం అనే అర్థాన్ని గ్రహించి, **"అక్కోటికాలముమ్"** అన్నపుడు **"కాలై, మాలై, పకల్, ఇరవు"** అనే ఏ

చిన్నపొద్దులో (కాలంలో) అయినా మణవాళమహామునుల మూర్తిని ధ్యానించేవారికి సాటి ఎవరూ లేరు- అనే అర్థం చెప్పవచ్చు. ఇది కొంత క్లిష్టకల్పనగా తోచినా, "భగవానుని సదా ధ్యానించే ఆళ్వార్లుకూడా మణవాళమామునులను క్షణకాలం అయినా ధ్యానించేవారికి సమానులు కారు'' అనే అర్థవిశేషం స్ఫురిస్తున్నందున క్లిష్టత సహ్యమే. "ఫలముఖగౌరవం న దోషాయ"అనే శాస్త్రవచనం ఇక్కడ అనుసంధేయం. "ఎక్కోటికాలముమ్ శిన్దై శెయ్‌వార్‌తమర్క్కేడిలైయే" అనే పాఠం ఉండి ఉంటే యుక్తంగా ఉంటుంది. భావించే మామునుల దాసులకు ఎవరు సాటి లేరు - అని దాని భావం.

అవ :- ముందు శ్లోకంలో అణ్ణన్ మామునుల మూర్తి యొక్క ధ్యానాన్ని గూర్చి ప్రస్తావించారు. ఇందులో వారు చేసే ఉపకారాలను, వాటికి తాము జితులైన వైనాన్ని, తాము వారిని మంగళాశాసనాన్ని చేసే రీతినిగూర్చి పల్కుతున్నారు.

6. ఇల్లై యెన్డ్రే యెణ్ణి యెన్‌పవక్కాట్టై యెరియిలిట్టు
నల్లరుణ్‌మారి పెయ్‌దెన్నై త్తళిర్‌ప్పిత్తు నన్గు తన్బాల్
తొల్లరుణ్ ఞానమ్ విళై త్తాళ్న్ద పోకత్తై త్తుయ్‌ప్పిక్కవే
వల్లవన్ కోయిల్ మణవాళయోకియై వాళ్‌త్తువనే

ఎన్ పవ క్కాట్టై = నా జన్మ అనే అడవిని, ఇల్లై ఎన్డ్రే ఎణ్ణి = ఇక మాకు పాపం అనేది లేదు అని భావించేటట్లు, ఎరియిల్ ఇట్టు = తమ కోపాగ్నికి ఎర చేసి, దహించి వేసి, ఎన్నై = దుష్కర్మ అనే నిప్పులో బాధపడే నాపై, నల్ అరుళ్= నిర్హేతుక కృపాకటాక్షం అనే, మారి పెయ్‌దు = చల్లని వానను కురిపించి, తళిర్‌ప్పిత్తు = (బాధను తీర్చి) ఉపశమింపజేసి, తన్‌పాల్ = తమ పట్ల, తొల్ అరుళ్ = పూర్వం ఆచార్యులచేత అనుగ్రహింపబడ్డ, ఞానమ్ విళై = తత్త్వ-హిత-పురుషార్థజ్ఞానాన్ని, నన్గు తళిర్‌ప్పిత్తు = చక్కగా ఉపదేశాదులతో కల్గించి, ఆళ్న్ద పోకత్తై = మిక్కిలి గాఢమైన పరమపదసుఖాన్ని, తుయ్‌ప్పిక్కవే = దాసుడు అనుభవించేటట్లు చేయడానికే, వల్లవన్ = సమర్థులైన, కోయిల్ మణవాళ యోకియై = శ్రీరంగాన్ని నిరూపకంగాకల మణవాళ మామునులను, వాళ్‌త్తువన్= స్తుతిస్తాను.

"పవమ్" - అనే పదం సంసారం (జన్మమరణాల పరంపరారూపం), దానికి కారణంగాను, కార్యంగాను అనువర్తిస్తున్న పాపాలను ఈ పదం తెలుపుతుంది. తత్త్వజ్ఞానాన్ని, మోక్షాన్ని ఆటంకపఱచగలిగే పాపాలు పేరుకొనిపోయి ఉండడంవల్ల, వృక్షాల సమూహాన్ని వనం అన్నట్లే, ఈ పాపాలను అడవిగా రూపించారు. "ఇఱవు

శెయ్యుమ్ పావక్కాడు" అని అన్నారు కదా పెరియాళ్వార్లు. "ఎణ్ణి" -లెక్కించేటట్లు అని అర్థం. ఇది "ఎచ్చత్తిరిపు" - కృదంతవ్యత్యయరూపం. "ఆళ్న్ద పోకమ్" అవిచ్ఛిన్నంగా, ఉన్నతంగా ఉండే భోగం. "న చ పునరావర్తతే" అనే రీతిలో పునరాగమనం లేని పరమపదానుభవం - అని తాత్పర్యం. పాపారణ్యం దహింప బడడం, నిర్హేతుకకృపావర్షం కురవడం, తత్త్వజ్ఞానం అంకురించడం గంభీరమైన భోగాన్ని అనుభవింపజేయడం -అనేవి అణ్ణన్‌కు మామునులు చేసిన ఉపకారాలు. వాటికి జితులై అణ్ణన్ ఇందులో మంగళాశాసనం చేశారు. "తుయ్ప్పిక్కవే" అనే ప్రయోగంలోని ఏకారం అన్యయోగవ్యవచ్ఛేదకం. మామునులసంబంధం ఏనాడూ బంధహేతువు కాదు, మోక్షానికి హేతువు అవుతుంది - అని దీని భావం. "వాళ్త్తువనే" అనే పదంలోని ఏకారం వాక్యాలంకారం.

అవ :- అయిదవ పాశురంలో మానసికమైన ధ్యానాన్ని, ఆఱవ పాశురంలో వాచికమైన స్తోత్రాన్ని తెలిపి, ఇందులో కాయిక ప్రణామాన్నిగూర్చి పలుకుతున్నారు. "యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి" (దేనిని మనస్సుతో ధ్యానిస్తున్నాడో దానిని మాటతో పల్కుతున్నాడు, దానిని చేతలతో చేస్తున్నాడు) అనే రీతిలో ఆర్జవాన్నికల మహాత్ములు భావించేది, స్తుతించేది, నమస్కరించేది ఒక్కరినేకదా!

7. **వాళ్త్తువ నెన్దై మణవాళమాముని మామలర్త్తాళ్**
**తాళ్త్తువన్ యానవన్ తాళిణైక్కీళ్ చ్చిరమ్ తారణియిల్**
**కాళ్త్తిడుమ్ శెల్వముదల్ ముక్కుఱుమ్బుమ్ కరిశఱవే**
**పాళ్త్తిడు మెన్తనతికోర పావఙ్గళ్ పఱ్ఱఱవే**

కాళ్త్తిడుమ్ = బాగా ముదిరి, చేవను కల్గి ఉండే, శెల్వమ్ ముదల్= సంపద మొదలైనవానివల్ల కలిగే, ముక్కుఱుమ్బు = మూడు మదాలు అనే, కరిశు= దోషాలను అన్నిటినీ, అఱ = తొలగించడంకోసం, పాళ్త్తిడుమ్ = దాసుడనైన నన్ను పాడుచేస్తున్న, ఎన్తన్ = నా, అతి కోర పావఙ్గళ్= మిక్కిలి భయంకరం అయిన దుష్కర్మలను, పఱ్ఱు అఱ = నిరాలంబనంగా నశింపజేయడంకోసం, యాన్ = నేను, ఎన్దై = దాసుని (జ్ఞానపిత) ఆచార్యులైన, మణవాళమాముని మా మలర్ తాళ్= మణవాళమహామునులగొప్ప, తామరపూలవంటి శ్రీచరణాలను, వాళ్త్తువన్= స్తుతించేవాడనై, అవన్ తాళిణై క్కీళ్ =ఆస్వామి శ్రీపాదాలజంట కిందగల, తారణియిల్ =భూమిపై, శిరమ్ తాళ్త్తువన్ =తలను తాకించి, మొక్కుతాను.

**"ముక్కుఱుమ్బు"** -మూడు మదాలు. అవి ఏవి? అని అంటే, విద్య, ధనం, అభిజాత్యం -అనే మూడింటివల్ల కలిగే మదాలు. **"విద్యామదో ధనమద స్తృతీయోஉభిజనమదః"** అని సూక్తి. ఈ మూడు విధాలైన మదాలు ఆచార్యానుగ్రహంవల్ల తప్ప స్వప్రయత్నంలో తొలగని రీతిలో మిక్కిలి బలపడి, ముదిరి ఉండడంచేత **"కాఱ్ఱిడుమ్ ముక్కుఱుమ్బు"** అని అన్నారు. **"వాఱ్ఱువన్"** -స్తుతించేవాడనై - అని అర్థం. శత్రర్థకరూపం ఇది. **"తాఱ్ఱువన్"** అనే సమాపక క్రియతో అన్వయిస్తుంది.

**"తారణియిల్ శిరమ్ తాఱ్ఱువన్"** -ఇక్కడ **"శిరమ్"** అనే పదం వక్షస్సు, చేతులు, పాదాలు మొదలైన వానికి ఉపలక్షణమై, వీటితో భూమిపై పడి సాష్టాంగ ప్రణామాన్ని చేయడాన్ని సూచిస్తుంది. మూడవ, నాల్గవ పాదాలలో చివరగల ఏకారం వాక్యాలంకారం.

అవ :- కొందరు కోయిలణ్ణన్ దగ్గఱకు వచ్చి - "చాలామంది మామునులు పాపాలను పోగొట్టి, రక్షించడంకోసం వారి పాదుకలను శిరసా వహించాలని అనుకుంటున్నారు. జ్ఞానాన్ని పొంది, దృఢమైన యోగాన్ని సాధించడంకోసం వారిని స్తుతించాలని అనుకుంటున్నారు. విద్యా-ధన- అభిజన మదాలనే మూడు మదాలు తీరడంకోసం, అతిఘోరపాపాలు నిర్మూలం కావడంకోసం వారి శ్రీపాదద్వంద్వం క్రింద శిరస్సు తాకించి, ప్రణామం చేయాలని అనుకుంటున్నారు. కాని, మేము మాత్రం మమ్మిలనే గొప్పవారని భావిస్తున్నాము. ఇతరులుకూడా కొందఱు మమ్మిలను ఆ విధంగానే పల్కి గౌరవిస్తున్నారు. ఈ విధంగా ప్రసిద్ధమైన గౌరవాన్ని కల్గిన మేము నలుగురు చూచే రీతిలో మామునుల పాదుకలను మా తలపై ధరించడానికి, వారిని స్తుతించడానికి, వారి శ్రీపాదాలలో శిరస్సును పెట్టి, నమస్కరించడానికి సిగ్గుపడుతున్నాము. ఉజ్జీవించాలనే ఆశ అయితే మాకు చాలా ఎక్కువగానే ఉన్నది. మామునుల గొప్పతనం కూడా మామనస్సులో తోచకపోలేదు. ఇటువంటి క్లిష్టదశలో మీరే మాకు ఉజ్జీవించే ఉపాయాన్ని రహస్యంగా ఉపదేశించాలి'' అని ప్రార్థించగా, "మీరు నల్గురికి తెలిసే రీతిలో ఏమీ చేయవద్దు. మామునులను మనస్సులో చింతిస్తేనే చాలు. మీ దుష్కర్మలు అన్నీ పోయి, మోక్షం సిద్ధిస్తుంది. ఆ పనిని చేయండి'' అని వారికి ఈపాశురంలో అణ్ణన్ ఉపదేశిస్తున్నారు.

8. **పావఙ్గళ్ పఱ్ఱఱుమ్ పాశఙ్గళ్ పఱ్ఱఱుమ్ పఱ్ఱి వైకున్దమ్**
**కోవఙ్గళ్ పఱ్ఱఱుమ్ కుఱ్ఱఙ్గళ్ పఱ్ఱఱుమ్ కోటిశన్మ**

**త్తాపఙ్గళ్ ప*ఱ్ఱ*ఱుమ్ తణ్ణరఙ్గన్ పుక*ఝ్* శాన్తకుణ**
**తీవన్ కరుణై మణవాళయోకియై చ్చిన్దిక్కవే**

తణ్ అరఙ్గన్ పుక*ఝ్* = చల్లని శ్రీరంగంలో నివాసం ఉన్న "**అ*ఝ*కియ మణవాళన్**"గా పొగడబడేవారై, శాన్తగుణ తీవన్ = శాంతమనే గుణంతో (క్షమ అనే గుణంతో) ప్రకాశించేవారై, కరుణై = కృపాగుణమే మూర్తీభవించినవారైన, మణవాళ యోకియై = మణవాళమామునులను, శిన్దిక్కవే = భావించినమాత్రం లోనే, పాశఙ్గళ్=విషయాంతరాలలో ఉండే ఆశలు, ప*ఱ్ఱు* అఱుమ్ = పట్టుసడలి, తొలగిపోతాయి, ప*ఱ్ఱి* వైక్కుమ్ = మనలను ఆశ్రయించి, నిలచి ఉండే, కోపఙ్గళ్= కోపాలు, ప*ఱ్ఱు* అఱుమ్ =పట్టుసడలి, నశిస్తాయి, కు*ఱ్ఱ*ఙ్గళ్ = మిగిలిన లోభం మొదలైన దోషాలు, ప*ఱ్ఱు* అఱుమ్ = పట్టువీడి నశిస్తాయి, పావఙ్గళ్ = పూర్వం తెల్పిన ఆశ, కోపం మొదలైన దోషాలచేత సంభవించే పాపాలు, ప*ఱ్ఱు* అఱుమ్= పట్టు వదలి, రూపుమాసిపోతాయి. కోటి శన్మ త్తాపఙ్గళ్ = ఆ పాపాల పర్యవసానంగా కోటిసంఖ్యలోని జన్మలలో మనం అనుభవించే దుఃఖాలు, ప*ఱ్ఱు* అఱుమ్ = పట్టుసడలి, నశిస్తాయి.

అన్ని దివ్యదేశాలలోను ముఖ్యం అయిన శ్రీరంగంలో వేంచేసి ఉండే సకలార్చావతారమూలకందం అయిన అ*ఝ*కియమణవాళప్పెరుమాళ్ (శ్రీరంగ నాథుని ఉత్సవమూర్తి) చేత "**శ్రీశైలేశదయాపాత్రమ్**" ఇత్యాది తనియన్ శ్లోకంద్వారా పొగడబడినవారు, క్షమాగుణంచేత ప్రకాశించేవారు, దయాగుణమే రూపుదిద్దు కొన్నట్లున్నవారు- అని ఈ రీతిలోని గొప్పతనాన్ని కల మామునులను ఎవరికీ తెలియకుండా మనస్సులో ధ్యానిస్తే చాలు. ఉన్నత గతిని పొందడానికి మీరు విస్తృతంగా ఏమీ చేయనక్కఱలేదు- అని తెలిపినట్లయింది.

"**తాపఙ్గళ్**" -"**తున్బఙ్గళ్**" (దుఃఖాలు). ఇవి ఆధ్యాత్మిక- ఆధిభౌతిక- ఆధిదైవికాలని మూడు విధాలు. శరీరంవల్ల కలిగే వ్యాధులు, మనస్సువల్ల కలిగే ఆధులు-ఆధ్యాత్మికాలు. ఆత్మ అంటే శరీరమని, మనస్సు అనీ కూడా అర్థం ఉన్నది. పులులు, సింహాలు, పాములు, చోరులు - మొదలైనవాటివల్ల కలిగే బాధలు ఆధిభౌతికాలు. భూతం అంటే ప్రాణి. సూర్యుడు, అగ్ని, వాయువు- ఇత్యాదులవల్ల కలిగే బాధలు ఆధిదైవికాలు. దైవం అంటే దేవత.

"శిన్దిక్కవే"- ఇచటి ఏకారం అన్యయోగవ్యవచ్ఛేదకం. ఇది పాదుకలను ధరించడం, స్తుతించడం, నమస్కరించడం మొదలైనవానిని వ్యవచ్ఛేదిస్తుంది. భగవద్విషయంలో సైతం "**శి*ఱ్ఱ*వేణ్డా శిన్దిప్పే అమైయుమ్**" (భయపడవద్దు,

చింతనయే చాలు) అని చెప్పబడు తుండగా, ఆచార్యవిషయంలో అది కైముతికన్యాయసిద్ధంకదా! సర్వేశ్వరుడు కారుణికుడు అయితే ఆచార్యుడు పరమకారుణికుడు కదా!

అవ :- "యథార్థాన్ని గమనిస్తే, మామునులు తమ మహిమను భావించే వారినే కాదు, అసూయను పొంది, తమను నిందించేవారినికూడా విడువకుండా మామునులు ఉజ్జీవింపజేస్తారు. ఈ నిజాన్ని నీవు ఓ మనసా! తెలిసికో" అని అంటూ తమ మనస్సుకు అణ్ణన్ రహస్యంగా ఇందులో ఉపదేశిస్తున్నారు.

9. శిన్దిత్తరజ్గరై చ్చిన్దై ప్పయజ్కెడ చ్చెన్నితన్నాల్
వన్దిత్తు నిచ్చలుమ్ వాయార వాழ்త్తు మెయ్మ్మా మఱైయోర్
పున్దిక్కుళ్ మేవుమ్ వరయోకి తమ్మై ప్పుకైన్దు శిలర్
నిన్దిక్కినుమే వీడారిదుకాణవర్ నీర్మై నెఞ్జే

నెఞ్జమే = నాకు అనుకూలమైన, భవ్యమైన మనసా!, శిన్దై = తమ మనస్సు, పయమ్ కెడ = ఐహికంగా, ఆముష్మికంగా ఏర్పడే భయం తీరి, నిర్భయంగా ఉండడంకోసం, నిచ్చలుమ్ =నిత్యం, అరజ్గరై = శ్రీరంగనాథుణ్ణి, శిన్దిత్తు = ధ్యానించి, శెన్నితన్నాల్ = శిరస్సుతో, వన్దిత్తు = నమస్కరించి, వాయ్ ఆర = నోరార, వాழ்త్తుమ్= మంగళాశాసనాన్ని చేసే, మెయ్ మా మఱైయోర్ = నిజమైన, గొప్ప బ్రాహ్మణుల, పున్దిక్కుళ్ = మనస్సులో, మేవుమ్ = (ధ్యానింపబడి) పొందికగా ఉన్న, వరయోకి తమ్మై = మామునులు తమను, శిలర్ = వారి మహిమను తెలియని కొందఱు, పుకైన్దు = ఓర్వలేక, అసూయపడి, నిన్దిక్కిలుమ్ = నిందించినప్పటికీ, విడార్ =వారినికూడా విడువకుండా, తరింపజేస్తారు, అవర్ నీర్మై = ఆ మణవాళమామునుల గొప్పతనం, ఇదు కాణ్ = ఇటువంటిది అని గ్రహించు.

ఓ మనసా ! మణవాళమామునులు శ్రీరంగనాథునిచేత కీర్తింపబడిన వారు. క్షమను, కృపను నిండుగా కలవారు. కొందఱు వీరి ఈ మహిమలను చూచి సహించలేక నిందించినా ఆ నిందలను సహించి, వారి దుర్గతిని చూచి సహించలేని స్వభావం అనే కరుణతో వారినికూడా తమ దాసులతో సమానంగా రక్షిస్తారు మామునులు- అని ఉపదేశించినట్లయింది. ఇందువల్ల **"నాన్ పెற்ற పేఱు నాలూరానుమ్ పెఱవేణుమ్"** (నేను పొందిన ఫలం నాలూరాన్ కూడా పొందాలి) అని వరదరాజస్వామిని ప్రార్థించిన కూరేశులు వంటివారు శ్రీమణవాళమామునులు అని అన్నట్లయింది. భగవానుడు **"రిపూణా మపి వత్సలః"** (శత్రువుల విషయంలో

కూడా వాత్సల్యాన్ని కలవాడు). పిరాట్టి **"రిపూణా మపి వత్సలతర"**. కూరేశులు, మామునులు **"రిపూణామపి వత్సల"**తములు. మహాచార్యులలోకూడా కూరేశులతో, మామును లతో సాటి వచ్చేవారెవరూ లేరు. **"నిన్దిక్కినుమే"**, **"నెఞ్జే"** అనే ప్రయోగాలలోని ఏకారం వాక్యాలంకారం.

అవ :- ఎనిమిదవ పాశురంలో పల్కినట్లు మామునులను స్తుతించడమో, ప్రణమిల్లడమో చేయనక్కఱలేదు, భావిస్తేనే చాలు, వారికి ఉజ్జీవనం లభించడం తథ్యం- అనే సూక్తిని వినిన కొందఱు, తొమ్మిదవ పాశురంలో తెలిపిన తమను నిందించేవారినిసైతం మామునులు విడువకుండా తరింపజేస్తారు - అనే వారి సౌలభ్యాన్ని వినిన తమ మనస్సు "ఇటువంటి మామునుల సేవను అందఱూ కీర్తిస్తున్నారా? వారిని అందఱు ప్రేమిస్తున్నారా? ఆ రీతిలో కనపడడంలేదే ! దీనికి ఏం కారణం? అని ప్రశ్నించగా, "మన సంప్రదాయానికే చెందిన కొందఱు తమ పాపఫలంగా వారిని నిందిస్తున్నారు. మిగిలిన సంప్రదాయాలకు చెందిన మఱి కొందఱు అయితే - అనాదిపాపవాసనాఫలంగా బుద్ధి చెడి, భగవానుడనేవాడు లేడు; ఉన్నా అతనికి రూపం లేదు, గుణాలు లేవు, విభూతి లేదు- అని వాదించి, చివరకు మామునులవద్ద ఓడిపోయి, వారిని నిందిస్తున్నారు. వారిని ఆ రీతిలోనే ఉండనీయండి. పెక్కుమంది శ్రీరంగనాథునకు ఆచార్యులై, ఆ స్వామిని భావించి, నమస్కరించి స్తుతించే వైదికులైన మహనీయులచేత సదా ధ్యానింపబడే ఆ మామునులు అనుగ్రహించే సేవను "ఇది పావనం, పరమభోగ్యం'' అని కీర్తించి, వారిని అభిమానిస్తున్నారు'' అని అంటూ తమను ప్రశ్నించినవారికి, తమ మనస్సుకు అణ్ణన్ సమాధానం పలుకుతున్నారు.

**10. నెఞ్జే యనైయ వడియార్ నిఱమ్ కొణ్డ నిచ్చయమామ్**
**మఞ్జేఱు శోలై యరఙ్గప్పదితనిల్ వాదియర్క్కు**
**నఞ్జే యనైయ మణవాళయోకి యిన్నాళళిక్కుమ్**
**తఞ్జేవైతన్నై యికళ్వార్క్కల్లాల్ అవర్ తామిట్టరే**

మఞ్జు ఏఱు శోలై = మేఘాలు అధిరోహించి, చేరిఉండే తోటలచేత చుట్టబడిన, అరఙ్గమ్ పదితనిల్ = శ్రీరంగం అనే నగరంలో, వాదియర్క్కు = వ్యర్థవాదాలను చేసేవారికి, నఞ్జే యనైయ = విషంవంటివారైన, మణవాళ యోకి= మణవాళమామునులు, ఇన్నాళ్ = (మనం జీవించే భాగ్యాన్ని పొందిన) ఈ కాలంలో, అళిక్కుమ్ = సర్వస్వదానంగా అనుగ్రహించే, తమ్‌సేవై తన్నై= పావనం, భోగ్యం అయిన తమ దర్శనాన్ని, ఇకళ్వార్క్కు అల్లార్ = నిందించే కొందఱు

భాగ్యహీనులకు తప్ప మిగిలిన అందఱికీ, అవర్‌తామ్ = ఆ మామునులు, ఇట్టరే = ఇష్టులే. (ఇది), నెఞ్జే అనైయ = మామునుల మనస్సువలె వారికి అంతరంగులైన, అడియార్ = దాసులు, నిఱమ్ కొణ్డ = తమ మనస్సులో విడువకుండా గ్రహించిన, నిచ్చయమ్ ఆమ్ = యథార్థం.

ఈ పాశురంద్వారా "కరువిలే తిరువిలాద" అన్నట్లు గర్భదరిద్రులకు తప్ప భాగ్యవంతులందఱినీ మామునుల ఇష్టులు - అని దాసుని నిశ్చయమే కాదు, అసంఖ్యాకులైన వారి దాసుల నిశ్చయం కూడా ఇదే అని తెలిపి, తమ మనస్సుకు, తమను ప్రశ్నించిన కొందఱికి స్పష్టంచేశారు.

"తఞ్జేనైతన్ని యికళ్ళ్‌వార్‌క్కల్లార్ అవర్‌తా మిట్టరే" అన్నది పాఠాంతరం. దానిప్రకారం. నిందించేవారు విద్యాజ్ఞానగంధం లేనివారు. వారు భగవద్భాగవతా చార్యులకు ఇష్టులా! ఇష్టులుకారు - అని భావం. (ఇచటి ఏకారం కాకువు, వ్యతిరేకార్థకమైన ప్రశ్నారూపం) ముందుపాఠంలో "ఇట్టరే" అనే పదంలోని ఏకారం నిశ్చయార్థకం. ఇష్టులు అనేది సత్యం - అన్నది దాని తాత్పర్యం. "నెఞ్జే, నఞ్జే" అనే పదాలలోని ఏకారం వాక్యాలంకారం.

అవ:- ఈ భూలోకంలోని వారందఱూ కీర్తించినపుడేకదా ఎవరి గొప్పతనం అయినా పరిపూర్ణం అవుతుంది, ప్రకాశిస్తుంది. కొంతమంది నిందించినందువల్ల మామునుల గొప్పతనానికి లోటు రాదా? అని అంటే, మహామునుల అవతారం భగవదవతారంవలె దుష్టనిగ్రహ - శిష్టపరిపాలనార్థం కనుక, యథార్థాన్ని గ్రహించ లేని మూర్ఖులు నిందిస్తే దానికి ఏ కొఱత రాదని అణ్ణన్ ఇందులో తెలుపుతున్నారు.

**11. ఇట్టర్‌కళ్ వాళ్ ఎతిరాశర్ వాళ్ ఇరునిలత్తే**
**శిట్టర్‌కళ్ వాళ్ నన్దేశికర్ వాళ్ చ్చెకత్తినుళ్ళ**
**తుట్టర్‌కళ్ మాళ మణవాళమాముని తోన్టిననే**
**ఎట్టు మిరణ్డు మఱియార్ ఇఙ్గేశినుమ్ యా వరుమే**

మణవాళమాముని= మణవాళమహామునులు, ఇరు నిలత్తే = విశాలమైన భూమిలోఉండే, ఇట్టర్‌కళ్ వాళ్ = భగవద్భక్తులు తరించేటట్లు, ఎతిరాశర్ వాళ్= భగవద్రామానుజుల ఉజ్జీవించేటట్లు, శిట్టర్‌కళ్ వాళ్ = సదాచారసంపన్నులు తరించే టట్లు,శెకత్తిల్ ఉళ్ళ = భూమిలో ఉండే, తుట్టర్‌కళ్ మాళ = దుష్టులు నశించేటట్లు, తోన్టినన్ ఏ = అవతరించారు అన్నది నిశ్చయం, ఎట్టుమ్ ఇరణ్డుమ్ అఱియార్ = ఎనిమిది, రెండు కలిపితే పది అవుతుందని తెలియనివారు, ఇఙ్గు= ఈలోకంలో, ఏశినుమ్ = నిందిస్తే, యా వరుమ్=ఏ కొఱత కల్గుతుంది? (ఏదీ కలుగదు)

ఈ విశాలభూమిలో- భగవద్భక్తులు, వారు కీర్తించే భగవద్రామానుజులు, వారి సిద్ధాంతాన్ని నమ్మి ఆచరించే పరమవైదికులైన శిష్టులు, వారిలో కొందఱైన మనకు సదుపదేశం చేసే పూర్వాచార్యులు- అనే సాధువులు అందఱు "సన్మార్గాన్ని ఉద్ధరించే మాములు అవతరించారు. ఇక ఏ కొఱత లేదు'' అని ఆనందించడం కోసం, పాపులైన బాహ్య-కుదృష్టి మతస్థులు "మన సిద్ధాంతం నశించింది'' అని భయపడి రూపు మాసిపోవడంకోసం మణవాళమహామునులు అవతరించారు- అని తాత్పర్యం. ఇందువల్ల **"పరిత్రాణాయ సాధూనామ్"** (సత్పురుషులను రక్షించడంకోసం) అనే రీతిలో భగవానుని అవతారంవంటిదే మణవాళ మహామునుల అవతారంకూడా -అని తెలిపినట్లయింది. భగవానుడు **"అవజానంతి మాం మూఢాః"** (నా గొప్పతనాన్ని తెలియని మూఢులు నన్ను అనాదరిస్తున్నారు) అని గీతలో అన్నాడు. ఈ విధంగా అవమానించినందువల్ల ఆ భగవానునకు ఏ కొఱత కల్గింది?; నిందించినవారు నశించారే తప్ప. ఆ రీతిలోనే మణవాళ మహామునులను కొందఱు మూఢులు నిందిస్తే దానివల్ల వారు నశించడం తప్ప, మామునులకు ఏ కొఱత రాదు- అని ఇచటి సారం.

**"ఎట్టు మిరణ్డు మఱియార్"** అనే ప్రయోగానికి -తిరుమంత్రమనబడే అష్టాక్షరిని, ద్వయమంత్రం అనే వాక్యద్వయాన్ని, లేక, ద్వయం, చరమశ్లోకం అనే రెండింటిని - అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. సామాన్యంగా ఈ రహస్యాలను అర్థంతోపాటు తెలిసినవారు వీటిని ఉపదేశించే ఆచార్యులను కీర్తిస్తారే తప్ప నిందించరు. విశేషించి, తిరుమంత్రం మధ్యలో ఉన్న నమఃపదంలో అర్థంగా తోచే భాగవతశేషత్వాన్ని తెలిసినవారికి భాగవతోత్తములైన ఆచార్యులను స్తుతించి, గౌరవించే అవకాశం ఉన్నది తప్ప, నిందించే ప్రసక్తి లేనే లేదు. వీటిని గ్రహించినవారే సత్తను పొందినవారు. తెలియనివారు మృతప్రాయులే. అందువల్ల, తెలియనివారు నిందిస్తే ఏ కొఱతలేదు- అనే అర్థంకూడా గ్రాహ్యమే. **"కఱ్ఱోర్కళ్ తా ముకప్పర్...... మఱ్ఱోర్కళ్ మాచ్చరియత్తాల్ ఇకழ్విల్ వన్దదెన్?"** (విజ్ఞులైనవారు సంతోషిస్తారు.... మిగిలినవారు మాత్సర్యంతో నిందిస్తేమాత్రం ఏమి?) అని అనుగ్రహించిన మామునుల శిష్యాగ్రగణ్యులు కాబట్టి వీరుకూడా (అణ్ణన్) **"ఏశిన్ యా వరుమ్"** అని అన్నారు. **"ఏశినుమ్"** ఇచట **"ఉమ్"** వాక్యాలంకారం. **"యా వరుమే"** అన్నపుడు **"యా"** అనే పదం అమహద్వాచక ప్రథమపురుష బహువచనంలోని ప్రశ్నార్థకరూపం. "ఏ-దోషాలు'' - అని అర్థం. **"యా వరుమే"** అనే పదంలోని ఏకారం **"ఇశైనిఱై"**, **"ఈఱ్ఱశై"** కాదు.

అవ :- ముందు పాశురంలో అవతారవిషయంలో అణ్ణన్ భగవానునకు-భగవద్రామానుజులకుమధ్య సామ్యాన్నిగూర్చి అనుగ్రహించారు. ఇందులో ద్రావిడవేదాంతప్రవర్తకత్వం అనే భగవానునకు లేని, మామునులకుండే అతిశయాన్ని గూర్చి అనుగ్రహిస్తున్నారు.

**12. యావరు ముయ్య మణవాళయోకి దయాళు వెన్న**
**పూమకళ్ మణ్మకళ్ పుణ్ణియమా యిన్ద ప్పూతలత్తే**
**తా మవతారమ్ శెయాదిరున్దాల్ శడకోపర్ తిరు**
**వాయ్మొழியోడు కడలోశైయోడెన్న వాశి యుణ్డే !**

మణవాళ యోకి = మణవాళమహామునులు, యావరుమ్ = నిందించే వారు, అన్యులు అనే అందఱు, ఉయ్య = ఉజ్జీవించడానికి అనువైన, దయాళు = దయాస్వభావులు, ఎన్న = అని లోకులుపలికేటట్లు, పూ మకళ్ మణ్ మకళ్ పుణ్ణియమాయ్ = లక్ష్మీదేవియొక్క, భూదేవియొక్క పుణ్యఫలంగా, ఇన్ద ప్పూతలత్తు = ఈ భూమిలో, తామ్ = మణవాళమహామునులు తాము, అవతారమ్ శెయాదిరున్దాల్ = అవతరించి ఉండకపోతే, శడకోపర్ తిరువాయ్మొழி యోడు = నమ్మాழ்వార్లు అనుగ్రహించిన తిరువాయ్మొழிకి, కడలోశైయోడు = సముద్రఘోషకు మధ్య, ఎన్న వాశి ఉణ్డు = ఏమి తారతమ్యం ఉంటుంది?

పూర్వశ్లోకంలో **"ఇట్టర్కళ్, ఎతిరాశర్, శిట్టర్కళ్, నమ్దేశికర్"**అనే పెద్దలందఱు ఉజ్జీవించేటట్లుగా సంభవించింది మణవాళమహామునుల అవతారం- అని తెలిపారు. ఇందులో ఆశ్రితులు, అన్యులు అనేవారు అందఱు ఉజ్జీవించేటట్లు మామునుల అవతారం సంభవించింది -అని అంటున్నారు.

అందఱిని ఉజ్జీవింపజేయాలని తలచి, చేతనులను సంస్కరించే శ్రమను స్వీకరించే లక్ష్మీదేవి, "నా పనిని మామునులు చేపడతారు. మనం ఇక సుఖంగా ఉండవచ్చు'' అని ఆనందించేటట్లు, పాపులను మోస్తూ బాధపడే భూదేవి "మామునులు గొప్ప కరుణతో పాపులను అందఱినీ పరమపదానికి చేర్చగలరు, నాకిక వారిని మోసే భారం అవసరం లేదు'' అని ఆనందించేటట్లు మామునులు అవతరించారు- అనే భావం రెండవ పాదంలో స్ఫురిస్తుంది. ఒకరు ఆనందించ డానికి వారు చేసిన పుణ్యమే కారణం కాబట్టి, ఆ పుణ్యం మామునులను అవతరింపజేసి, తన్మూలంగా భూదేవిని, లక్ష్మీదేవిని ఆనందింపజేసిందని తాత్పర్యం. మామునులకు ముందున్న ఆచార్యులు అందఱూ **"పారులకిల్ ఆశైయుడైయోర్క్కెల్లామ్ ఆరియర్కాళ్ కూఱుమ్"** (ఆర్యులారా! భూమిలో ఆశ ఉన్నవారికి

అందరికీ చెప్పండి) అని పల్కి ఎమ్బెరుమానార్లు అవధిని ఛేదించినా, ఆఱా యిరప్పడిమొదలైన వ్యాఖ్యానాలు ఒకటికి అయిదుగా తిరువాయ్మొழிకి అవతరించినా, ఒకరు, ఇద్దరు, ముగ్గురు,నల్గురు, అయిదుగురు - అనే ఈ రీతిలో పరిమితసంఖ్యలోని శిష్యులకే తిరువాయ్మొழி అర్థాన్ని ఉపదేశిస్తూ పోయినందున, గొప్ప అర్థం ఉన్న తిరువాయ్మొழி, అర్థం లేని సముద్రఘోషవలె తోచింది. మామునులు అవతరించిన తరువాత అయితే - నమ్బెరుమాళ్తో పాటు పలువేల సంఖ్యలోని శిష్యులకు వారు తిరువాయ్మొழிని ఆ అయిదు వ్యాఖ్యానాలతో పాటు కాలక్షేపం కటాక్షించినందున దాని అర్థం అంతటా వ్యాపించి ప్రకాశించింది. అందువల్ల మామునులు అవతరించి ఉండకపోతే శఠకోపుల తిరువాయ్మొழிకి సముద్రఘోషకు తేడాఉండి ఉండేదా! అని అనుగ్రహించవలసి వచ్చింది. **"వాశి యుణ్డో"** అనే పదంలోని ఏకారం **"ఈఱ్ఱశై"**. మణవాళమహా మునులకు గల అష్టదిగ్గజాలనే ఎనిమిదిమంది శిష్యులలో ఒకరైన అప్పిళ్ళార్ సంప్రదాయచంద్రిక అనే ప్రబంధంలో అనుగ్రహించిన - **"శేఱ్ఱు క్కమలవయల్ శూழ்రజ్గర్ తజ్జీర్ తழைప్ప ప్పోఱ్ఱి త్తొழு** నల్ల వన్దణర్ **వాழ** విప్పూతలత్తే, **మాఱ్ఱఱ్ఱ** శెమ్బొన్ **మణవాళముని** వన్దిలనేల్ **ఆఱ్ఱిక్కరైవ్ద పుళియల్లవో తమిழாరణమే"** (పంకంలో పుట్టిన కమలాలతో నిండిన పొలాలు చుట్టూ ఉండే శ్రీరంగంలోని శ్రీరంగనాథుని గొప్పతనం వృద్ధి అయ్యేటట్టు కీర్తించి నమస్కరించే గొప్ప బ్రాహ్మణులు ఉజ్జీవించే టట్లుగా సాటిలేని, అందమైన, బంగారు వలె ఆశపడదగిన శ్రీరంగంలో మణవాళ మామునులు వేంచేసి ఉండకపోతే ద్రావిడవేదంగా చెప్పబడే తిరువాయ్మొழி నీటిలో కరిగిన చింతపండువలె వ్యర్థమయ్యేది కదా!) అనే పాశురం ప్రకృతంలో సంవాదంగా అనుసంధేయం.

అవ :- చివరిగా - ఇంతవరకుగల పన్నెండు పాశురాలలో అనుగ్రహించిన మామునుల మహిమలకు అన్నిటికీ శిఖరాయమాణమై, సాక్షాత్తు శ్రీమన్నారా యణుడే తనియన్ అనుగ్రహించేటట్లు ఏర్పడిన వారి విలక్షణమైన అతిశయాన్ని ఇందులో కీర్తిస్తూ అణ్ణన్ తనివి తీర తృప్తిచెందుతున్నారు. ద్రావిడవేదాంత ప్రవర్తకాచార్యత్వాన్ని విషయంగాకల మొదటిపాశురంతో ఈ పాశురాన్ని చేర్చడంవల్ల (అన్వాది కాబట్టి) ఇందులో చెప్పబడే భగవత్మంత్ర (తనియన్) రూపకైంకర్య ప్రతిసంబంధిత్వం అనే వైభవం ద్రావిడవేదాంత ప్రవర్తకాచార్యత్వమూలంగా ఏర్పడినదని తెలియజేయ బడింది.

**13. వాశి యఱివ్ద వదరియిల్ నారణనార్ మనజ్గొళ్**
**తేశుడై యెన్దై మణవాళమాముని శీర్ తழைప్ప**

ఛ్చీశయిలేశ దయాపాత్తిర మెనుమ్ శీర్ మన్దిరమ్
దేశికనాయ్ క్కణ్డురైత్తార్ ఇవ్వైయకత్తోర్ ఉఱవే

వాశి అఱిన్ద = ఇతరులకంటె మణవాళమహామునులకు గల వైలక్షణ్యాన్ని తెలిసినవారైన, వదరియిల్ నారణనార్ = బదరికాశ్రమంలో వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుడు, మనమ్ కొళ్ తేశుడై ఎన్దై = తమ మనస్సులో మాఱకుండా గ్రహించిన గొప్పతనాన్ని కలవారైన దాసుని ఆచార్యులైన, మణవాళమాముని శీర్ = మణవాళమామునుల కల్యాణగుణాలు, తఴైప్ప = (లోకులచేత చక్కగా గ్రహింపబడి) మిక్కిలి వ్యాప్తి చెందేటట్లు, శీశయిలేశ దయా పాత్తిరమ్ ఎనుమ్ = "శ్రీశైలేశదయాపాత్రమ్" అని ప్రారంభమయే, శీర్ మన్దిరమ్ = శబ్దసందర్భంచేత, అర్థగాంభీర్యంచేత అందమైన మంత్రాన్ని, దేశికనాయ్ కణ్డు = మంత్రప్రదుడైన ఆచార్యుడై, పరిశీలించి, రచించి, ఇవ్వైయమ్ శీర్ ఉఱ = ఈలోకంలోని వారు అనుసరించి, గొప్పతనాన్ని చక్కగా పొందడంకోసం, ఉరైత్తార్ = అనుగ్రహించారు. (చెప్పారు)

బదరికాశ్రమంలో వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుని అతని శిష్యులు ఇద్దరు ప్రణమిల్లి, దాసులమైన మాకు రక్షకంగా ఉండే దాన్ని దేనినైనా అనుగ్రహించాలని ప్రార్థించారు. అపుడు ఆ స్వామి వారిని కరుణించి- "శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్" అనే తనియన్ శ్లోకంలోని ఒక సగాన్ని అనుగ్రహించి, వేరొక సగాన్ని తాము శ్రీరంగంలో అనుగ్రహిస్తానని తెలిపి, వారిని శ్రీరంగానికి పంపించాడు. వారు ఆ రీతిలోనే శ్రీరంగానికి వచ్చినపుడు అది మణవాళ మహామునులు శ్రీరంగనాథునకు ఈడు ముప్పత్తాఱాయిరప్పడిని కాలక్షేపం అనుగ్రహించి, ఆ కాలక్షేపాన్ని పరిసమాప్తిచేసే సమయం. అపుడు బదరీ నారాయణుడు శ్రీరంగనాథుని రూపంలో పూర్వం తాను పల్కిన శ్లోకార్థంతోపాటు "యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్" అనే వేఱొక సగాన్నికూడా కలిపి అనుగ్రహించారు- అనే విషయం సంప్రదాయసిద్ధం. ఈ విషయం మామునులశిష్యులు ఎనిమిదిమందిలో ఒకరైన అప్పిళ్ళార్ అనుగ్రహించిన "సంప్రదాయచంద్రికై" అనే ప్రబంధంలోని నాల్గవ, అయిదవ పాశురాలలో స్పష్టంగా కనిపిస్తున్నది.

వదరియాచ్చిరమత్తిల్ ఇరు మెయ్ త్తొణ్డర్
వకైయాక నారణనై అడి వణఙ్గి
క్కతియాక ఓర్ పొరుళై అళిక్క వేణ్డుమ్
కణ్ణనే ! అడియోఙ్గళ్ తేఱ వెన్న

చ్చదిరాక చ్చీశైలమన్దిరత్తిన్
శయమాన పాదియై ఆజ్గరుళిచ్చెయ్దు
పదియాన కోయిలుక్కు చ్చెన్మిన్ నీవిర్
పాదియైయుమ్ శొల్లుదుమ్ యామ్ తేఱ వెన్నార్

శెన్తవర్కళ్ ఇరువరుమే శేర వన్దు
తిరువరజ్గన్ దినశరియై కేళా నిఱ్ప
చ్చన్నిదిమున్ కరుడాళ్వార్ మణ్డపత్తిల్
తామీడు శాత్తుకిన్ఱ శమయన్దన్నిల్
పొన్నిదనిల్ నీరాడి ప్పుకళ్న్దు వన్దు
పుకఴరజ్గర్ శన్నిదిమున్ వణజ్గి నిఱ్ప
చ్చన్నిదియిల్ నిన్తరజ్గర్ తామే యన్ద
త్తనియ నురైశెయ్దు తలైక్కట్టినారే

(బదరికాశ్రమంలో ఇద్దఱు భక్తులు యథాక్రమం శ్రీమన్నారాయణుని శ్రీపాదాలకు నమస్కరించి "స్వామీ! దాసులమైన మేము ఉజ్జీవించేటట్లు గతి అయిన ఏదైనా ఒక అర్థాన్ని అనుగ్రహించాలి" అని ప్రార్థించగా అందంగా "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్‌లోని సగభాగాన్ని బదరికాశ్రమంలో స్వామి అనుగ్రహించి, "నా దివ్యదేశం అయిన శ్రీరంగానికి మీరు వెళ్ళండి. మిగిలిన సగాన్ని నేనక్కడ చెప్పగలను" అని అన్నాడు. ఆ విధంగానే ఆ భక్తుడు శ్రీరంగం వెళ్ళి అక్కడ శ్రీరంగనాథుని పంచాంగ శ్రవణాన్ని చేసే సమయంలో, గరుడాళ్వార్ మండపంలో శ్రీ వరవరమునుల ఈడు కాలక్షేపం పూర్తి అయ్యే సమయంలో, కావేరీ నదిలో స్నానం చేసి, శ్రీరంగ నాథుని సన్నిధి ముందుకు వచ్చి నిలచి, ఆ స్వామిని స్తుతిస్తూ ఉండగా, శ్రీరంగ నాథుడు స్వయంగా బాలుని రూపంలో వచ్చి ఈతనియన్‌లోని మిగిలిన సగభాగం అనుగ్రహించి పూర్తిచేశాడు.)

అనేవి ఆ పాశురాలు. (అయిదవ పాశురంలో **"శాత్తుకిన్ఱ"** అనేదే సరి అయిన పాఠం. పూర్తిచేస్తున్న అని దాని అర్థం. **"శాఱ్ఱుకిన్ఱ"** అనే పాఠం సరసం కాదు.)

తిరువాయ్‌మొళిప్పిళ్ళై అనుగ్రహానికి పాత్రమై, ఆకారణంగా జ్ఞానభక్తి వైరాగ్యాది గుణాలకు సముద్రంవంటివారు, యతీంద్రప్రావణ్యాన్ని పొందిన వారు అయిన అళకియ మణవాళమామునులకు ప్రణమిల్లి, స్తుతిస్తున్నాను -అనేది శ్రీరంగనాథుడు అనుగ్రహించిన శ్రీశైలేశదయాపాత్రతనియన్ శ్లోక భావం.

భగవానుడు తనకు సర్వేశ్వరత్వంకంటె, ఆచార్యత్వమే గొప్పది అని భావించి, రహస్యత్రయ-గీత-అభయప్రదానాదులను ఉపదేశించి ఆచార్యత్వాన్ని పొందాడు. అయినప్పటికీ, అవి అన్నీ తన గొప్పతనాన్ని తెలిపేవి కాబట్టి, తనను తాను పొగడుకొనేవానికి లోకంలో ఆప్తత్వం (నమ్మదగిన స్వభావం) కల్గడం అరుదు అని భావించి, అంతవరకు పొందిన ఆచార్యత్వంతో తృప్తిని పొందలేకపోయాడు. ఇతరులతోపాటు తానుకూడా పెద్దల అతిశయాన్నిగూర్చి పల్కి, ఆప్తత్వాన్ని పొంది ''ఆప్తుడైన ఆచార్యు డితడు''అని అందఱిచేత చెప్పబడేటట్లు గొప్పదైన ఆచార్యత్వాన్ని సంపాదించాలి- అని చాలాకాలంగా ఆశపడిన ఆ భగవానుడు చివరిగా నిజమైన గొప్పతనాన్ని కల మణవాళమహామునులకు ప్రియశిష్యుడై, ఈడు వ్యాఖ్యను విని, వారికి తనియన్‌ను అనుగ్రహించి, మంత్రప్రదత్వం అనే ఆచార్యత్వాన్ని పొంది తృప్తిని చెందాడు.

**"మణఙ్కొళ్ తేశు"** అనే పాఠంకూడా కన్పిస్తున్నది. **"మణమ్"** అంటే ఆనందం. ఆనందానికి తగిన తేజస్సు -అని అర్థం. లోకం అంతా కీర్తించే మంత్రం కాబట్టి "శ్రీశైలేశ" మంత్రాన్ని "శీర్ మన్దిరమ్" అని అన్నారు. ఇచటి "శీర్‌మై" ఏమంటే - శబ్దమాధుర్యం, అర్థంలోని సత్యత్వం, గాంభీర్యం.

**"మన్దిరమ్" (మంత్రమ్)- "మంతారమ్ త్రాయతే ఇతి మంత్రః"** అనే వ్యుత్పత్తినిబట్టి తను అనుసంధించేవానిని కాపాడేది మంత్రం. **"దేశికన్" "దిశతి-ఉపదిశతి ఇతి దేశికః"** అనే వ్యుత్పత్తినిబట్టి ఈపదం ఉపదేశాన్ని చేసే ఆచార్యుణ్ణి నిర్దేశిస్తుంది. **"శీరుఱుతల్"**- ఐహిక- ఆముష్మిక ఫలాలను పూర్ణంగా పొందడం.

ఈవిధంగా వరదనారాయణ గురువులనే కోయిల్ కన్దాడై అణ్ణన్, భగవానుడు ఈ భూలోక వాసులు అనుసంధించి, సంపదను పొందేటట్లు **"శ్రీశైలేశ దయాపాత్రమ్"** అనే తనియన్ మూలంగా మణవాళమహామునుల మహిమను వ్యక్తం చేసి, ఆచార్యత్వపూర్తి పొంది సత్తను పొందినట్లే, అందఱు అనుసంధించి, సంపదను పొందేటట్లు ఆ మామునుల గొప్పతనాన్ని ఈ కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంద్వారా వ్యక్తపఱచి వరదనారాయణ గురువులనబడే తమ తిరునామం సార్థకం అయేటట్లుగా ఆచార్యత్వపూర్తిని పొంది. సత్తను పొందారు.

ఈప్రబంధంలో **"శ్రీశైలేశదయాపాత్రమ్"** ఇత్యాది తనియన్‌లోని అర్థాలు అన్నీ అణగి ఉన్నాయి. **"శీరుఱ్ఱ శెఙ్గొఱ్ఱిరువాయ్‌మొழிప్పిళ్ళై శెమ్మైకముమ్ తారుఱ్ఱ మార్బుమ్ తళిరేయ్ ప్పదఙ్గళుమ్ తమ్మనత్తు ప్పూరిత్తు వాழுమ్ మణవాళమాముని"** అని అంటూ మామునులు తిరువాయ్‌మొழிప్పిళ్ళైను

ధ్యానించడమనే కార్యాన్ని తెలుపడంద్వారా దానికి కారణం అయిన **“శ్రీశైలేశదయాపాత్రత్వమ్”** (తిరువాయ్‌మొழிప్పిళ్ళై దయకు పాత్రమైన స్వభావం) తెలుపబడింది. కారుణికులేకదా ధ్యానించదగినవారు.

**“తొల్లరుళ్ ఞానమ్ విళైత్తు”** (6) అని, **“మణవాళమాముని తామవతారమ్ శెయాదిరున్దాల్ శడకోపర్ తిరువాయ్‌మొழி యోడు కడలోశైయోడు ఎన్న వాశి యుణ్డే”** (12) అని క్రమంగా తత్త్వ-హిత-పురుషార్థజ్ఞానాన్ని, భగవద్విషయార్థజ్ఞానాన్ని ఇతరులకు కలిగేటట్లుగా చేస్తున్నారని చెప్పడంద్వారా మామునులకు గల జ్ఞానం, **“శిత్తరజ్గరై శిన్దై పయజ్కోడ చ్చెన్నితన్నాల్ వన్దిత్తు నిచ్చలుమ్ వాయార వాழ்త్తుమ్ మెయ్‌మ్మా మత్తైయోర్ పున్దిక్కుళ్ మేవుమ్ వరయోకి”** అని అంటూ మామునులు శ్రీరంగనాథుని భక్తులచే ధ్యానింపబడడాన్ని తెలుపడంద్వారా మణవాళమహామునులకు శ్రీరంగనాథునిపట్ల గల భక్తి చెప్పబడింది. మామునులకు శ్రీరంగనాథుని పట్ల లేకపోతే శ్రీరంగనాథుని భక్తులు వారిని ధ్యానించరుకదా !

ఇక, **“ముక్కోల్ తరిత్త మణవాళమాముని”** (5) అని వైరాగ్యం, **“మణవాళమాముని క్కార్ముకిలై”**(2) అని ఔదార్యం, **“కరుణై మణవాళ యోకియై”** (8) అని దయ- ఈవిధంగా **“ధీభక్త్యాది”** అన్నపుడు ఆదిపదంచేత సంగ్రహింపబడ్డ కొన్ని గుణాలు సూచింపబడ్డాయి. ఈరీతిలో **“ధీభక్త్యాది గుణార్ణవత్వమ్”** సూచింపబడింది. **“ఎతిరాశన్ తుయ్య పదజ్గళ్ నెఞ్జిల్ మఱవాద శీలన్ మణవాళమాముని”** (3) అని యతీంద్రప్రవణత్వం (భగవద్రామానుజుల విషయంలో ప్రావణ్యాన్ని కల్గిఉండడం) సూచింపబడింది. **“మణవాళమాముని, మణవాళ యోకి, వరయోకి, మణవాళముని”**- అని పలుచోట్ల ప్రయోగించడంవల్ల రమ్యజామాతృమునిత్వం చెప్పబడింది.

**“మణవాళయోకియై వాழ்త్తువనే”**, **“వాழ்త్తువ నెన్దై మణవాళమాముని మామలర్త్తాళ్ తాழ்త్తువన్ యావన్ తాళిణైక్కీழ் శిరమ్ తారణియిల్”** (7) అని స్తుతి, అభివాదనం అనే **“వది”** ధాతువుయొక్క అర్థాలు తెలుపబడడంచేత **“వన్దే”** అనే పదంయొక్క అర్థం స్పష్టంచేయబడింది. ఈవిధంగా ఈ ప్రబంధం **“శ్రీశైలేశ దయాపాత్రమ్”** తనియన్‌ను సమగ్రంగా వివరిస్తున్న విషయం వ్యక్తమైనది కదా.

జీయర్ తిరువడికళే శరణమ్

కోయిల్ కన్దాడై అణ్ణన్ తిరువడికళే శరణమ్

# ప్రాస్తావికం

**కర్కటే పుష్యసంజాతం వాదిభీకర మాశ్రయే ।**
**వేదాంతాచార్యసచ్ఛిష్యం వరయోగిపదాశ్రితమ్ ॥**

శ్రీ వైష్ణవ పూర్వాచార్యులలో అత్యంతం ప్రసిద్ధులు, సాక్షాత్తు శ్రీరంగనాథుడే స్వయంగా ఆశపడి ఆశ్రయించినవారు అయిన ఆచార్య శ్రేష్ఠులు శ్రీమద్వరవర మునులు. వీరికి గల అష్టదిగ్గజాలనే ఎనిమిదిమంది శిష్యులలో ప్రతివాది భయంకరం అణ్ణన్ ఒకరు. వీరి అభిజనం కాంచీపురం. ముడుమ్బైవంశానికి చెందిన అనంతాచార్యులనే మహనీయులకు కంచిసమీపంలోని **"తిరుత్తణ్కా"** అనే క్షేత్రంలో క్రోధ (1361 సం॥రం) ప్లవర్షం, ఆషాఢమాసం (ఆడిమాసం) కృష్ణచతుర్దశి మంగళవారంనాడు పుష్యమీనక్షత్రంలో వీరు అవతరించారు. వీరి బాల్యనామం **"హస్తిగిరినాథనణ్ణన్".** వీరి బాల్యం, విద్యాభ్యాసాదులు అన్నీ కాంచీపురంలోనే గడచినవి. అత్యంతప్రతిభావంతులైన వీరు అచిరకాలంలోనే పలు శాస్త్రాల్లో, సంస్కృతవేదాంతంలో నిరుపమానమైన పాండిత్యాన్ని గడించి ప్రసిద్ధి చెందారు. శ్రీవేదాంతదేశికులు, వారి కుమారులు నయనవరదాచార్యుల వారివంటి పెద్దల అనుగ్రహానికి పాత్రులయ్యారు. తమకు ఆచార్యులైన నయనవరదా చార్యులవారితో వాదించాలని వచ్చిన మయావాదిని అణ్ణన్ ఓడించడాన్ని చూచిన నయనవరదాచార్యులవారు వీరిని సంతోషంతో "ప్రతిభయంకరా! రండు" అని సాదరంగా సంబోధించడంవల్ల, ఆ పేరే వీరికి నిరూపకనామమైనదట. కొంతకాలం కంచిలో వరదరాజస్వామి సన్నిధిలో తీర్థకైంకర్యాన్ని నిర్వహించిన వీరు తరువాత తాతాచార్యులవారి ఆదేశానుసారం తిరుమలకు వచ్చి, అక్కడ శ్రీవేంకటేశుని తిరువారాధనకు అవసరమైన తీర్థాన్ని తీసికొనివచ్చే కైంకర్యాన్ని నిర్వహించారు. ఆ సమయంలోనే శ్రీవరవరమునుల గుణవైభవాన్ని, పాండిత్యాన్ని గూర్చి విని, వారిని సేవించాలనే ఆశతో శ్రీరంగానికి చేరి, అక్కడ వరవరమునుల పాదసన్నిధిని ఆశ్రయించి, **"తేవు మత్తఱియేన్"** అన్న రీతిలో వారివిషయంలో గొప్ప ప్రావణ్యాన్ని పొందారు. ఒక పర్యాయం శ్రీవరవర మునులతో పాటు వీరు తిరుమలకు వేంచేసినపుడు ఆచార్యనియమానుసారం

శ్రీవేంకటేశ్వరుని విషయంగా శ్రీవేంకటేశసుప్రభాతం, ప్రపత్తి, స్తోత్రం, మంగళా శాసనం అనే నాల్గు స్తోత్రాలను ఆశువుగా అనుగ్రహించారు అని పెద్దల సూక్తి. ఇంతేకాక, సంస్కృతభాషలో అష్టశ్లోకీ వ్యాఖ్యానం, శ్రీవరవరమునుల సుప్రభాతం ప్రపత్తి, మంగళాశాసననం, శ్రీవరవరముని శతకం మొదలైన పలు గ్రంథాలను రచించారు.

ద్రవిడభాషలో శ్రీవరవరమునుల దివ్య మంగళవిగ్రహాన్ని స్తుతిస్తూ అణ్ణన్ రచించిన అమలనాదిపిరాన్ ప్రబంధాన్ని (పాదాదికేశమాలై ప్రబంధం) నిత్యానుసంధేయప్రబంధంగా పెద్దలు నిశ్చయించారు. ఈ ప్రబంధం తిరుప్పాణ్ ఆళ్వార్లు శ్రీరంగనాథుని విషయంలో అనుగ్రహించిన అమలనాది పిరాన్ ప్రబంధంతో పలువిధాలైన సౌమ్యాలను కలిగియున్నది. ప్రాచీననిత్యానుసంధేయ శ్రీకోశాలలో ఈప్రబంధం ముద్రింపబడినా, ఈ మధ్యకాలంలో ముద్రింపబడిన కోశాలలో ఇది చోటుచేసుకోనందువల్ల ఈ తరంవారికి దీనిని గూర్చి తెలిసే అవకాశం లేకుండాపోయే ప్రమాదం ఏర్పడింది. అందువల్ల మరల దీనిని ప్రచారం చేయాలనే ఉద్దేశ్యంతో వివరణసహితంగా ఈ ప్రబంధం ముద్రింపబడుతున్నది. ఈ వివరణలోని లోపాలను సహృదయులు సహించవలసినదిగా ప్రార్థిస్తున్నాను. ఆళ్వార్‌దివ్యప్రబంధ ప్రాజెక్ట్ ద్వారా దీనిని ముద్రించడానికి తగిన ప్రయత్నాన్ని చేసిన మిత్రులు ప్రాజెక్ట్ ఆఫీసర్ శ్రీచొక్కలింగం గారికి కృతజ్ఞతలు.

ఇట్లు, వ్యాఖ్యాత

**శింగరాచార్యులు**

శ్రీమణవాళమహామునుల విషయంగా

ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# అమలనాదిపిరాన్ (పాదాది కేశమాలై)

## సవ్యాఖ్యానము

1. పోద చ్చివన్దు పరిమళమ్ వీశి పుదుక్కణిత్తు
శీదక్కమలత్తై నీరేఱ వోట్టి చ్చిఱన్దడియేన్
ఏదత్తై మాఱ్ఱు మణవాళయోకి యినిమై తరుమ్
పాదక్కమలఙ్గళ్ కణ్డే నెనక్కు ప్పయమిల్లైయే

పోద చ్చివన్దు = చాలా ఎఱ్ఱనిదై, పరిమళమ్ = సువాసనను, వీశి = వీచి, పుదుక్కణిత్తు= అపుడే వికసించడంచేత నూతనత్వాన్ని కల్గి, శీదమ్ = శైత్యాన్ని కల్గిన, కమలత్తై = కమలాన్ని, నీర్ ఏఱ = నీటిలో ప్రవేశించేటట్లు, ఓట్టి =తఱిమి కొట్టి, శిఱన్దు = గొప్పతనాన్ని కల్గి, అడియేన్ = దాసుని, ఏదత్తై = దోషాన్ని, మాఱ్ఱుమ్ = లేకుండా చేసే, మణవాళయోకి = మణవాళమహామునుల, ఇనిమై తరుమ్ = సేవించినంతనే మాధుర్యాన్ని, ఆనందాన్ని కల్గించే, పాద క్కమలఙ్గళ్ = శ్రీపాదాలు అనే తామరపూలను, కణ్డేన్ =దర్శించిన, ఎనక్కు =(ఇక) నాకు, పయమ్ = ఏ భయం, ఇల్లై = లేదు (ఏకారం నిశ్చయార్థకం)

చాలా ఎఱ్ఱనిదై, సువాసనను వెదజల్లుతూ అపుడే వికసించడంచేత నూతనత్వాన్ని, చల్లదనాన్ని కల కమలాన్ని దానికంటే తనకు ఉన్న సకలవిధ వైలక్షణ్యంతో నీటిలోనికి తఱిమికొట్టినవి, దాసుని దోషాలను అన్నిటినీ దర్శనమాత్రంచేతనే పోగొట్టేవి, మనస్సులో తీయదనాన్ని కల్గించేవి అయిన మణవాళమహామునుల శ్రీపాదపద్మాలను దర్శించిన నాకు ఇక ఏ భయం లేదు.

లోకంలోని కమలాలకు ఎఱ్ఱదనం, సౌగంధ్యం, శైత్యం- మొదలైన గుణాలన్నీ ఉన్నా, ఈ గుణాలలో మణవాళమాముని పాదపద్మాలు వాటిని మించి ఉన్నందున అవి కమలాలను తఱిమి నీటిలో ప్రవేశించేటట్లు చేశాయని అనడం ఒక అందమైన ఉత్ప్రేక్ష. పద్మాలు నీటిలో ఉండడం సహజమే అయినా దానికొక హేతువు ఉత్ప్రేక్షింపబడిందికదా! దీనివల్ల ఉపమానం అయిన కమలాలకంటే ఉపమేయం

అయిన పాదాలకు ఆధిక్యం స్ఫురించడంచేత వ్యతిరేకాలంకారంకూడా వ్యంగ్యం. ఈ విశేషం ప్రబంధంలో సర్వత్ర గమనించవచ్చు. పైగా, కమలాలకు మనస్సులోని మాలిన్యాన్ని తీర్చే శక్తి లేకపోవడం, శ్రీపాదాలకు ఆ మహిమ ఉండడం అనే ఆధిక్యంకూడా గమనార్హం.

**"ఏదత్తై మాఱ్ఱుమ్", "ఇనిమై తరుమ్"** అనే విశేషణాలద్వారా వ్యక్తం అయే శ్రీపాదాల దోషహరత్వం, మాధుర్యదాయిత్వం శ్రీపాదాల అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి రూపరక్షణకార్యపూర్తిని తెలుపుతున్నవి. దీనివల్ల శ్రీపాదాల వైలక్షణ్యం తెలుస్తున్నది. వేదం భగవానుని విషయంలో వేదం **"యదాహ్యేవైష ఏతస్మిన్ అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయంగతో భవతి"** (ప్రాకృత చక్షువులతో దర్శింప వీలులేనివాడు, ప్రాకృత శరీరం లేనివాడు, దేవమనుష్యాది పదాలతో నిర్దేశించడానికి వీలులేనివాడు, తనకోసం ఏ ఆధారం లేనివాడు అయిన ఈ పరమాత్మ పట్ల సంసారభయం లేకుండా ఉండడంకోసం భక్తియోగాన్ని ఎపుడు పొందుతాడో అపుడు అతడు భయం లేనివాడు అవుతాడు.) అని పల్కిన అర్థాన్ని అణ్ణన్ వరవరమునుల శ్రీపాదాల పట్ల **"పాదక్కమలజ్గళ్ కణ్డేన్ ఎనక్కు పయమ్ ఇల్లై"** అని అంటూ అనుసంధించడం విశేషం. పైన పేర్కొన్న విధంగా శ్రీపాదాల రక్షకత్వపూర్ణతను తెలిసిన తర్వాత ఇక భయం లేకుండా ఉండడంలో ఆశ్చర్యం లేదుకదా! **"నిర్భయో నిర్భరోఽస్మి"** అని చెప్పవచ్చుకదా! **"సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్, నిస్సంశయ స్తు తద్భక్తపరిచర్యారతాత్మనామ్"** (అచ్యుతుని సేవించేవారికి సిద్ధి కల్గుతుందా? లేదా? అనే సందేహం ఉండవచ్చు. కాని, ఆ అచ్యుతుని భక్తులను సేవించేవారికి కార్యసిద్ధి కల్గడంలో మాత్రం ఏ సందేహం లేదు) అని చెప్పబడింది కనుక వారికి ఉత్తమపురుషార్థ ప్రాప్తి సిద్ధం. అందువల్ల భయం ఉండదు. **"అభీతి రిహ యజ్జుషామ్"** ఇత్యాది సూక్తుల అర్థం వరవరమునులపట్ల ఇక్కడ భావ్యం.

ఆపాదచూడం శ్రీవరవరమునుల దివ్యమంగళవిగ్రహాన్ని వర్ణించే ఈ ప్రబంధం శ్రీపాదాల వర్ణనతో ప్రారంభమైనది. అణ్ణన్ అనుగ్రహించిన వరవరమునుల వాழ్తిత్తిరునామంకూడా- **"శెయ్యతామరైత్తాళిణై వాழியే"** అని అంటూ శ్రీపాదాల వర్ణనతోనే ఆరంభం అవుతున్నది. తిరుప్పాణ్ అమలనాదిపిరాన్ ప్రబంధంలో సైతం **"అరజ్గత్తమ్మాన్ తిరుక్కమలపాదమ్ వన్దు"** అని శ్రీరంగనాథుని

శ్రీపాదాల స్తుతితోనే మొదలైనది. "దేవా శ్చరణతః పునః" అని పాదాదికేశంగా దివ్యుల వర్ణనను చేయాలనే ఆలంకారికసంప్రదాయం ఇందులో పాటింపబడింది. దివ్యుల వర్ణనకు విధింపబడ్డ క్రమం ఇందులో పాటింపబడినందున శ్రీవరవర మునుల ఆదిశేషుల అవతారం అనే అంశం స్ఫురిస్తున్నది. అంతేకాక "ఆచార్యః స హరి స్సాక్షాత్" (ఆచార్యుడు సాక్షాత్ ఆ హరియే), "దేవ మివాచార్య ముపాసీత" (దైవంవలే ఆచార్యున్ని ఉపాసించాలి), "యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ" (ఎవనికి దైవం పట్ల ఉండే భక్తి గురువు పట్ల ఉన్నదో) ఇత్యాది సూక్తుల అర్థాలు అనుసంధింప బడ్డాయి. "పోద"- పర్యాప్తం అయిన అని అర్థం. చాలు అనే అర్థంలో "పోదుమ్" అనే వ్యవహారం ఉండడాన్ని గమనించవచ్చు. పర్యాప్తం, పూర్ణం - అయిన అనే అర్థాన్ని ఇచ్చే "పోద" అనే పదాన్ని ప్రబంధప్రారంభంలో ప్రయోగించడంవల్ల కావ్యాదిలో చేయదగిన మంగళాచరణం చేసినట్లయింది. మంగళార్థకవాచకాలను ఆదిలో ప్రయోగించడం మంగళాత్మకమే కదా! "పోర" అనే పాఠాంతరం ఉన్నా, అది ప్రాసాను గుణంకాదు. "ఇనిమై తరుమ్" అనే ప్రయోగంవల్ల శ్రీవరవరమునుల దివ్యమంగళ విగ్రహంయొక్క మాధుర్య గుణం చెప్పబడింది.

2. వే*ழ*క్కురుత్తి న*ழ*కై ప్ప*ழ*ిత్తు విరై మరువు
వా*ழై*ప్పరువత్తి నాకారఙ్కొణ్డు వళమ్బునైన్ద
ఏ*ழై*క్కిరఙ్గు మణవాళయోకి యిరు కుఱఙ్గై
క్కే*ழ*ఱ్ఱ నెఞ్జిల్ వైప్పేఱ్కొరు కాలముమ్ కేడిల్లైయే

వే*ழ* క్కురుత్తిన్ = ఏనుగుతొండంయొక్క, అ*ழ*కై = అందాన్ని, ప*ழ*ిత్తు = నిందించి, (దానిని మించి), విరై = సువాసనను, మరువు = కల్గిన, వా*ழై* ప్పరువత్తిన్ = అరటిబోదెల, ఆకారమ్ = రూపాన్ని, కొణ్డు =గ్రహించి, ఏ*ழై*క్కు= జ్ఞానంలో దరిద్రుణ్ణి అయిన నాకు, ఇరఙ్గుమ్ = కరుణను చూపే, మణవాళ యోకి = మణవాళ మహామునుల, వళమ్ పునైన్ద = బాగా బలిసిన, ఇరు కుఱఙ్గై = రెండు ఊరువులను, కే*ழ*్ అఱ్ఱ = స్వరూపప్రకాశంలేని, నెఞ్జిల్ = మనస్సులో, వైప్పేఱ్కు = నిలిపేవారికి, ఒరు కాలముమ్ = ఏసమయంలోను, కేడు ఇల్లై = చెడ్డ లేదు (ఏకారం నిశ్చయార్థకం)

"ఊరు స్తు కరిహస్తేన కదళ్యా కరభేన చ" అని ఆలంకారికసమయం. తొడలను వర్ణించేటపుడు ఏనుగు తొండాన్ని, అరటిబోదెలను, కరభమనబడే చిటికెనవేలు

చివరనుండి మణిబంధం ప్రారంభంవరకు గల చేతి భాగాన్ని ఉపమానాలుగా చెప్పాలి అనే ఈ నియమం ఇందులో పాటింపబడింది. "మధుకైటభస్య రంభాకరభకరీంద్రకరాభి రూప్యదర్పమ్" అని పరాశరభట్టర్‌కూడా శ్రీరంగరాజస్తవంలో పలికారు.

ముందు పాశురంలో "కణ్డేన్" అని దర్శనమాత్రమే చెప్పబడగా, ఇందులో "నెఞ్జిల్ వైప్పేఖ్కు" అని దర్శించిన దానిని అనవరతం ధ్యానించే స్థితి తెలుపబడింది. "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేత్ వేద సంత మేనం తతో విదుః" అని అంటూ వేదం భగవానుడున్నాడని, అతడు దివ్యమంగళవిగ్రహ విశిష్టుడని, కల్యాణగుణపూర్ణుడని, విభూతిద్వయవిశిష్టుడని భావించినవారికి సత్త కలుగుతుందని అన్నట్లే అణ్ణన్‌కూడా తమ ఆచార్యుల దివ్యమంగళవిగ్రహధ్యానాన్ని చేసేవారికి ఏ కీడు లేదని అన్నారు. ఇక్కడ కీడు అంటే ఆత్మనాశమే. "వళమ్ పునైన్ద"- దార్ఢ్యాన్ని కల్గిన- అని అర్థం. "నల్ వళమ్ శేర్ పழన త్తిరుక్కోళూరే" అనే ప్రయోగం గమనార్హం. లేక, "వళమ్" అంటే అందం అని కూడా చెప్పవచ్చు. "వళమాక ఎన్దపడి = అతావతు అழకియతా ఎన్దుతల్." (ఈడు -3-9-2) అని ఈడు వివరణం. ప్రకృతంలో అందం నిండిన- అని అర్థం.

3. తేనమర్ మాలై మణవాళయోకి తిరుమరుఙ్గల్
ఈన మిలాద విళమైయినారు మెழிల్చకనమ్
వానిలై యుయ్‌త్త తువరాడై యిన్దెన్ మనత్తై విట్టు
త్తానకలామ లెన్నై యూழிకాలముమ్ తాఙ్గియవే

తేన్ అమర్ మాలై = మధువు పొందికగా ఉండే (స్రవించే) పూమాలికలను ధరించిన, మణవాళ యోకి = మణవాళ మహామునుల, తిరు మరుఙ్గల్ = అందమైన పార్శ్వభాగాలు, ఈనమ్ ఇల్లాద = తక్కువ కాని, ఇళమైయిన్= లేత వయస్సుతో, అరుమ్ = స్థిరంగా ఉండే, ఎழிల్ = ప్రకాశించే, శకనమ్ = జఘనప్రదేశం, వాన్ = ఉన్నతం అయిన, నిలై = స్థానంలోనికి, ఉయ్‌త్త = ఉద్ధరించిన, తువర్ ఆడై = ఎఱ్ఱని కాషాయం - అనే ఇవి, ఇన్దు = ఇపుడు, ఎన్ మనత్తై విట్టు = నా మనస్సును వీడి, తాన్ = తాను, అకలామల్ = విడువకుండా, ఎన్నై = నన్ను, ఊழிకాలముమ్ = యుగకాలం అంతా, (బ్రహ్మకల్పం అంతా), తాఙ్గియ = తమ శక్తితో ధరిస్తున్నవి. (ఏ-ఆశ్చర్యార్థకం, లేక ఆనందార్థకం)

హీనమనే సంస్కృతపదమే ఈనమని మారింది. "తువర్"- ఎట్టని- "తువర్ ఎన్నానిఙ్కు క్కరైయినాలెట్టదు" (ఈడు-4-8-4) అని ఈడు ప్రయోగం. జఘనశబ్దమే "శకనమ్" అయినది. ముందు పాశురంలో అణ్ణన్ వరవరమునుల ఊరువులను తాము నిరంతరం ధ్యానిస్తున్నామని స్వగతస్వీకారాన్ని తెలిపారు. ఇందులో వరవరమునుల జఘనం, ఇరు పార్శ్వప్రదేశాలు, కాషాయం తమను విడువకుండా బ్రహ్మకల్పంవరకు తమ శక్తితో ధరిస్తున్నవని అంటూ అంతకంటే గొప్పది అయిన పరగతస్వీకారాన్ని ప్రస్తావించడం విశేషం.

4. వన్దిక్క వాళ్విత్తరుళ్ మణవాళమాముని వడివై
చ్చిన్దిక్కవుమ్ అరిదా మళకాఱ్ఱిల్ తికళ్ శుళిపోల్
ఉన్దిచ్చుళి యెనదుళ్ళమ్ శూఴ్రైకొణ్డాయదెన్టుమ్
శన్దిత్తవర్ కణ్ణు నెఞ్జుమ్ కొళ్ళానిఱ్కుమ్ తామిరున్దే

వన్దిక్క = (దాసులు) స్తుతించినంతనే (నమస్కరించినంతనే), వాళ్విత్తు అరుళ్ = (వారిని) ఉజ్జీవింపజేసి, పరమపదాన్ని చేర్చి అనుగ్రహించే, మణవాళ మా ముని = మణవాళమహామునుల, వడివై = దివ్యమంగళవిగ్రహాన్ని, శిన్దిక్కవుమ్ = చింతించడానికికూడా, అరిదు ఆమ్ = దుర్లభమే అయేటట్లున్న, అళకు ఆఱ్ఱిల్ = సౌందర్యప్రవాహంలోని, శుళిపోల్ = సుడివలె, ఉన్ది చ్చుళి= గుండ్రని వారి నాభి, ఎనదు ఉళ్ళమ్ = నా మనస్సును, శూఴ్రై కొణ్డు = తెలియకుండా కొల్లగొట్టి (చూఱగొని), ఆయదు = దానిని కల్గిఉన్నది, ఎన్టుమ్ = ఎల్లప్పుడూ, తామ్ ఇరున్దు = తాము ఉన్న రీతిలోనే (తామున్నచోటనే ఉంటూ), శన్దిత్తవర్ = తనను చేరిన వారియొక్క, కణ్ణుమ్ = కన్నులను, నెఞ్జుమ్ = మనస్సును, కొళ్ళా నిఱ్కుమ్ = కొల్లగొడుతుంది. (ఏ- ఆశ్చర్యార్థకం!)

"ఏకైకస్మిన్ పర మవయవేऽనంతసౌందర్యమగ్నమ్" అని అంటూ పరాశరభట్టర్ శ్రీరంగనాథుని సౌందర్యాన్ని ఒక ప్రవాహంగా చూపించినట్లే అణ్ణన్‌కూడా వరవమునుల అందాన్ని "అళకాఱు" అని ఒక నదీప్రవాహంగా రూపించారు.

"వన్దిక్క, శిన్దిక్క, శన్దిత్త"- అనే పదాలు సంస్కృతభవాలు. "వది- అభివాదన స్తుత్యోః" అనే ధాతువునుండి పుట్టిన, "వన్దిక్క" అనే క్రియారూపానికి "నమస్కరించినంతనే" అని, "స్తుతించినంతనే"- అనే రెండు అర్థాలనే కాకుండా

త్రికరణాత్మకమైన సేవలలో మిగిలినది అయిన "మానసికంగా భావించినంతనే" అనే అర్థాన్నికూడా ఉపలక్షణవిధిలో చెప్పడంలో స్వారస్యం ఉన్నది. ప్రపత్తి ముఖ్యంగా మానసికమే కదా! అయితే, "వడివై చ్చిన్దిక్క్వుమ్, అరిదామ్" అనే ప్రయోగం ఏవిధంగా సరిపోతుంది? అని అంటే, మణవాళమామునుల సౌందర్యం పూర్ణంగా దర్శించి, భావించడానికి సాధ్యం కానిది- అని ప్రకృతప్రయోగానికి అర్థం. కాబట్టి అర్థంలో ఎటువంటి క్లేశం లేదు. "వన్దిక్క వా***ழ***విత్తరుళ్" అనే ప్రయోగానికి హృదయపూర్వకంగా కాక యాదృచ్ఛికంగా నమస్కరించినా వరవరమునులు రక్షిస్తారు - అనే అర్థస్వారస్యం స్ఫురిస్తున్నందున "తిరుమాలిరుమ్ శోలైమలై ఎన్నే ఎన్న" అత్యాది ఆ***ழ***ార్ల సూక్తుల భావాలు ప్రకృతంలో వరవరమునులపట్ల భావించబడ్డాయని చెప్పవచ్చు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అనే శ్రుత్యర్థం కూడా ప్రకృతంలో మణవాళ మహామునుల సౌందర్యం విషయంలో అందంగా అనుసంధింపబడడం గమనార్హం. "ఉన్దిచ్చు***ழி***" - గుండ్రని బొడ్డు. నాభీవలయం. "ఓరవయవత్తిలే నిన్రు శు***ழி*** శు***ழி***క్కుమాయ్త్తు" అని ఒన్బది నాయిరప్పడి (7-1-10) సూక్తి. నాభిని నీటిసుడితో పోల్చడం కావ్యసంప్రదాయం. "నాభీరసాతలావర్తహ్రదకూపనదాదిభిః" అని అలంకారశేఖర వచనం. "సౌందర్యామృతసారపూరపరివాహావర్తగర్తాయితం యాతః నాభిః" అని కూరేశుల సుందరబాహుస్తవంలోని (57) ప్రయోగాన్ని స్మరించవచ్చు. "శూழై కొణ్డు"- సంపదను కలవాని దగ్గరనుండి అతనికి ఏమాత్రం తెలియకుండా అపహరించి- అని అర్థం. "ఇవర్కళై చ్చూழై కొళ్ళుకిఱ పూశలిలే" అని పెరియతిరుమొ***ழி*** (1-7-2) వ్యాఖ్యలోని ప్రయోగం. "తామిరున్దు కొళ్ళానిఱ్కుమ్" అనే ప్రయోగం మణవాళమహామునుల నాభికి భక్తుల మనస్సును నేత్రాలను కొల్లగొట్టడంలోని అసాధారణసామర్థ్యాన్ని తెలుపుతున్నది. లోకంలోని చోరులు తాము కొల్లగొట్టదలచిన వస్తువు దగ్గరకు పోయినపుడే దానిని కొల్లగొట్టగలరు. కాని, వరవరమునుల నాభిమాత్రం తానున్న చోటనే ఉంటూ కొల్లగొట్టడం విశేషం. "కణ్ణుమ్ నెఞ్జుమ్ కొళ్ళానిఱ్కుమ్" అనే ప్రయోగ స్వారస్యాన్ని బట్టి "రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"అనే శ్రీరామాయణ శ్లోకార్థం ఇందులో వరవరమునుల పరంగా అన్వయింపబడింది అని చెప్పవచ్చు.

**5. ఆరుమ్ వణఙ్గుమ్ మణవాళమాముని యమ్బుయముమ్**
**కారుమ్ శురబియుమ్ పోలే వ*ழ*ఙ్గుమ్ కైత్తామరైయిల్**

శేరు న్తిరుత్తణ్డుమ్ శేవిత్త మానిడర్ తీవినైయాల్
ఈరుమ్బడి ప్పిఱవార్ తిరునాట్టిన్బమెయ్దువరే

ఆరుమ్ = ఎవరైనా (అందఱు), వణఙ్గుమ్ = నమస్కరించే, మణవాళ మా ముని= మణవాళమహామునుల, అమ్ = అందమైన, పుయముమ్ = భుజములను, కారుమ్= మేఘము, శురబియుమ్ పోలే = కామధేనువువలె, వழఙ్గుమ్ = ప్రత్యుపకారాన్ని ఆశించకుండా అనుగ్రహించే, కై త్తామరైయిల్ = శ్రీహస్తమనే తామరపూవులో, శేరుమ్= చేరి ఉండే, తిరు త్తణ్డుమ్ = త్రిదండాన్ని, శేవిత్త = సేవించిన (దర్శించిన), మానిడర్= మానవులు, తీ వినైయాల్ = దుష్కర్మవల్ల, ఈరుమ్ = హింసించే, పడి = భూమిలో, పిఱవార్ = జన్మించరు, తిరు నాట్టు = పరమపదంలోని, ఇన్బమ్ = ఆనందాన్ని, ఎయ్దువర్= పొందుతారు, (ఏ -నిశ్చయార్థకం, లేక, ఆశ్చర్యార్థకం)

శ్రీవరవరమునుల అందమైన భుజాలను, శ్రీహస్తంలో అందంగా అమరి ఉండే త్రిదండాన్ని దర్శించినవారికి దుష్కర్మఫలంగా సంభవించే ఇహలోకజన్మ కలుగదు. వారు పరమపదాన్ని చేరి, పరమప్రాప్యం అయిన ముక్తానందాన్ని పొందుతారు- అనే భావమే కాక, వరవరమునుల భుజాలను, శ్రీహస్తంలోని త్రిదండాన్ని సేవించినవారు **"తీవినైయాల్ ఈరుమ్ పడి తిరునాట్టిన్బమెయ్దువర్"** - దుష్కర్మలతో బాధించే ఈ లోకంలోనే పరమపదానందాన్ని పొందుతారు- అనే భావంకూడా స్ఫురించడం విశేషం. ఇటువంటివారు **"విణ్ణుళారిలుమ్ శీరియరే"** అన్నట్లు పరమపదవాసులకంటే విలక్షణులు- అనే అర్థాన్నికూడా చెప్పడంలో స్వారస్యం ఉన్నది. **"భుజ, సురభి, మానుష దండ"** అనే సంస్కృత శబ్దాలు **"పుయమ్, శురబి, మానిడర్ తణ్డు"** అనే మార్పును పొందాయి. సంస్కృతపదంలోని **'జ'** కారం తమిళంలో **'య'** కారంగా మారడం **"అంబుజ-అమ్బుయ, అజ - అయన్"** ఇత్యాదులలో గమనించవచ్చు. అదే రీతిలో సంస్కృతంలోని మూర్ధన్యాక్షరం అయిన **'ష'** కారం తమిళంలో వేఱొక మూర్ధన్యం అయిన **'డ'**కారంగా మారడం **'భాషా-పాడు', 'విష-విడమ్'** మొదలైన చోట్ల చూడవచ్చు. **"నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి'** అని చెప్పబడ్డ రీతిలో మేఘం ఎవరూ అడుగకుండానే, తరతమవిభాగం చూడకుండా, ప్రత్యుపకృతిని ఆశించకుండా తీయని జలాన్ని వర్షించడం ప్రత్యక్షసిద్ధం. కామధేనువుకూడా అడిగినవాటిని అన్నిటినీ ఉదారంగా ఇస్తుందని ప్రసిద్ధి. **"సురభి"** శబ్దం కామధేనువాచకమని **"సురభిః శల్లకీ మాతృభిత్సురగోష**

యోషితి" అని మేదినీఘంటువు తెలుపుతున్నది. "సుష్ఠు రభంతే, రభ-రాభస్యే" అనే వ్యుత్పత్తిని కల సురభిశబ్దం ప్రకృతంలో భక్తులను తత్త్వజ్ఞాన ప్రదానం ద్వారా ఆనందింపజేస్తుందనే అర్థం ఇస్తుంది. వరవరమునుల శ్రీహస్తాన్ని ఈ రెండింటితో పోల్చడం అమూల్యమైన తత్త్వజ్ఞానసంపదను ఉదారంగా అనుగ్రహించే దాని స్వభావాన్నిబట్టి. "ఞానక్కై తా" అనికదా ఆళ్వార్లు ప్రార్థించారు. "సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా" అన్నట్లు భగవానుడుకూడా ఆచార్యావతారాన్ని ఎత్తినపుడు శాస్త్రపాణితోనేకదా ఉద్ధరిస్తాడు. ''ఆరుమ్ వణఙ్గుమ్'' అన్నందున వరవరమునుల సౌలభ్యం ప్రస్తావింపబడింది.

6. తడఙ్గొణ్డ కోయిన్ మణవాళమాముని తామరైత్తార్
వడఙ్గొణ్డ మార్బినిల్ వణ్ పురినూలు మెనదు నెఞ్జిల్
ఇడఙ్గొణ్డడఙ్గ ఎழுదివైత్తే నిని వల్వినైకాళ్ !
తిడఙ్గొణ్డ నీశర్ తన్దేయత్తిలేకిడుమ్ తీదఱవే

తడమ్ కొణ్డ = తటాకాలను నిండుగా కల, కోయిల్ మణవాళ మా ముని= శ్రీరంగంలోని మణవాళమహామునులయొక్క, తామరై త్తార్ వడమ్ కొణ్డ = తామరపూసలతో చేసిన మాలికలను కల్గిన, మార్బినిల్ = వక్షఃస్థలంలోని, వణ్ పురి నూలుమ్ = ఉదారమైన (గొప్ప) యజ్ఞోపవీతాన్ని, ఎనదు నెఞ్జిల్ = నా మనస్సులో, ఇడమ్ కొణ్డు = వాసస్థానంగా గ్రహించి, అడఙ్గ = అణగి ఉండేటట్లు, ఎழுదివైత్తేన్ = లిఖించివేశాను (నిలుకడగా ఉండేటట్లు చేశాను), ఇని = ఇక, వల్ వినైకాళ్ = ఓ నా ప్రబలదుష్కర్మలారా!, తీదు అఱ = మీకు ఏ కీడు లేకుండేటట్లు, తిడమ్ కొణ్డు = మనస్సులో దార్ఢ్యాన్ని పొంది, నీశర్తమ్ = నీచుల, తేయత్తిల్ = దేశంలోనికి, ఏకిడుమ్= పోయి చేరండి.

"యే కంఠలగ్నతులసీనలినాక్షమాలాః" అని చెప్పబడ్డ రీతిలో తామరపూసల మాలికలను ధరించడం విష్ణుభక్తలక్షణం. అటువంటి తామరపూసల మాలలను వరవరమునుల తమ వక్షస్థలంలో ధరించి ఉన్నారు. "యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్" ఇత్యాదిగా కీర్తింపబడే యజ్ఞోపవీతంకూడా ఆ వక్షస్సులో ప్రకాశిస్తున్నది. ఆ సన్నివేశాన్ని దర్శించి, ధ్యానించేవారి దుష్కర్మలు అన్నీ నశిస్తాయి- అని పాశురం సారం.

అచేతనాలైన దుష్కర్మలను చేతనసమాధిలో సంబోధించి పల్కడం ఒక కవితా చమత్కృతి. పై పాశురంలో చెప్పబడ్డ త్రిదండం, ఈ పాశురంలో ప్రస్తావింపబడ్డ యజ్ఞోపవీతం- ఇవి శ్రీవైష్ణవయతులకు అసాధారణచిహ్నాలు. శ్రీవేదాంత దేశికులుకూడా యతిరాజసప్తతిలో **"ఉపవీతినమ్.....త్రిదండహస్తమ్"** అని భగవద్రామానుజులను కీర్తిస్తూ ఈ రెండు చిహ్నాలను ప్రస్తావించారు. **"ముక్కోలుమ్ వా*ழ*ియే, శెయ్య మార్బుమ్ పురి నూలుమ్ వా*ழ*ియే"** అని అంటూ ఈ అణ్ణన్‌కూడా వా*ழ*ిత్తిరునామంలో వీటికి మంగళాశాసనాన్ని చేశారు. **"తేశ"** మనే పదం **"తేయమ్"** గా మారింది. **"తడమ్"**- తటాకం. **"తామరైకళ్‌తడఙ్గళ్ తోఱుమ్"** అని పెరియతిరుమొ*ழ*ి (3-10-1) ప్రయోగం.

గోదాదేవి తిరుప్పావైలో **"మాయనై...... దామోదరనై.... తూవి త్తొ*ழ*ుదు వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క పోయ పి*ழ*ైయుమ్ పుకుదరువా నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాకుమ్"** అని అంట భగవానుని త్రికరణశుద్ధిగా సేవిస్తే సకలపాపాలు నిప్పులో పడిన దూదివలె రూపు మాసిపోతాయని అన్నారు. వేదంకూడా **"యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత తథాహాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** అని అన్నది. భగవద్విషయంతో అనుసంధింపబడ్డ ఈ భావాన్ని ఇక్కడ అణ్ణన్ ఆచార్యవిషయంగా అనుసంధించడం విశేషం.

**7. మఙ్గాదులకై యరుళ్ మణవాళముని మరువార్**
**శిఙ్గారమాలై త్తిరుత్తోళ్‌కళుమ్ అవ*ఱ్ఱి*ల్ తిక*ழ*ుమ్**
**శఙ్గా*ழ*ియుమ్ తొ*ழ*ుదేత్తినేనాల్ తమియేనుడైయ**
**పఙ్గాళుమ్ వల్‌వినై యెఙ్గో కణత్తినిఱ్పాటియవే**

మఙ్గాదు = చెడకుండా ఉండేటట్లు, ఉలకై = లోకాన్ని, అరుళ్ = కటాక్షించే, మణవాళ ముని = మణవాళమునుల, మరు ఆర్ = సువాసన నిండిన, శిఙ్గారమాలై = అందమైన మాలికను ధరించిన, తిరు త్తోళ్‌కళుమ్ = అందమైన రెండు భుజాలు, అవ*ఱ్ఱి*ల్ = వాటిలో తిక*ழ*ుమ్ = ప్రకాశించే, శఙ్గు ఆ*ழ*ియుమ్ = శంఖాన్ని, చక్రాన్ని, తొ*ழ*ుదు= నమస్కరించి, ఏత్తినేన్ = స్తుతించాను, ఆల్ = ఆశ్చర్యం, తమియేనుడైయ పఙ్గు = అనన్యగతికుడను అయిన దాసుని పక్షాన్ని, ఆళుమ్ = శాసించే, వల్ వినై = బలమైన దుష్కర్మలు, కణత్తిల్ = క్షణంలో, ఎఙ్గో = ఎచటికో, పాటియ = పరుగెత్తివి. (ఏ- ఆశ్చర్యం !)

"ఎప్పోదుమ్ కైకழலా నేమియాన్ నమ్మేల్ వినై కడివాన్" (ఎల్లప్పుడు చేతిలో సుదర్శనాన్ని కలవాడు మన పాపాలను తీరుస్తాడు) అని నమ్మాழ్వార్లు కీర్తించిన రీతిలో భగవానుడు తన చేతిలోని సుదర్శనంతో మన పాపాలను తీరుస్తాడు. **"పాంచ జన్య! నిజధ్వానధ్వస్తపాతకసంచయ!"** (పాంచజన్యమా! తన ధ్వనితో పాపసమూహాలను నశింపజేసేవాడా!) అని అంటూ పంచసంస్కారసమయంలో మనం ఉచ్చరించే పాంచ జన్యస్తుతివల్ల భగవానుని శ్రీహస్తంలోని పాంచజన్యం తన ధ్వనితో సమస్తపాపాలను పోగొడుతున్నదని తెలుస్తున్నది. ప్రకృతంలో అణ్ణన్ ఈ భావాలను తమ ప్రబలపాపా లన్నీ వరవరమునుల భుజాలలో అంకితాలైన శంఖచక్రా లను దర్శించగానే నశించాయని అంటూ అనుసంధించడం విశేషం. **"యే బాహుమూల పరికర్మితశంఖచక్రాః"** అని అంటూ విష్ణుభక్తులకు చిహ్నంగా శంఖచక్ర ధారణం చెప్పబడిందికదా! **"తమియేనుడైయ"** - **"తమియేనుక్కరుళాయే"** అనే తిరువాయ్ మొழిసూక్తి స్మరణీయం. **"తమి యేనుడైయ"**- అసహాయుడనైన నాయొక్క-అని అర్థం. **"తమియన్"** ఒంటరివాడు. **"కురున్ద మొశిత్త తమియఱ్కు"** (తిరువాయ్ 6-6-8) అని ఆழ్వార్ల ప్రయోగం. **"శృంగార, లోక, క్షణ"** మనే సంస్కృతశబ్దాలు **"శిఙ్గార, ఉలకు, కణమ్"** గా మారాయి. **"ఆల్"** పాదపూరకమైన నిరర్థకావ్యయపదం. లేక, ఆశ్చర్యార్థకంగాకూడా చెప్పవచ్చు. **"మఱ్ఱుదల్"** నశించడం. **"మఱ్ఱియ మానిడ శాది"** (పెరియాழ్వార్తిరు- 4-6-2) ఇత్యాదిప్రయోగాలు గ్రాహ్యాలు. **"వానో! మఱికడలో! మారుతమో! తీయకమో! కానో ఒరుఙ్గిత్తుమ్ కణ్డిలమాల్, ఆనీన్టకన్ఱుయరత్తా మెఱిన్దు కాయుదిర్త్తార్ తాళ్పణిన్దోమ్ ఎన్తుయరై యావా! మరుఙ్గు"** (అసురావిష్టం అయిన వత్సాన్ని తాను పైకి విసరి, వెలగకాయను పడగొట్టినవాని శ్రీపాదాలను ఆశ్రయించాము. మన క్రూరకర్మలు మన సమీపంలో కనబడడం లేదు. అవి ఆకాశంలోకి చేరాయా ! లేక, అలలున్న సముద్రంలోనికా! గాలిలోనా! నిప్పులోనా! అడవిలోకా! చేరాయి) అనే పెరియతిరువన్దాది **(54)** పాశురభావాన్ని అణ్ణన్ ప్రకృతం వరవరమునుల విషయంలో సంభావించారు. **"పావనః సర్వలోకానామ్", "పవిత్రాణాం పవిత్రమ్"** ఇత్యాదిగా భగద్విషయంలో అను సంధించే సూక్తుల అర్థాలను అణ్ణన్ ఇందులో తమ ఆచార్యులపట్ల అనుసంధించారు. కనుక సకలపాపనిబర్హణరూపమైన అనిష్టనివృత్తి ఇక్కడ తెలుపబడింది.

**8. మొழியున్తమిழ் పునైయుమ్ మణవాళముని కరుణై
పొழియు న్తిరువిழియు న్తిరుమూక్కుమ్ పొలి మఱైకళ్**

శెఱ్ఱియన్బుకొణ్డురైక్కు న్తిరునావు న్తిరుముకముమ్
వఴి యన్బుకొణ్డు వఴిత్తినేన్ పేఱిని మఱ్ఱిలైయే

మొఴియుమ్ = పెద్దల, పూర్వాచార్యుల శ్రీసూక్తులను, తమిఴ్ = ద్రావిడ వేదసూక్తులను, పునైయ = ధరించిన, మణవాళముని = మణవాళమహామునుల యొక్క, కరుణై పొఴి = దయను వర్షించే, తిరు విఴియుమ్ = అందమైన రెండు నేత్రాలను, తిరు మూక్కుమ్ = శ్లాఘ్యమైన నాసికను, పొలి = వర్ధిల్లే, మఱైకళ్ = ఉభయవేదాంతాలను, శెఱి = (చేతనులపట్ల) సమృద్ధమైన, అన్బు కొణ్డు = వాత్సల్యాన్ని కల్గి, ఉరైక్కుమ్= పలికే, తిరు నావుమ్ = అందమైన జిహ్వా, తిరు ముకముమ్ = అందమైన ముఖము- అనే వీటిని, వఴి = విశేషమైన, అన్బు కొణ్డు = భక్తిని కల్గి, వఴిత్తినేన్ = స్తుతించాను, ఇని= ఇక, పేఱు = పరమపురుషార్థం, మఱ్ఱు ఇలై= వేఱొకటి లేదు.

"అన్బు" అనే పదానికి వాత్సల్యం, భక్తి- అనే వేఱ్వేరు అర్థాలు సందర్భాను సారంగా చెప్పబడ్డాయి. శ్రీవరవరమునుల తిరుముఖమండలంలోని నేత్రద్వయి, నాసిక, జిహ్వా- వీటిని కల్గిన ముఖం ఇందులో కీర్తింపబడుతున్నాయి. **"కరుణై పొఴ్గియ కణ్ణిణై వాఴియే"** అని అణ్ణన్ పల్కినట్లు వరవరమునుల తిరునేత్రాలు ఎపుడూ దయారసాన్ని వర్షిస్తాయి కదా! **"విపన్యవో జాగృవాంసః సమింధతే"** అని అంటూ వేదం భగవానుని దివ్యమంగళ విగ్రహాన్ని దర్శిస్తూ, మంగళాశాసనం చేయడమే పరమపురుషార్థమని అన్నట్లే అణ్ణన్ ఇందులో తమ ఆచార్యుల దివ్యమంగళవిగ్రహాన్ని సేవిస్తూ, దానిని కీర్తించడంకంటే ఉత్తమపురుషార్థం ఇంకొకటి లేదని అన్నారు. పూర్వ పాశురంలో అనిష్టనివృత్తి చెప్పబడగా ఇందులో ఇష్టప్రాప్తి తెలుపబడింది.

9. పొరునఱ్ఱుఱైయిలరుళాలిరున్ద నమ్పుఙ్గవర్కోన్
అరుణఱ్ఱమిఴ్మఱై మా మణవాళమామునివన్
తిరునెఱ్ఱియు న్తిరునామము న్తాలున్తిరుచ్చిగైయుమ్
వరుణత్తెఴిలు మనత్తినుళ్ళే నిన్ఱు వాఴ్విక్కుమ్

పొరు నల్ తుఱైయిల్ = తామ్రపర్ణీనదీయొక్క రేవు అయిన ఆఴ్వార్ తిరునగరిలో, అరుళాల్ = తమ నిర్హేతుకకృపతో, ఇరున్ద = వేంచేసి ఉన్న, నమ్ = మన, పుఙ్గవర్= నిత్యసూరులకు, కోన్ = నాయకులైన సేనైముదలియార్ అంశమైన నమ్మాఴ్వార్లు,

అరుళ్ = అనుగ్రహించిన, నల్ = మంచి, తమిழ் = ద్రావిడవేదాన్ని, ఉరై = వివరించే, అరుమ్ = అరుదైన, మా= గొప్ప, మణవాళమామునివన్ = మణవాళమహామునుల, తిరు నెற்றியుమ్ = అందమైన ఫాలభాగం, తిరు నామమ్= ఆ లలాటంలో అలంకరించుకొన్న ఊర్ధ్వపుండ్రం, తాలుమ్ = నాలుక, తిరు చ్చిగైయుమ్ = అందమైన శిఖ, వరుణత్తు= తిరుమేనిచ్ఛాయయొక్క, ఎழிలుమ్ = కాంతి, మనత్తిన్ ఉళ్ళే నిన్రు = మనస్సులోపల స్థిరంగా నిలచి, వాழ்విక్కుమ్ = నన్ను ఉజ్జీవింపజేస్తున్నాయి.

ఇందులో శ్రీవరవరమునుల ఉత్తమాంగశోభ అందలి పలు అంగాలను కీర్తించడంద్వారా తెలుపబడుతున్నది. **"పుజ్గవర్కోన్"**- పుజ్గవశబ్దం సంస్కృతపదం. గొప్ప పురుషుడని అర్థం. ప్రకృతంలోని సందర్భాన్నిబట్టి నిత్యసూరులను ఇది లక్షిస్తుంది. ఏనాడూ కర్మసంబంధాన్ని లేనివారుకదా వారు. వారి నాయకుడు- విష్వక్సేనుడు. అందువల్లనే సంప్రదాయంలో **"సేనైముదలియార్"** అని సేనాధిపతి, సేనానాయకుడని పేర్లు. శిఖ శ్రీవైష్ణవయతులకు అసాధారణచిహ్నం. **"శిఖయా శేఖరిణమ్ పతిం యతీనామ్"** అని యతిరాజసప్తతిలోని ప్రయోగాన్ని స్మరించాలి. భగవానుని కేశవాది నామాలను అనుసంధిస్తూ అలంకరించుకొనబడతాయి కనుక ఊర్ధ్వపుండ్రాలు నామా లనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. **"శఠారిం సైన్యపం భజే"** అని నమ్మాழ்వార్లు సేనైముదలియార్ల అంశతో అవతరించినట్లు సంప్రదాయంలో నమ్మిక. **"శేనైయర్కోన్ అవతారమ్ శెయ్ద వళ్ళల్ వాழிయే"** అని నమ్మాழ்వార్ల వాழிత్తిరునామం లోని సూక్తి. **"వరుణత్తు"**- వర్ణమనే సంస్కృతపదం వరుణంగా మారింది. ఇది ఇక్కడ శరీరవర్ణాన్ని లక్షిస్తుంది. వరవరమునుల శరీరవర్ణం సాత్త్వికగుణానికి ప్రతీక అయిన శ్వేతవర్ణం. దీని శోభను **"దుగ్ధోదన్వద్ధవళమధురం శుద్ధసత్త్వైకరూపం రూపం యస్య"** అని ఈ ప్రబంధకర్త అయిన అణ్ణన్ వరవరముని శతకంలో కీర్తించారు. **"తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమ్"** అని అంటూ గీత సత్త్వగుణంయొక్క నిర్మలత్వాన్ని, ప్రకాశస్వభావాన్ని తెలిపింది. సత్త్వగుణపూర్ణులైన వరవరమునుల దివ్యమంగళ విగ్రహవర్ణం తాను శోభిల్లడమేకాక ఆశ్రితులను కూడా శోభిల్లజేస్తుంది. **"తాలు"**- నాలుక. **"తాలాట్టు"** ఇత్యాదిప్రయోగాలు దీనికి ఉదాహరణ. **"పొరున్రு రైయిల్.... తమిழுరై"** అనే ప్రయోగస్వారస్యాన్ని బట్టి ఈ పాశురంలోని సన్నివేశం వరవరమునులు ఈడువ్యాఖ్యను శ్రీరంగంలోని గరుడ మండపంలో శ్రీరంగనాథునకు కాలక్షేపం చెప్పే సందర్భాన్ని తలపిస్తున్నదని భావించవచ్చు.

10. వాழ்ి శెన్దామరైత్తాళ్ తువరాడై మరుఙ్గు కొప్పూழ்
వాழ்ి మున్నూలుఱై మార్బు ముక్కోలుఱ్గై వాழ்ి తిణ్డోళ్
వాழ்ి శెవ్వాయ్ విழ்ి వాழ்ి పొన్నామ మరువు నుదల్
వాழ்ి పొఱ్కోయిన్ మణవాళమాముని వాழ் ముడియే

పొన్ కోయిల్ = బంగారుమయంగా ఉండే శ్రీరంగంలో వేంచేసి ఉన్న, మణవాళ మా ముని = మణవాళమహామునుల, శెమ్ తామరై త్తాళ్ = అందమైన, తామరలవంటి శ్రీపాదాలు, వాழ்ి =క్షేమంగా ఉండాలి, తువర్ ఆడై = కాషాయ వస్త్రం, మరుఙ్గు = మధ్యప్రదేశం, కొప్పూழ் = తిరునాభి, వాழ்ి = క్షేమంగా ఉండాలి, మున్నూల్ =యజ్ఞోపవీతం, ఉఱై = నివసించే (ఉండే), మార్బుమ్ = వక్షఃస్థలం, ముక్కోల్ అమ్ కై = త్రిదండాన్ని ధరించిన శ్రీహస్తం, వాழ்ి = మంగళంగా ఉండాలి, తిణ్ = (భక్తులను విడువని) బలాన్ని కల, తోళ్ = భుజాలు, వాழ்ి = క్షేమంగా ఉండాలి, శెవ్వాయ్ = ఎఱ్ఱని అధరం, విழ்ి = నేత్రాలు, వాழ்ి= మంగళం, పొన్ =బంగారంవలె శ్లాఘ్యమైన, నామమ్ = తిరునామం, మరువు = పొందికగా ఉండే, నుదల్ = నొసలు (ఫాలభాగం), వాழ்ి = మంగళం, వాழ் = వర్ధిల్లే, ముడి= దివ్యశిరస్సు, వాழ்ి = మంగళంగా ఉండాలి.

సింహావలోకనన్యాయంలో గత తొమ్మిది పాశురాలలో కీర్తించిన వరవర మునుల దివ్యావయవాలను అన్నిటినీ కలిపి మఱొక్క మారు అణ్ణన్ ఇందులో స్మరిస్తూ మంగళాశాసనం చేస్తున్నారు.

**(శెన్దామరై త్తాళ్)- "పోద చ్చివన్దు..... పాదక్కమలఙ్గళ్"** అనే సూక్తి భావం ఇందులో అనుసంధింపబడింది.

**(తువరాడై)- "వానిలై ఉయ్త్త తువరాడై"** - అనే ప్రయోగాన్ని స్మరించాలి.

**(మరుఙ్గు)- "మణవాళయోగి తిరు మరుఙ్గుల్"** అనే ప్రయోగం ఇక్కడ స్మారితం.

**(కొప్పూழ்)- "శుழ்ిపోల్ ఉన్దిచ్చుழ்ి"** అనే ప్రయోగంయొక్క అర్థం ఇందులో స్మరింపబడింది.

**(మున్నూలుఱై మార్బుమ్)- "మార్బినిల్ వణ్ పురినూలుమ్"** అనే ప్రయోగం స్మరణీయం.

**(ముక్కోలబ్జై)- "కైత్తామరైయిల్ శేరుమ్ తిరుత్తణ్డుమ్"** అనే సూక్తి భావ్యం.

**(తిణ్డోళ్)-** ఇందులో **"తిరుత్తోళ్కళుమ్"** అనే సూక్తి భావం అనుసంధింప బడింది. **"తిణ్ కழల్"** అనే తిరువాయ్మొழிసూక్తిని వ్యాఖ్యానిస్తూ పూర్వాచార్యులు ఆశ్రితులను విడువని బలాన్ని కల్గి ఉండడం అనే అర్థాన్ని **"తిణ్"** అనే విశేషణానికి తెలుపడం ప్రకృతంలోకూడా అన్వయించడం ఉచితం. **"గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రుం వాపి వరాంగనా, నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా"** అనే వాల్మీకి సూక్తిభావం వరవరమునుల విషయంలో భావింపబడింది.

**(విழி వాழி)-** "కరుణై పొழியుమ్ తిరువిழியుమ్" అనే భావం స్మారితం.

**(పొన్నా మరువు నుదల్)-** 'తిరునెற்றியుమ్ తిరునామముమ్" అనే ప్రయోగాన్ని స్మరించాలి.

**(పొఱ్కోయిన్ మణవాళ(మా)ముని) - "కోయిన్ మణవాళమాముని"** అనే ప్రయోగం ఆమ్రేడితం. తిరుమఙ్గైయాழ்వార్లు శ్రీరంగవిమానాన్ని స్వర్ణమయం చేశారని చరిత్రప్రసిద్ధి.

ఈ విధంగా చివరిపాశురం ప్రబంధంలో మిగిలిన తొమ్మిది పాశురాలకు సంగ్రహరూపం. **"ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్"** అన్నట్లు వక్తవ్యాంశంయొక్క సంగ్రహ విస్తరాలు విద్వాంసులకు అభిమతంకదా. శ్రీపాదాల స్తుతితో ప్రారంభం అయిన ఈ ప్రబంధం చూడాపీడవర్ణనతో తొమ్మిదవ పాశురంలో ముగియగా, ఉపసంహారరూపం అయిన ఈ పదవపాశురంలో పై దివ్యాంగాలకు నిత్యమంగళం ఆశాసింపబడింది. ఆచార్యుల తిరుమేనికి నిత్యమంగళం ఆశాసించడమే కదా శిష్యుని కర్తవ్యం. **"గురుం ప్రకాశయేద్ధీమాన్"** (బుద్ధిమంతుడను ప్రకాశింపజేయాలి) కదా **"తేశారుమ్ శిచ్చన్ అవన్ శీర్వడివై పేణు మవన్"** (తేజస్సును నిండుగా కల్గిన శిష్యుడు గురువుయొక్క దివ్యమంగళ విగ్రహాన్ని ఆదరించాలి) అనే ఉపదేశరత్తిన మాలైలోని వరవరమునుల శ్రీ సూక్తి భావ్యం.



# భగవద్రామానుజ తనియన్ వ్యాఖ్యానము

## ఆంధ్రానువాదము

**యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ-**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురో ర్భగవతోఽస్య దయైక సింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

యః = ఏ రామానుజులు, నిత్యం=అనుదినము, అచ్యుత = శ్రియః పతియొక్క, పద+అంబుజ = చరణారవిందముల, యుగ్మ = జంట అనెడి, రుక్మ = బంగారమునందలి, వ్యామోహతః = ఆశవలన, తత్+ఇతరాణి = ఆ పాదద్వంద్వముకంటే వేఱయినవానిని, తృణాయ మేనే = తృణముతో సమానముగా తలచిరో, అస్మద్గురోః = మనకు ఆచార్యులు, భగవతః = జ్ఞానాది షడ్గుణపూర్ణులు, దయా+ ఏకసింధోః = కరుణకు అద్వితీయమైన సముద్రమువంటివారును అగు, అస్య = ఈ, రామానుజస్య = భగవద్రామానుజుల యొక్క, చరణౌ = రెండు పాదములను, శరణం = శరణముగా, ప్రపద్యే = పొందుచున్నాను.

ఏ భగవద్రామానుజులు ఎల్లప్పుడు భగవానుని పాదారవిందములనెడి బంగారమునందలి ఆశవలన మిగిలిన అన్నిటిని తృణప్రాయముగా భావించిరో, అట్టివారు, మనకు ఆచార్యులు, భగవచ్ఛబ్దవాచ్యులు, దయకు సాటి లేని సముద్రమువంటివారును అగు ఈ శ్రీరామానుజుల పాదద్వంద్వమును శరణు పొందుచున్నాను.

## వ్యాఖ్యానానువాదము

**అవతారిక**

**(యో నిత్య మిత్యాది)** – శ్రీరామానుజమునీంద్రులవలన జ్ఞానమును పొందినవారై, (శ్రీవత్సచిహ్నులను) నిరూపకనామమును కలవారైన కూరత్తాళ్వాన్, శ్రీరామానుజదర్శనమును రక్షింపగోరి చోళరాజసభకు వెడలి **"నారాయణః పరం బ్రహ్మ"** (నారాయణుడు పరంబ్రహ్మ), **"నారాయణపరా వేదా:"** (నారా యణుడు పరతత్త్వమని ప్రతిపాదించునవి వేదములు) అనియు, **"నారణనై క్కాట్టియ వేదమ్"**

(నారాయణుని పరతత్త్వముగా తెలిపిన వేదము) అనియు **"నారాయణ! త్వయి న మృష్యతి వైదిక: క:"** (నారాయణా! వైదికుడు ఎవడు నీయందు ఈశ్వరత్వమును సహింపడు?) అని, **"నారణనే యావతీతన్హు ఎన్బార్ ఆర్"** (శ్రీమన్నారాయణుని అనుగ్రహముచే ఫలమునిచ్చునవి అగుచున్నవి, ఈ నిజమును కాదనువారు ఎవరు?) అనియు" **"అన్యాయ్య మన్యాయ్యమ్"** అనియు సమాధాన మును పల్కి జయించి,**"కలైయఱ క్కఱ్ఱ మాన్దర్ కాణ్బరో? కేట్పరోతాన్"** (శాస్త్రములను చక్కగా అభ్యసించి తాత్పర్యమును గ్రహించిన మనుష్యులు నీచమతములను మనస్సుతో కనుగొందురా? చెవులతో విందురా?) అనునట్లు వారి (నాస్తికుల) దర్శనము తమకు సహింపరానిది కాగా, ఆ దర్శనమును (నేత్రములను) కోఱక (త్యజించి), తిరిగి శ్రీరంగమునకు వేంచేసి, దర్శనప్రవర్తకులగు భగవద్రామా నుజుల దర్శనమును అపేక్షించి, ఎదురు చూచుచు వేంచేసియుండిరి. వారును (భగవద్రామానుజులును) **"ఇని యతిన్దేన్ ఈశఱ్కుమ్ నాన్ముకఱ్కుమ్ దెయ్ వమ్... నత్కిరిశై నారణన్ నీ"** (ఈశ్వరునకు, బ్రహ్మకును దైవముగా ఇపుడు (నిన్ను) తెలిసికొంటిని ... నిర్హేతుకరక్షణమను గొప్ప వ్యాపారమును కల నారాయణుడవు నీవు) అని, **"తిరువిల్లా తేవర్"** (లక్ష్మి లేని దేవతలకు) అందటికంటె అధికుడని మేల్‌నాడులో (తిరునారాయణపురములో) నారాయణుని స్థాపించి తిరిగి వచ్చి, **"అరఙ్గనల్లాల్ దెయ్వ మిల్లై"** (శ్రీరంగనాథునికంటె వేఱొక దైవము లేదు) అని అందరికి తెలియజేసి, శ్రీరంగనాథునకు కైంకర్యమును చేయుచు ఉండగా, కూరత్తాழ్వానులు నేత్రములను కోల్పోవుటను చూచి, కలతజెంది, "వరదరాజ స్వామి నేత్రపుత్రాదులగు ఐహికపురుషార్థములను, పరమపదమను ఆముష్మిక పురుషార్థమును కూడ ఇచ్చువాడగుటచే మీరు (మీ) నేత్రవిషయముగా ఒక స్తోత్రమును చేయుడు" అని (కూరత్తాழ్వాన్‌ను) నియమింపగా, అట్లే **"అస్తు"** అని అంగీకారపూర్వకముగా స్తోత్రమును అనుగ్రహించు కూరేశులు **"నేత్రసాత్కురు కరీశ! సదా మే"** (వరదరాజస్వామీ! ఎల్లప్పుడు నా కన్నులకు కన్పింపుము) అని, **"కరీశ పశ్యేమ శతం సమా:"** (కరీశా! నూఱు ఏండ్లు (నిన్ను) దర్శింతుము) అనియు అచటి (పరమపదములోని) అనుభవమునకు సాధనమగు అప్రాకృతమైన నేత్రమును అపేక్షింపగా, ఆ విధముగానే పేరరుళాళన్ అగు (గొప్ప దయానిధి

అగు) శ్రీరంగనాథుడును **"పశ్యంతి చ సదా దేవం నేత్రైః జ్ఞానేన వాఽమరాః"** (అమరులు ఎల్లప్పుడు దేవుని జ్ఞాననేత్రముతో దర్శింతురు) అని, **"సర్వం హ పశ్యః పశ్యతి"** (ముక్తపురుషుడు సర్వమును దర్శించుచున్నాడు) అను రీతిలో రెప్పపాటు లేని నేత్రమును (అప్రాకృతనేత్రమును) పొందునట్లు వీరు (కూరేశులు) పరమపదమునకు పోవుటకు అనుమతి ప్రసాదింపగా, వారును (కూరేశులు) మిక్కిలి సంతోషించినవారై, ఆఌ్వార్ తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్ గృహములో బయటనుండు ఇంటిలో వేంచేసియుండగా (పరస్థానము చేయగా), దీనిని శ్రీరామానుజులు విని (తక్షణమే కూరేశులు పరమపదమునకు వెడలిరి అనునట్లు) మిక్కిలి కలతజెంది, వీరున్న చోటికి వేగముగా వేంచేసిరి. వీరును (కూరేశులు) **"పరన్దామ మెన్నుమ్ దివమ్"** (పరంధామమనెడి పరమపదమును) అనుగ్రహించుట వారికి (శ్రీరామానుజులకు) తిరస్కరించుటకు వీలు కానట్లు వారి విషయమున ప్రపత్తియగు ఈ శ్లోకమును **"రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే"** అని విన్నవించి వారి పాదములందు వ్రాలగా, వారును (శ్రీరామానుజులును) వీరి అభిప్రాయమును గ్రహించి, తమ సొత్తు అగు ప్రపత్తిని **"తిరునారణన్తాళ్ కాలమ్బెఱ చ్చిన్దిత్తుయ్మినో"** (తిరునారాయణస్వామి పాదములను ఎల్లవేళల చింతించి, ఉజ్జీవింపుడు) అనునట్లు **"శ్రీమన్నారాయణ! తవ చరణారవింద యుగళం శరణ మహం ప్రపద్యే"** అని కొఱత లేని విధమున వీరి కుడిచెవిలో అనుగ్రహించిరి. దానినిబట్టియే, శ్రీవైకుంఠగద్యలో వారు (శ్రీరామానుజులు) ప్రార్థించిన ఫలమును వీరును (కూరేశులును) శ్రీవైకుంఠస్తవములో ప్రార్థించి, ఫలముతో పూర్తి చేసిరి. ఆ ఫలము (భగవత్కైంకర్యము) ఆచార్యాధీనమగుటచే మొదట శ్రీరామానుజుల (పాదముల)ను శరణు పొందుచున్నారు.

**(యో నిత్యమ్)** ఇందు భక్తి, వైరాగ్యము, జ్ఞానము, గురుత్వము, దయ మొదలగు గుణముల ఆధిక్యముచే ముక్తిని ఇవ్వగల్గు శక్తిని కల శ్రీరామానుజుల పాదములను ఉపాయముగా ఆశ్రయించుచున్నారు.

**(యో నిత్యమ్) – "తిశై యనైత్తు మేఱుఙ్గుణన్"** (దిక్కులన్నిటియందు వ్యాపించు గుణములను కలవారు) అని చెప్పబడు గుణములను కల్గిన కీర్తిని కల్గినవారై, ఎల్లప్పుడు ఆశ్రితులను ఎట్టి లోపము లేకుండ రక్షించునట్టి భగవానుని

చరణారవిందయుగళమందు గల వ్యామోహముచే భగవానునికంటె ఇతరము లయిన వస్తువులను అన్నిటిని తృణముగా భావించువారై, దాసుడనగు నాకు తెలియనివానిని తెలియజేయువారై, దానికి మూలమైన జ్ఞానాధిక్యమును కలవారై, దిక్కు లేనివారిపట్ల అయ్యో! అని జాలి తలచు కరుణను కలవారై, చరరూపులై, నా ముందుకు వచ్చి నిలిచిన ఈ శ్రీరామానుజులయొక్క ఈ చరణములను శరణముగా పొందుచున్నాను - అని (కూరేశులు) అనుచున్నారు.

**వ్యాఖ్యానము :-**

**(యో నిత్యమ్)- "యః"** అని (సర్వనామశబ్దము) వైదికోత్తములు అనెడి ప్రసిద్ధినిబట్టి చెప్పబడుచున్నది. **"నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహతః"** అనుటచే - **"సర్వేషు దేశకాలేషు సర్వావస్థాసు చాచ్యుత, కింకరోఽస్మి"** (అచ్యుతా! అన్ని దేశములయందు, అన్ని కాలములయందు, అన్ని సన్నివేశములందు నీకు సేవకుడనైయున్నాను) అనియు, **"అచ్యుతభక్తితత్త్వజ్ఞానామృతాబ్ధి"** (అచ్యుత భక్తితత్త్వజ్ఞానమను అమృతసముద్రము) అనియును చెప్పబడునట్లు **"ప్రణతార్తి హరాచ్యుతు"**లగు వరదరాజస్వామి అందమైన పాదపద్మములందలి నిరవధికమైన ప్రేమచే **"త్వత్పాదకమలాదన్యన్న మే"** (నీ పాదపద్మములకంటె వేఱొక దిక్కు నాకు లేదు) అనునట్లు ఆ స్వామి పాదములకంటె వేఱయినవానిని అన్నిటిని తృణముతో సమానముగా తలచియుందురని చెప్పబడినది. **"నిరస్తేతరభోగాశో వరదం శరణం గతః"** (మిగిలిన అన్ని భోగములయందలి ఆశ తొలగినవాడై వరదరాజస్వామిని శరణు పొందినవాడు), **"తెన్నత్తియూరర్ క*ழ*లిణైక్కీ*ழ்* పూణ్డ వన్బాళన్ ఇరామానుశన్"** (అందమైన హస్తిగిరిలోని వరదరాజస్వామి పాదపద్మములపట్ల ప్రీతిని కల శ్రీరామానుజులు) అనునట్లు వరదనారాయణునకు కదా **"యో నిత్యం సతతం ధ్యాయేన్నారాయణ మనన్యధీః"** (అనన్యమైన భక్తిని కలవాడై ప్రతిదినము ఎల్లప్పుడు నారాయణుని ఎవడు ధ్యానించునో) అనునట్లు నిరవధికప్రేమతో నిత్యము తిరువారాధనను శ్రీరామానుజులు చేయుదురు. ఆ భక్తి అనెడి ఐశ్వర్యముయొక్క బలముచే, **"తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః"** (అత్యుత్తమమైన ఐహికభోగములను, ముక్తిని తృణీకరించినవారిచే) అనునట్లు, **"కొళ్వదెణ్ణుమో తెళ్ళియార్కుటిప్పు"** (వివేకమును కలవారి మనస్సు - లౌకిక

ఆముష్మికభోగములను పొందవలెనని తలచునా?) అనునట్లును మిగిలిన అన్నిటిని తృణీకరించియుందురు. **"కదాఽ హం భగవత్పాదాంబుజద్వయపరిచర్యాశయా నిరస్తసమస్తేతరభోగాశాపగత సమస్తసాంసారికస్వభావః"** (భగవానుని పాదాం బుజముల జంటకు కైంకర్యము చేయవలెనను ఆశచే అన్ని ఇతరములైన భోగములలోని ఆశను, సమస్తసాంసారిక స్వభావములను (సుఖదుఃఖములను) తొలగినవాడను ఎపుడు కాగలను? అని వీరి (శ్రీరామానుజుల గద్యత్రయ) సూక్తియు కలదు.

**(యః) – "తిక్కుఱ్ఱ కీర్త్తి ఇరామానుశన్"** (దిక్కులలో వ్యాపించిన కీర్తిని కల శ్రీరామానుజులు) అని ప్రసిద్ధులైనవారు – అని భావము.

**(నిత్యమ్)** – ఎల్లప్పుడు.

**(అచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహతః)** – అచ్యుతుడు అనగా – గుణములలో, విగ్రహములో (రూపములో), విభూతులలో లోపము లేకుండ నుండువాడని గాని, ఆశ్రితులకు చ్యుతి కలుగనీయనివాడని గాని, ఆశ్రితులను రక్షించుటలో చ్యుతి లేనివాడనిగాని అర్థము. **"వీవిలిన్బమ్ మిక ఎల్లై నికழ்న్ద నమ్మమ్ అచ్చుదన్ వీవిల్ శీరన్ మలర్కణ్ణన్ విణ్ణోర్పెరుమాన్"** (నాశనము లేని ఆనందముయొక్క చరమావధిలోనున్న మనయొక్క అచ్యుతుడు, అంతము లేని కళ్యాణగుణములను కలవాడు, పద్మనేత్రుడు, నిత్యసూరులకు స్వామి) అని, **"ఆతుమిల్ కాలత్తు ఎన్దై యచ్చుత నమలన్"** (ఎట్టి సహాయము లేని ప్రళయకాలమందు నాకు సహాయకుడై, స్వామియైయున్న అచ్యుతుడు, పరిశుద్ధుడు) అనియు, **"అయరవాజ్గ నమన్టమర్కు అరునఞ్జైనై యచ్చుతన్తన్నై"** (మోహము పొందునట్లు ప్రాణములను కొనిపోవు యమభటులకు విరుగుడు లేని విషమువంటివాడు; ఆశ్రితులను విడువని అచ్యుతుడు) అనియు, **"న త్యజేయమ్"** (విడువను) అని చెప్పబడు గుణములందు వీరు ప్రవణులయ్యిరి. ఆ అచ్యుతపదాంబుజ యుగ్మరుక్మవ్యామోహము అర్చావతారము మొదలు పరరూపమువరకు అంతట నిత్యమైయుండు రీతిలో వీరికి కలదు. అది ఎట్లనగా– **"అత్తికిరి ప్పచ్చై నిఱత్తు అచ్చుతన్"** (హస్తిగిరిలోని పచ్చని వర్ణమును కల అచ్యుతుని) పదాబ్జములందును, **"వేఙ్గడత్తు అచ్చుతన్"** (వేంకటాచలములోని అచ్యుతుని)

యొక్క **"తాఙ్గు తామరైయన్న పొన్నారడి"** (ధరించు తామరవంటి అందమైన పాదముల) యందును, **"అరఙ్గ మానకర్ అచ్చుతన్ ఉలకమళన్ద పొన్నడి"** (శ్రీరంగములోని అచ్యుతుని లోకమును కొలిచిన అందమైన పాదముల) యందును, (ఇది అర్చామూర్తి విషయము) **"నణ్ణి త్తొழుమవర్"** (ఆశపడి ఆశ్రయించి కొలుచువారి), **"నచ్చువార్ మున్ నిఱ్కు నారాయణన్ అచ్చుతన్"** (తనను ఆశపడువారి ముందు నిలచు నారాయణుడగు అచ్యుతునియొక్క) **"తుళఙ్గు శోది త్తిరుపాదమ్"** (వెలుగు జ్యోతివంటి శ్రీపాదము) లందును, (ఇది అంతర్యామి విషయము) **"తయతఱ్కు మకనాన అచ్చుతన్"** (దశరథుని కుమారుడగు అచ్యుతుని) **"కాదుఱైన్ద పొన్నడి"** (అరణ్యములందు సంచరించిన పాదము) లందును, **"కోవిన్దన్ అచ్చుతన్ పొఱ్ఱామరైయడి"** (గోవిందుడు అగు అచ్యుతుని బంగారమువలె ఆశ పడతగిన, తామరలవంటి పాదము)లని చెప్పదగినవై, **"కానిల్ కన్రిన్ విన్ పోన"** (అరణ్యములందు దూడల వెనుక పోయిన) బంగారుపాదములందును, (ఇది విభవవిషయము) **"అచ్చుతన్ అనన్తశయన్ శెమ్బొన్ తిరువడియిణై"** (అచ్యుతుని, అనంతునియందు శయనించువాని అందమైన పాదయుగము) నందును, (అనంతశయనుడనుటచే వ్యూహవిషయము) **"వీవిలిన్బమ్ మిక ఎల్లై నికழ్న్ద నమ్మచ్చుతన్"** (నాశము లేని ఆనందముయొక్క చరమావధిలోనున్న మన అచ్యుతుడు) అగు **"విణ్ణోర్ పిరానార్ మాశిల్ మలరడి"** (ఇది పరవిషయము) (నిత్యసూరినాథుని దోషరహితమైన, పూవువంటి పాదము) లందును వీరు వ్యామోహమును కల్గియున్నారు. ఈ వ్యామోహము **"ఆర్వమొడు నిచ్చ నినైవార్"** (అభినివేశముతో నిత్యము తలచువారు) అనునట్లు కదా (వీరి) నిత్యమైన ఇచ్ఛగా కొనసాగును. **"తెన్నత్తియూరర్ కழలిణైక్కீழ் పూణ్డవన్ పాళన్"** (అందమైన హస్తిగిరినాథుని పాదద్వంద్వము విషయమున భక్తిని కలవారు) అని, **"అరఙ్గన్ కழల్ శెన్ని వైత్తు త్తానతిల్ మన్నుమ్"** (శ్రీరంగనాథుని పాదములను తలపై పెట్టుకొని, తాను అందు అమరియుండును) అని, **"పఞ్జి త్తిరువడి పిన్నైతన్గాదలన్ పాదమ్ నణ్ణా"** (దూదివంటి మృదువైన శ్రీపాదములు కల నప్పిన్నైకు ప్రియుడు అగు శ్రీకృష్ణుని పాదములను ధ్యానింపని) అని, **"నిన్ద వణ్ కీర్త్తియుమ్ నీళ్ పునలుమ్ నిఱైవేఙ్గడ పొఱ్కున్దముమ్ వైకున్దనాడుమ్ కులవియ పాఱ్కడలుమ్**

**ఉన్దనక్కు ఎత్తనై యిన్బమ్ తరుమ్"** (శాశ్వతమైన, అందమైన కీర్తిని కల, దీర్ఘములైన సెలయేళ్లతో నిండియున్న వేంకటాచలమను పేరును కల బంగారు పర్వతము, వైకుంఠము, సత్పురుషులు కొనియాడు క్షీరాబ్ధియు నీకు ఎంత ఆనందము నిచ్చునో) అని శ్రీరామానుజుల విషయమున చెప్పబడుచున్నది కదా! వారును (శ్రీరామానుజులును) **"ప్రణతార్తిహర"** (వరదరాజస్వామీ!) అని **"బ్రహ్మణి శ్రీనివాసే"**, (పరబ్రహ్మయగు శ్రీనివాసునియందు) అని, **"శ్రీరంగశాయినమ్"** (శ్రీరంగశాయిని) అనియు, **"ఆత్మానం చ సారథిమ్"** (సారథియగు తనను) అనియును, **"కాకుత్స్థ"**, **"శేషిణే శేషశాయినే"** (శేషునియందు పవళించిన శేషియైనవానికొఱకు), **"వైకుంఠనాథ"** (వైకుంఠనాథా) అనియును అర్చా, విభవ, వ్యూహ, పరరూపములను గూర్చికదా పల్కిరి. అందుచే **"పూవార్ కழల్కళ్"** (పుష్పములతో పోలిన పాదము) లందు (అర్చావతారము) **"కణ్ణన్ కழలిణై"** (శ్రీకృష్ణుని పాదద్వయి) యందు, **"కాకుత్తన్ తన్నడి"** (కాకుత్స్థుని పాదము) లందును (విభవము), **"పాఱ్కడలుల్ పైయిల్ తుయిన్ఱ పరమనడి"** (క్షీరాబ్ధిలో ఆదిశేషునిపై తూగునట్టి పరమాత్మపాదము లందును (వ్యూహము), **"వైకున్ద చ్చేవడి"** (వైకుంఠనాథుని అందమైన ఎఱ్ఱని పాదము) లందును (పరరూపము), సర్వాంతర్యామియైన నారాయణుని చరణములందును (శ్రీరామానుజులు) వ్యామోహమును కల్గినవారై యున్నారు. ఇట్లు అయిదు అవస్థలలోనున్న సర్వేశ్వరుని చరణారవింద యుగళములోని మకరందరసా స్వాదమును తుమ్మెదయై అనుభవించి, అందు మునిగినవారై, దానికంటె వేఱైనవి అగు బ్రహ్మపర్యంతము గల అమంగళమైన పాంచభౌతిక విషయపంచకమును, దానికి మించిన ఆత్మానుభవమును తృణముగా తలచియుందురు. ఇట్టి భక్తిని, విరక్తిని కల వీరి పాదములే భగవానుని పరత్వాదిరూపములన్నియు అని తలచి (కూరేశులు) వానిని ఆశ్రయింప గోరుచున్నారు.

**(అస్మద్గురోః)** – ముందు చెప్పిన అచ్యుతభక్తి కారణము వలన, ఆ భక్తికంటే ఇతరములయినవానిని తృణీకరించుటచే వీరిని ఆచార్యులుగా కూరేశులు ఆశ్రయించిరి. **"చిదచిత్పరతత్త్వానాం తత్త్వయాథాత్మ్యదాయినే"** (చిత్తు, అచిత్తు, పరమాత్మ – అను తత్త్వముల స్వభావమును ఉన్నది ఉన్నట్లు ఉపదేశించువానికి)

అనునట్లు తత్త్వత్రయమును (శ్రీరామానుజులు) ఉపదేశించుటచే స్పష్టముగా (వానిని వివేకించి) తెలిసికొని, **"భోగా ఇమే విధి శివాదిపదం చ కిం చ స్వాత్మానుభూతి రితి యా కిల ముక్తి రుక్తా, సర్వం తదూషజలజోష మహం జుషేయ"** (ఈ లౌకికసుఖములు, బ్రహ్మరుద్రాది అధికారస్థానమును, ఆత్మానుభవమని చెప్పబడు ముక్తియు – వీనినన్నిటిని నేను ఉప్పునీటినివలె గ్రహింతును) అని తత్త్వద్వయ (చిత్తు, అచిత్తుల) విషయమున వైరాగ్యమును, **"తవ దాస్య మహారసజ్ఞః"** (నీ దాస్యమను గొప్ప రసమును తెలిసినవాడను) అని తత్త్వైకవిషయ (పరమాత్మ ఒక్కనియందే) భక్తిని కల్గియున్నవారగుటచే కూరేశులు తమకు తగినట్లు **"అస్మద్గురోః"** అని పల్కుచున్నారు. **"జ్ఞానదీపప్రదే గురౌ"** (జ్ఞానమను దీపమును ఇచ్చు గురువుయందు), **"అంధకారనిరోధిత్వా ద్గురు రిత్యభిధీయతే"** (చీకటిని నిరోధించుటచే గురువు అనబడుచున్నాడు) (అను) ఈ రెండింటికిని (జ్ఞానదీపప్రదానమునకు, అజ్ఞానము అను చీకటిని పోగొట్టుటకును) మూలము భగవద్రామానుజులే కదా! **"శ్రీమద్రామానుజార్యా త్సమధిగత సమస్తాత్మవిద్యః"** (శ్రీరామానుజులవలన పొందిన అన్ని వేదాంతవిద్యలను కలవారు) అని చెప్పబడునట్లుగా కూరేశులు అయ్యిరి. వీరిని శ్రీరామానుజులు తమ మొదటి శిష్యులుగా తలచి, వీరికి మొదటగా అష్టాక్షరి మొదలగు రహస్యములను అనుగ్రహించి, అభిమానించిరి. నరనారాయణావతారములు అనునట్లుకదా శ్రీరామానుజుల, కూరేశుల కలయిక ఉండెను. మిగిలినవారిని అందఱిని ఒక ఎత్తుగా, వీరిని ఒక ఎత్తుగా కదా శ్రీరామానుజులు తలచిరి. దానిని బట్టియే **"ఒరు మకళ్తన్నై యుడైయేన్"** (అద్వితీయయైన కుమార్తెను కల్గినవాడనైతిని) అని (కూరేశులను గూర్చి) శ్రీరామానుజులు పల్కిరి కదా ! ఇట్లు అద్వితీయులై ఇద్దఱును (గురుశిష్యులిద్దఱును) ఉండిరి. **"కలైయఱ క్కఱ్ఱ మాన్దర్"** (శాస్త్రములను చక్కగా అభ్యసించిన మనుష్యులు) అనునట్లున్న వీరికి (కూరేశులకు) సకలార్థములును ప్రసాదించునట్టి జ్ఞానవైభవమును (శ్రీరామా నుజులు కల్గియుండుటను) **(భగవతః)** అను పదము తెల్పుచున్నది. **"శొల్లార్ తమిழ்ఒరు మూన్ఱుమ్ శురుదికళ్ నాన్గు మెల్లైయిల్లా అఱ నెఱి యావుమ్ తెరిన్దవన్"** (విలక్షణములైన శబ్దములను కల్గినది, **ఇయల్, ఇశై, నాటకమ్** – అను మూడు

విధములైన ద్రావిడప్రక్రియలను కల్గినదగు ద్రావిడమును, నాల్గు వేదములను, అంతు లేని ధర్మశాస్త్రములను అన్నిటిని తెలిసినవారు) అని, **"వణ్మై నన్ఞాన మురైత్త"** (ఔదార్యముతో యథార్థజ్ఞానమునుపదేశించిన) అని, **"ఇరామానుశన్ మెయ్మ్మతిక్కడల్"** (శ్రీరామానుజులు యథార్థజ్ఞానసముద్రులు) అనునట్లు కదా (వీరి) జ్ఞానవైభవము ఉన్నది. **"సర్వకల్యాణసంపూర్ణం సర్వజ్ఞానోపబృంహితమ్, ఆచార్యమాశ్రయే ద్ధీమాన్ శ్రేయోఽర్థీ సుసమాహితః"** (సకల కల్యాణగుణములతో పూర్ణుడు, సమస్తజ్ఞాన మును పూర్ణముగా కలవాడగు ఆచార్యుని బుద్ధిమంతుడు, తన హితమును కోరువాడు వినయమును కలవాడై ఆశ్రయింపవలెను) అని చెప్పబడుచున్నది కదా! భగవచ్ఛబ్దము సమస్తకల్యాణగుణములను, పరిపూర్ణ జ్ఞానమును తెలుపుటచే, శ్రీరామానుజులు వానిచే ఎట్టి కొఱతయు లేనివారై యుండుటను చెప్పుచున్నది. దీనిచే (ఇంతవరకు) తమకు అజ్ఞాతజ్ఞాపనమును చేయుటకు తగిన శ్రీరామానుజుల జ్ఞానవైభవమునుగూర్చి పల్కిరి. ఇక తమ దుర్గతిని చూచి, జాలిపడునట్టి వారి దయాపూర్తిని తెలుపుచున్నారు.

**(అస్య దయైకసింధోః)** అని (శ్రీరామానుజుల దయాగుణములో మగ్న మగునట్లు) అభినివేశమును పొందుచున్నారు. **"అస్య రామానుజస్య"** అని పైపదముతో అన్వయము. **"దయైకసింధోః"** అనగా – కేవలకృపామాత్ర ప్రసన్నాచార్యులని అర్థము. **"పయనన్రాకిలుమ్ పాఙ్గల్లరాకిలుమ్ శెయల్ నన్రాక త్తిరుత్తి ప్పణి కొళ్వాన్ కుయిల్ నిన్రార్ పొழிల్శూழ் కురుకూర్నమ్బి"** (ఇతరులను శిక్షించు ప్రయత్నము ఫలితము లేనిదైనను, వారికి శిక్షణయోగ్యత లేకున్నను, వారిని స్వానుష్ఠానముద్వారా చక్కగా సంస్కరించుటకొఱకై కోయిలలు నిలచి మధురముగా కూయు తోటలచే చుట్టబడియున్న తిరునగరిలో వేంచేసియున్న గుణపూర్ణుడవగు స్వామీ !) అనునట్లు (ఆచార్యుల కరుణ) ఉండును కదా! **"పాడినాన్ అరుళ్ కణ్డీర్ ఇవ్వులకినిల్ మిక్కదే"** (పాడినవాని కృప ఈ లోకమున మిక్కిలి గొప్పది చూడుడు!), **"ఎణ్డిశైయు మఱియ వియమ్బుకేన్ ఒణ్డమిழ் శడకోపనరుళైయే"** (అతిమధురమైన ద్రావిడపాశురములను అను గ్రహించిన శఠకోపుల కరుణనుగూర్చి ఎనిమిది దిక్కులయందు తెలియునట్లు ప్రచారము చేయుదును) అనునట్లు, **"నికరిన్రి నిన్ర ఎన్ నీశతైక్కు నిన్నరుళిన్కణిన్రి ప్పుకల్

**ఒన్రుమిల్లై యరుట్కు మ.ి.వదే పుకల్"** (సాటి లేని నా నీచతకు నీ కృపయందు తప్ప వేఱొక ఆశ్రయము లేదు. మీ కృపకును అదియే, అనగా – నా నీచతయే ఆశ్రయము) అనునట్లు, **"ఉన్ పెరుఙ్కరుణై తన్నై"** (మీ నిరవధికకృపను) అనునట్లు, **"వణ్మైయినాలుమ్ తన్మాతకవాలుమ్"** (తమ ఔదార్యముచేతను, గొప్ప కృపచేతను) అనునట్లు వీరి కృపయొక్క గొప్పతనమున్నది కదా! **"అరుళాళ ప్పెరియమ్మాన్"** (కరుణాసముద్రుడైనస్వామి)యై, **"దయాసింధో! బంధో!"** (దయా సముద్రుడా! సర్వవిధబంధువా!) అనునట్టి సర్వేశ్వరుని దయను మఱుగుపరచిన సమయమున కూడ ఆశ్రయము పొందదగిన కృప (శ్రీరామానుజుల కృప). అతడు (భగవానుడు) చేయి విడచిన సంసారులనుకూడ **"వృథైవ భవతో యాతా భూయసీ జన్మసంతతిః, తస్యా మన్యతమజ్జన్మ సంచింత్య శరణం వ్రజ"** (వ్యర్థముగా మీ జన్మపరంపరలు అనేకము గడచినవి. వానిలో దీనిని ఒక జన్మగా తలచి, భగవానుని ఆశ్రయింపుము) అని ఉపదేశించి సంస్కరించువారుకదా (శ్రీరామానుజులు). పూర్వము పల్కిన జ్ఞానభక్తివైరాగ్యములు, నిరవధిక దయ – అను ఈ గుణములన్నిటిని వినుట మాత్రమేకాక, కంటితో దర్శించి అనుభవించునట్లు ప్రత్యక్షముగా ముందుకు వచ్చి నిలచినవారిని **(అస్య రామానుజస్య)** అనుచు దర్శించుచున్నారు. "ఈ శ్రీరామానుజులయొక్క" అనుట వీరి (కూరేశుల) అభినివేశమునకు తగిన విషయమున్న తీరు తెల్పుచున్నది.

**(రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే)** – నారాయణుని చరణములను ఆశ్రయించుటకంటె, శ్రీరామానుజుల చరణములను ఆశ్రయించుట స్వరూపానురూపమై, అమోఘమై (నిష్ఫలము కానిదై) యుండుటచే వారి శ్రీపాదములను శరణముగా ఆశ్రయించుచున్నారు. **"పయ్యాతాకాతు ఒన్రఱిన్దేన్"** (నిష్ఫలము కానిదొక ఉపాయ మును తెలిసితిని) ఇత్యాదులు ఇచట (అనుసంధేయ ములు). **"మాఱాయ తానవనై .. వేఱాక ఏత్తి యిరుప్పారై వెల్లుమే మఱ్ఱవరై చాఱ్ఱి యిరుప్పార్తవమ్"** (ఏ ప్రయత్నముచేతను మాఱని దానవుడగు హిరణ్యక శిపుని చంపిన నృసింహుని విలక్షణముగా స్తుతించినవారిని, ఆ శ్రీవైష్ణవులను ఆశ్రయించి యుండు చరమపర్వనిష్ఠుల పుణ్యము జయించును). (అనునట్లు చరమపర్వనిష్ఠను సూచించు శ్రీరామానుజచరణవరణము అమోఘము) అని, **"పాఙ్కడలు మున్దనక్కు**

ఈరీతిలో విభవావతారాలలో తాను ప్రయత్నించిన చోట అంతా ప్రయోజనం కల్గనందున, సదాచార్యాశ్రయణం తనకు కలుగలేదే! - అనే కొఱతతో ఉండే భగవంతుడు కనీసం అర్చావతారంలో అయినా, ఆ కొఱతతీరేటట్లు సదాచార్యుని ఆశ్రయించి, ఉజ్జీవించాలి - అని తలచాడు. **"మామునివేళ్విౡై కాత్తు అవపిరత మాట్టియ అడుతిఱతి లయోత్తియెమ్మరశే !"** (విశ్వామిత్రమహర్షి యాగాన్ని కాచి, అవబృథాన్ని నిర్వహింపచేసిన చేసిన గొప్ప బలిమిని కల మా అయోధ్యాధిపతి!), **"కోవలనాయ్ వెణ్ణె యుణ్డ వాయన్"** (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడు) అయిన శ్రీరంగనాథుని రూపంలో ఆచార్యత్వపూర్తిని కల మణవాళమహామునుల దగ్గర శిష్యవృత్తిని చేసి కృతార్థుడయ్యాడు. అటువంటి సాటి లేని గొప్పతనాన్ని కల శ్రీమామునుల వైభవం శ్రీవైష్ణవ లోకానికి జీవాతువైనందున అది సారసంక్షేపంగా విన్నపింపబడుతున్నది.



# శ్రీమణవాళమహామునుల దివ్యచరిత్ర



శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

## 1. అవతారక్రమం, నామకరణం

భగవద్రామానుజులను ఆశ్రయించిన మహనీయులు పలువు రున్నారు వారికి తరువాత ఆచార్యపదాన్ని నిర్వహించిన మహనీయులు గోవిందభట్టర్. వీరికే సంప్రదాయంలో ఎమ్బార్ అని పేరు. వారి శిష్యులు,

కూరేశపుత్రులైన పరాశరభట్టర్, ఆ భట్టర్ శిష్యులు నంజీయర్. వారి శిష్యులు నంబిళ్ళై. వారి శిష్యులు వడక్కుత్తిరువీదిప్పిళ్ళై వారి శిష్యులు శ్రీపిళ్ళైలోకాచార్యులవారు. వారి శిష్యులు తిరువాయ్మొళిప్పిళ్ళై. వారి శిష్యులే శ్రీమణవాళమహామునులు. ఈ క్రమంలో మన పూర్వాచార్యపంరపర శోభిల్లుతున్నది. వైదిక ధర్మసంరక్షణకోసం, తత్త్వగ్రంథప్రణయనం కోసం, భూమి చేసిన తపస్సు ఫలించడంకోసం ఈ భూమిపై ఆదిశేషులు "నల్లార్ నవిల్ కురుకూర్" (సత్పురుషులు కీర్తించే కురుకాపురి) అయిన ఆళ్వార్తిరునగరిలో "తిరునావీఱుడైయ పిరాన్ దాసరణ్ణర్" అనే మహాచార్యుని "పితరం రోచయామాస" అనే విధంగా తమకు తండ్రిగా వరించి, వారికి కుమారులుగా అవతరించారు. కలియుగాది నాల్గువేల నాల్గువందల డెబ్బైరెండవ సంవత్సరమైన (4472) సాధారణ సంవత్సరంలో ఆశ్వయుజ (అల్పిశి మాసం) మూలానక్షత్రంలో శ్రీవరవరమునుల అవతారం జరిగింది. ఆ శుభదివస వైభవాన్ని అభిజ్ఞులు "శెన్దమిళ్ వేదియర్ శిన్దై తెళిన్దు శిఱన్దు మకిళ్న్దిడునాళ్, మన్దమదిప్పువి మానిడర్తజ్గళై వానిల్ ఉయర్త్తిడునాళ్, మాశఱు ఞానియర్శేర్ ఎతిరాశర్తమ్ వాళ్వు ముళైత్తిడునాళ్, కన్దమలర్ పొళిల్ శూళ్ కురుకాతిపన్ కలైకళ్ విళజ్గిడునాళ్, కారమర్మేని యరజ్గనకర్క్కిడై కణ్గళ్ కళిత్తిడునాళ్, అన్దమిల్ శీర్ మణవాళమునిప్పరన్ అవతారమ్ శెయ్దిడునాళ్, అళకు తికళ్న్దిడు మైప్పశియిల్ తిరుమూలమదెను నాళే" (ఋజువైన, అందమైన ద్రావిడవేద పండితుల మనస్సులలోని సందేహాలు తీరి తేటపడి గొప్పగా ఆనందించే దివసం, గొప్ప ఔదార్యగుణాన్ని కల్గిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన గ్రంథాలన్నీ గొప్పగా ప్రకాశించే దివసం, మందమతులను కల ఈ భూమిలోని మానవులను పరమపదాన్ని పొందించే దివసం, మచ్చ లేని జ్ఞానాన్ని కల, గొప్ప కల్యాణగుణాలను కల యతిరాజుల ఉజ్జీవనం అంకురించే దివసం, సుగంధాన్ని విరజిమ్మే పూలు నిండిన తోటలను

కల్గిన కురుకాపురి (ఆళ్వార్ తిరునగరి)కి నాథులైన నమ్మాళ్వార్ల గ్రంథాలు వెలిగే దివసం, మేఘంతో సాటి వచ్చే మేనిని కల శ్రీరంగనాథుని నేత్రాలు ఆనందించే దివసం, అంతు లేని కీర్తిని కల మణవాళమహా మునులు అవతరించిన దివసం ఏది? అంటే, గొప్ప అందం ప్రకాశించే అల్పిశిమాసంలోని మూలానక్షత్రమే) అనే పాశురంతోను, **"యన్మూల మాశ్వయుజమాస్యవతారమూలం కాంతోపయంతృయమినః కరుణైక సింధోః, ఆసీదసత్సు గణితస్య మమాపి సత్తా మూలం తదేవ జగదభ్యు దయైక మూలమ్"** (కరణాసింధువైన శ్రీమణవాళమహా మునులు అవతరించిన ఆశ్వయుజమాసంలోని మూలానక్షత్రం, అసత్తులలో-(బ్రతికిలేనివాళ్ళలో) ఒకడుగా లెక్కింపబడ్డ నా సత్తకు కూడా మూలం. జగత్తు అభ్యుదయానికి మూలం) అని, **"యదవతరణ మూలం ముక్తిమూలం ప్రజానాం శఠరిపుమునిదృష్టా మ్నాయసామ్రాజ్య మూలం, కలిపురుష (కలుష) సమూలోన్మూలనే మూల మింధే స జయతు వరయోగీ సః సమస్తార్థమూలమ్"** (ఏ మణవాళమహా మునుల అవతారానికి మూలమైన మూలానక్షత్రం ప్రజలముక్తికి మూలమో, శఠకోపులు దర్శించిన ద్రావిడవేదంయొక్క సామ్రాజ్యానికి మూలమో, కలిపురుషుని సమూలంగా పెళ్ళగించడంలో మూలమో, అటువంటి మణవాళమహాముని మాకు సర్వస్వామికి మూలమై ప్రకాశిస్తున్నారు) అని ఈవిధంగా కీర్తించారు.

ఈవిధంగా జగత్తుకు అంతటికి అద్వితీయ ప్రాణరూపులుగా అవతరించిన ఆ దివ్యమూర్తికి శ్రీరంగనాథుని తిరునామాన్ని పెట్టదలచిన పెద్దలు **"అళకియమణవాళన్"** అనే పేరును పెట్టారు. **"అళకియమణ వాళనాయనార్"** అనే నామంతో శ్రీవరవరమునులు చిన్నతనంలో వ్యవహరింపబడ్డారు. బాల్యంలో అన్నప్రాశన, చౌల, ఉపనయనాది వర్ణోచిత సంస్కారాలను వారు యథాకాలం పొందారు.

## 2. విద్యాభ్యాసం :

**"శుద్ధోదన్వద్ధవళమధురం శుద్ధసత్త్వైకరూపం రూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీంద్రావతారమ్"** (శ్రీవరవరమునుల శుద్ధమైన, పాలసముద్రం వంటి తెల్లని మధురమైన, శుద్ధసత్త్వమయమైన రూపం వారు ఆదిశేషావతారమనే విషయాన్ని వ్యక్తం చేస్తున్నది) అనే విధంగా సాక్షాత్ ఆదిశేషుల అవతారమైన వరవరమునులు **"ప్రకృష్ట విజ్ఞానబలైవధామని"** (గొప్ప జ్ఞానం, బలం- అనే వీనికి అద్వితీయస్థానం) అని ఆళవందార్ పల్కినట్లు సహజంగా జ్ఞానసముద్రులే అయినా, శ్రీరామ, కృష్ణులు వశిష్టుడు విశ్వామిత్రుడు సాందీపని మొదలైనవారివద్ద విద్యలను గ్రహించినట్లుగానే, వీరు కూడా వేదాలను, వేదాంగాలను, మిగిలిన సకలశాస్త్రాలకు తండ్రిగారు మొదలైన వారి సన్నిధిలో నేర్చారు. **"శొల్లార్ తమిళ్రొరు మూన్రుమ్ శురుతికళ్ నాన్గుమ్ ఎల్లై యిల్లా అఱనెఱి యావుమ్ తెఱిన్దవన్"** (శబ్దపూర్ణమైన ద్రావిడ భాషలోని **ఇయల్, ఇశై,** నాటకమ్- అనే అంతర్విభాగాలను మూడిటిని, నాల్గువేదాలను, ఇంకా లెక్కలేనన్ని శాస్త్రాలను అన్నిటిని గ్రహించినవారు) అనేటట్లు సర్వశాస్త్ర ప్రవీణులయ్యారు.

తరువాత, ఉచితకాలంలో గృహస్థాశ్రమాన్ని స్వీకరించారు. **"మఱన్దికళ్రుమ్ మనమొళ్రిత్తు వఞ్జమాఱ్ఱి వన్ పులన్కళడక్కి ఇడర్ప్పార త్తున్బమ్ తుఱన్దు ఇరు ముప్పొళ్రుదేత్తి ఎల్లై యిల్లా తొన్నెఱిక్కణ్ నిలైనిన్ఱ తొణ్డర్"** (క్రోధంతో కూడిన మనస్సును వీడి, వంచనను విడచి, బలమైన పంచేంద్రియాలను నియంత్రించి, పంచకాలపరాయణులై, అంతు లేని ప్రాచీనశాస్త్రాలలో స్థిరమైన నిష్ఠను కలవారైన భక్తులు) అని శ్రీకులశేఖరాళ్వార్లు పెరుమాళ్ తిరుమొళ్రిలో పల్కినట్లుగా శ్రీవైష్ణవశిఖామణియై వెలిగారు.

### 3. ఆచార్యసమాశ్రయణం :

శ్రీశైలనాథులు అనే మహనీయులు శ్రీపిళ్ళైలోకాచార్యులవారిని ఆశ్రయించి, వారి సన్నిధిలో చిరకాలం సేవించినవారు, వారివల్ల సకల శాస్త్రార్థ రహస్యాలను గ్రహించినవారు. వీరు నమ్మాళ్వార్ల హార్దవచనాలలో అత్యంతాభినివేశాన్ని కల్గి ఉన్నందున తిరువాయ్ మొళిప్పిళ్ళై అనే ప్రసిద్ధమైన నామాన్ని పొందారు. వీరికి తిరుమలైయాళ్వార్ అనికూడా పేరు. చిరకాలం శ్రీవైష్ణవసిద్ధాంత ప్రచారాన్ని చేసిన ఈ మహనీయులు తమకు తర్వాత ఈ సిద్ధాంతాన్ని పరిరక్షించి ప్రచారం చేసేవారెవ రున్నారు? అని ఆలోచిస్తూ తగిన అధికారికోసం అన్వేషిస్తూ ఉండగా, యాదృచ్ఛికంగా శ్రీవరవరమునులు తిరువాయ్మొళిప్పిళ్ళై వద్దకు వెళ్ళి, నమస్కరించి "నన్ను అనుగ్రహించి మీ శిష్యునిగా స్వీకరించాలి" అని ప్రార్థించారు. వారుకూడా చాలా సంతోషించి, అద్భుతమైన జ్ఞానభక్తి వైరాగ్యాది సంపత్తును కలవారు, ఈ అళకియమణవాళనాయనార్- అని గుర్తించారు. వారిని దగ్గరకు పిలచి కౌగలించుకొని, తమ అంతరంగ శిష్యునిగా స్వీకరించారు. సదాచార్యపరంపరాప్రాప్తమైన సకల విశేషార్థాలను పరమకృపతో నాయనార్కు తెలియజేసినతరువాత, ఒకనాడు వారిని పిలచి ఈ విధంగా ఆజ్ఞాపించారు.

### 4. ఆచార్యనియమనం :

"అళకియమణవాళప్పెరుమాళ్! మీరు సర్వతోముఖమైన పాండిత్యాన్ని సమస్త విద్యలలోను, శాస్త్రాలలోను గడించారు. భగవద్రామా నుజులు అవతారపురుషులనే విషయాన్ని చక్కగా తెలిసినా, పెరియ నంబి, తిరుమాలైయాణ్డాన్ మొదలైనవారు ఆ శ్రీరామానుజులకు ఆచార్యులు కావడం తటస్థించినట్లే, ఏదో విధివశంగా నేను మీకు ఆచార్యునిగా అయ్యాను. అందువల్ల నా ఆజ్ఞను ఆచరించడం మీకు తప్పని సరి - అని నేను మీకు చెప్పనక్కరలేదు. ఆ కూరేశులు, భట్టర్,

నంబిళ్ళై మొదలైన మన పూర్వాచార్యులు సకలశాస్త్రార్థప్రవీణులైనా, ఆళ్వార్ల హార్దమైన సూక్తులలోనే ఎక్కువగా అభినివేశాన్ని పొంది, వాటి అనుభవంలోనే కాలాన్ని గడిపారు. వాటిని ప్రవచనం చేయడమే ముఖ్యకైంకర్యంగా గ్రహించి జీవించారు- అనేది మీకు తెలియని విషయం కాదు. "ముందుగా ద్వయాన్ని విని, ఇతిహాసపురాణాలను తెలిసికొని, పరపక్షనిరసనం కోసం న్యాయమీమాంసాశాస్త్రాలను అధికరించినా, కాలక్షేపాన్ని మాత్రం ఆళ్వార్ల శ్రీసూక్తులలోనే చేయండి'' అని పెరియవాచ్చాన్‌పిళ్ళై పల్కిన శ్రీసూక్తి మీకు తెలిసినదేకదా. మీరుకూడా ఆ విధంగానే ఆ పూర్వాచార్యులను అనుసరించి, దివ్యప్రబంధసూక్తి ప్రవచనంలోనే అతిమాత్రనిష్ణాతులు కావాలి. ఈ నాకోరికను మీరు హృదయపూర్వకంగా అంగీకరించారని నేను గ్రహించి, నా చింత తీరేటట్లు చేయాలి- అని ఆజ్ఞాపించారు.

వెంటనే అళ్గియమణవాళప్పెరుమాళ్ నాయనార్ "రాగప్రాప్తమైన విషయమే వైధం (విధిప్రాప్తం) అయితే వెంటనే దానిని పరిగ్రహించడానికి వీలుగా ఉంటుంది కదా'' అనే (శ్రీవచనభూషణ దివ్యగ్రంథ) శ్రీసూక్తి వంటి ఈ సూక్తిని స్మరించి, పరమానందాన్ని పొంది, "పాలు తాగడానికి కాలును పట్టుకొన్నట్లుగా, ఈ విధంగా కూడా నిర్బంధించాలా? దేవరవారి శ్రీచరణాసాక్షిగా దాసుడు ఈ కైంకర్యాన్ని శిరసావహిస్తాను. దానికి ఏమాత్రం యోగ్యత లేని నన్ను యోగ్యుడను అయేటట్లు సంస్కరించాలి.'' అని విన్నపించి, వారి శ్రీచరణాలలో, నమస్కరించారు. తిరువాయ్‌మొళ్గిప్పిళ్ళై కూడా వారిని పైకి లేవనెత్తి కౌగలించుకొని, స్పృశించి **"ఆముదల్వనివన్"** అనే రీతిలో చల్లగా కటాక్షించారు. అప్పటినుండి తమ శ్రీచరణసన్నిధిలో నీడవలె, పాదరేఖ వలె వీరిని నిలుపుకొని, తాము దాచి పెట్టుకొన్న సకలార్థవిశేషాలను క్రమేణ అనుగ్రహించారు. నాయనార్ కూడా కృతార్థులై, **"అన్నైయు మత్తను మాశారియను మనైత్తుఆవుమ్ మన్నియ పేఱు ముపాయముమ్**

దెయ్వముమ్ మఱ్ఱు మెలామ్, ఎన్నై యళిత్త తిరువాయ్మొళిప్పిళ్ళై యెన్ఱు నెఞ్జే !, ఉన్ని యువన్దు తికழ்న్దు శదిర్త్తినియుయ్న్దిడవే" (తల్లివై, నాథుడై, ఆచార్యుడై, అసకలవిధ బంధువై, స్థిరమైన ప్రాప్యమై, ఉపాయమై, దైవమై, ఇంకా సమస్తమైన నాకు అనుగ్రహించినవారు తిరువాయ్ మొళిప్పిళ్ళై - అని తలచి, ఓ మనసా!, వారిని ధ్యానించి, చాతుర్యంతో ఉజ్జీవించు) అని మనస్సులో అనుసంధించి, తిరువాయ్మొళిప్పిళ్ళై తప్ప వేఱు దైవం లేని రీతిలో వారి శ్రీచరణసన్నిధిలో నిత్యం కైంకర్యాన్ని, వారి ఆజ్ఞాపాలనాన్ని చేయసాగారు.

**5. యతీంద్రప్రవణులు కావడం :**

ఒకనాడు తిరువాయ్మొళిప్పిళ్ళై తాము భగవద్రామానుజులను గూర్చి, ధ్యానిస్తూ ఉండగా, "**మాఱన్ అడి పణిన్దు ఉయ్న్దవన్ ఇరామానుశన్**" (నమ్మాళ్వార్ల శ్రీచరణాలను ఆశ్రయించి శ్రీరామానుజులు ఉజ్జీవించారు) అని, "**ఉఱు పెరుమ్ శెల్వముమ్ తన్దైయుమ్ తాయుమ్ ఉయర్ కురువుమ్ నెఱితరు పూమకళ్ నాదనుమ్, మాఱన్ విళఙ్గియ శీర్ నెఱి తరుమ్ శెన్దమిళ్ ఆరణమే యెన్ఱు ఇన్నీణిలత్తోర్ అఱితర నిన్ఱ ఇరామానుశన్**" (ఆశపడి పొందే గొప్ప సంపద, తండ్రి, తల్లి, ఉజ్జీవింపజేసే ఆచార్యులు, సువాసనను కల తామరపూవులో నివసించే లక్ష్మికి నాథుడు- అన్నీ నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, అందమైన ద్రావిడభాషలోని వేదమైన తిరువాయ్మొళి ప్రబంధమే - అని ఈ విశాల ప్రపంచంలోనివారికి తెలిసేటట్లు ఉండే శ్రీరామానుజులు) అని, "**పణ్డరు మాఱన్ పశున్దమిళ్ ఆనన్దమ్ పాయ్ మదమాయ్ విణ్డిడ ఎఙ్గళిరామానుశ మునివేழమ్**" (రాగపూర్ణమైన, నమ్మాళ్వార్ల అందమైన ద్రావిడప్రబంధాన్ని అధ్యయనం చేసినందున ఏర్పడిన ఆనందమే మదజలమై స్రవించగా, మన శ్రీరామానుజులనే మదగజం) అని గల సూక్తులను మననం చేసి, నమ్మాళ్వార్ల విషయంలోను, వారి సూక్తులలోను శ్రీరామానుజులకు గల అతిమాత్ర

ప్రావణ్యానికి తగినట్లు, ఆ ఆళ్వార్ తిరునగరిలోనే వారికొక ప్రత్యేకమైన కోవెలను నిర్మించాలని తలచి, అందుకోసం తమ శిష్యులను నియమించారు. వారు కూడా భగవద్రామానుజుల దివ్యాలయాన్ని, దానిచుట్టూ శ్రీరామానుజ చతుర్వేది మంగళమ్" అనే మాడవీథులను నిర్మించి, ప్రతిష్ఠజరిపించాడు. శ్రీరామానుజులను ఆరాధించే మహనీయులు పలువురు అక్కడ నివసించేటట్లు చేశారు. ఈ కోవెల నిర్వాహాన్ని తమ ప్రియశిష్యులైన నాయనార్‌కు అప్పగించారు. ఆ నాయనార్‌కూడా శ్రీరామానుజులపట్ల చాలా అభినివేశాన్ని కలవారై, వారికి స్వరూపానురూపమైన కైంకర్యాన్ని ఏ లోటు లేకుండా నిర్వహిస్తూ ఉండడం గమనించిన తిరువాయ్‌మొళిప్పిళ్ళై ఎంతో ఆనందించి నాయనార్‌కు **"యతీంద్రప్రవణ"** లనే పేరును ప్రీతితో పెట్టారు. అప్పటి నుండి ఆ పేరు నాయనార్‌కు ప్రసిద్ధనామమైనది.

**6. యతిరాజవింశతిని రచించడం :**

ఆ శ్రీరామానుజుల శ్రీచరణాలలో ఒక స్తోత్రాన్ని విన్నపించాలని ఆచార్యులు ఆజ్ఞాపించగా, యతిరాజవింశతి- అనే స్తుతిని నాయనార్ విన్నపించారు. అందులో చివర **"శ్రీమన్! యతీంద్ర! తవ దివ్యపదాబ్జ సేవామ్, శ్రీశైలనాథకరుణాపరిణామదత్తామ్"** (శ్రీమద్రామానుజా! తిరువాయ్‌మొళిప్పిళ్ళై తమ కరుణాపరిణామరూపంగా అనుగ్రహించిన తమ దివ్యపదారవిందాలలోని కైంకర్యాన్ని) అని అంటూ స్వాచార్యుల విషయంలో ఉపకారస్మృతిని వ్యక్తం చేశారు. అపుడు దగ్గర ఉండే పెద్దలు. **"వల్లార్‌కళ్ వాళ్త్తుమ్ కురుకేశర్ తమ్మై మనత్తు వైత్తు చ్చొల్లార వాళ్త్తుమ్ మణవాళనాయనార్ తొణ్డర్‌కుళామ్ ఎల్లామ్ తళైక్క ఎతిరాశవింశతి యిన్దళిత్తాన్ పుల్లారవింద త్తిరుత్తాళిరణ్డైయుమ్ పోఱ్ఱు నెఞ్జే!"** (సమర్థులైనవారు మంగళాశాసనం చేసే నమ్మాళ్వార్లను మనస్సులో నిలుపుకొని, నోరార కీర్తించే మణవాళమాముని తమ భక్తబృందం అంతా సంతోషించేటట్లు యతిరాజవింశతిని అనుగ్రహించారు. వారి పాదపద్మాల జంటను ఓ మనసా! కీర్తించు) అనే పాశురాన్ని ఆనందాశ్చర్యాలతో పలికారు.

ఈ యతిరాజవింశతిలోని మాధుర్యం మొదలైన గుణవిశేషాలను గూర్చి శ్రీప్రతివాదిభయంకర్ అణ్ణాస్వామివారు తమ శ్రీవరవరముని శతకంలో పల్కిన శ్లోకాలు ఇక్కడ అనుసంధేయాలు.

ద్రాక్షా మధిక్షిపతి నిందతిమాకరంద -
ధారాం సుధారసఝరీ మధరీకరోతి ।
యత్సంప్రణీత మతులం యతిసార్వభౌమ -
స్తోత్రం స మే వరముని ర్వితనోతు భద్రమ్ ॥

(మణవాళమహామునులచేత చక్కగా రచింపబడినది, సాటి లేనిది అయిన, యతిరాజవింశతి, మాధుర్యంలో ద్రాక్షను నిందిస్తున్నది. తేనెల సోనను నిందిస్తున్నది. అమృతరసప్రవాహాన్ని తక్కువ చేస్తున్నది. ఆ మణవాళ మహామునులు నాకు మంగళాలను ఇవ్వాలి.) అనేది వానిలో ఒక శ్లోకం.

**7. ఇక్కడ ఒక సందేహం :**

శ్రీరామానుజుల అవతారమైన మణవాళమహామునులు తమను తామే స్తుతించినట్లుగా ఈ స్తోత్రాన్ని రచించవచ్చునా? అందులోను, అంతు లేని నైచ్యాన్ని పల్కడం తగునా? - అని కొందఱు శంకిస్తారు. **"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే"**, (వేదాలచే పరతత్త్వంగా తెలియబడే పరమపురుషుడు దశరథపుత్రుడుగా జన్మించగా) అనే విధంగా శ్రీరాముడు సాక్షాన్నారాయణుడే అయినా, **"సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"** (విశాలమైన నేత్రాలను కల సీతాదేవితో పాటు శ్రీరాముడు నారాయణుని ఆరాధించాడు) అనేవిధంగా నారాయణుని ఆరాధించడం, శ్రీరంగనాథుని అర్చామూర్తిని ఆరాధించడంవంటిదే ఇవి కూడా. ఇవి అవతారకృత్యాలకు పొసగినవే -అని పెద్దలు సమాధానం పల్కుతారు.

**8. నాయనార్‌కు పుత్రజననం :**

అழకియమణవాళప్పెరుమాళ్ నాయనార్ ఈ విధంగా ఆచార్యపరతంత్రులై, యతిరాజకైంకర్యం చేస్తూ ఉండగా, క్షీరాబ్ధినుండి

చంద్రుడు ఉదయించినట్లుగా, వారికి ఒక కుమారుడు కలిగాడు. ఆ కుమారునకు నాయనార్ ఇరామానుశప్పిళ్ళై- అనే పేరు పెట్టమని తిరువాయ్‌మొ*ழி*ప్పిళ్ళై పల్కగా, నాయనార్ ఆ విధంగా తమ కుమారునకు ఆపేరును పెట్టారు.

## 9. తిరువాయ్‌మొ*ழி*ప్పిళ్ళై పరమపదగమనం :

అప్రతిమశిష్యసంపదతో వెలిగే తిరువాయ్‌మొ*ழி*ప్పిళ్ళైకు క్రమంగా వార్ధ్యక్యం వల్ల శరీరంతో అశక్తి పెరిగింది. ఇక శరీరాన్ని త్యజించి, పరమపదాన్ని చేరి పరమపురుషునకు నిత్యకైంకర్యం చేసికోవాలనే అభిప్రాయం వారికి కల్గింది. **"ఉత్తమనే ! ఉలకారియనే ! మ*ற்ற*ొప్పారై యిల్లా విత్తకనే! నల్ల వేదియనే ! వణ్ముడుమ్బై మన్నా ! శుత్త నన్ ఞానియర్ న*ற்று*ణైయే ! శుత్తశత్తువనే ! ఎత్తనై కాల మిరున్దు*ழ*ల్‌వేన్? ఇవ్వుడమ్బుకొణ్డే"** (ఆచార్యోత్తమా ! లోకాచార్యవర్యా ! సాటి వేఱొకరు లేని మహానుభావా! వైదికోత్తమా! గొప్ప ముడుమ్బైకులానికి నాథుడవైన వాడా! చక్కని జ్ఞానాన్ని కలవారికి గొప్ప ఆలంబనమై ఉండే శుద్ధసత్త్వ స్వరూపా! ఇక ఈ శరీరంతో ఎంత కాలం నేను ఈలోకంలో బాధపడ గలను?) అని అనుసంధించారు. అపుడు ఒకనాడు కలలో వారికి శ్రీపిళ్ళైలోకాచార్యులవారు సాక్షాత్కరించి, **"నలమన్ద మిలైదోర్ నాడు పుకువీర్"** (అంతు లేని ఆనందాన్ని కల పరమపదాన్ని చేరండి రండి!) అని అన్నారు. తిరువాయ్‌మొ*ழி*ప్పిళ్ళైకు వెంటనే మెలకువ వచ్చింది. నిత్యకర్మానుష్ఠానాలను ముగించుకొని, తమ శిష్యబృందాన్ని పిలిపించి, **"విణ్ణులకుమ్ తరువానాయ్ విరైకిన్టాన్ విదివకైయే వానేఱ వ*ழி* తన్ద వాట్టా*ற்ற*ాన్ విదివకైయే వానేఱ పోకిన్డేన్ నరకత్తై నకు నెఞ్జే!"** అనే తిరువాయ్‌మొ*ழி* పాశురాలను గూర్చి విస్తృతంగా ఉపన్యసించి, "మహనీయులారా! ఈ నాడు స్వామి నన్ను ఆచార్య శ్రీచరణసన్నిధికి తీసికొనిపోవాలని నిశ్చయించాడు. ఇక మీరంతా అ*ழ*కియమణవాళ

ప్పెరుమాళ్ నాయనార్‌ను సామాన్యులుగా భావించకుండా, మన శ్రీరామానుజుల అవతారవిశేషంగా తలచి, వీరి అభిమానాన్ని పొంది ఉజ్జీవించండి'' అని నియమించారు. తరువాత తిరువాయ్‌మొళ్రిప్పిళ్ళై నాయనార్‌ను ఆచార్యపీఠంలో కూర్చుండబెట్టి, **"జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా, సీతా భర్తార మాసాద్య రామం దశరథాత్మజమ్"** (దశరథపుత్రుడైన రాముని భర్తగా పొందిన, నాకుమార్తె సీత జనకకులానికి కీర్తిని తెస్తుంది) అని జనకచక్రవర్తి ఆశపడినట్లుగా, శ్రీవైష్ణవకులం అంతా మీవల్ల పరమవిలక్షణమైన మహిమ, కీర్తిని పొందగలరు. **"శ్రేయాంసి సర్వాణ్యధిజగ్మ్ుషస్తే"** (సమస్త శ్రేయస్సులను పొందిన నీకు) అనేటట్లు ఏవిషయంలోను ఏవిధమైన లోటు లేని మీకు ఇక నేను ఆశాసించవలసినదేమీ లేదు. నా మనస్సులో ఉండే కోరికను పూర్వమే మీకు తెలియజేశాను. ఆకోరిక తీరేటట్లుగా ఈనాటి వరకు మీరు వర్తించినట్లే, ఇకపై కూడా మన పూర్వాచార్యదివ్యగ్రంథాల ప్రవచనాన్ని, అనుభవాన్ని కాలక్షేపంగా కల్గి ఉండండి. మన ఆళ్వారులు, పూర్వాచార్యులు ఏకకంఠంగా ఆసక్తిని పొందిన శ్రీరామానుజ దర్శనం నిర్వహించిన చోటు శ్రీరంగం కనుక, మీరు కూడా అక్కడకు వెళ్ళి, మీ పూర్వావతారంలో వలె ఆ క్షేత్రంలో నిత్యనివాసాన్ని ఏర్పరచుకొని, బాహ్యకుదృష్టి సిద్ధాంతాలను నిరసించి, కలి ప్రభావాన్ని పోగొట్టి, శ్రీరంగశ్రీని సంస్కరించి, శాస్త్రార్థాలను అందఱికి ఉపదేశించి, నమ్మాళ్వార్ల వేదమైన తిరువాయ్‌మొళ్రిని వర్థిల్లచేసి, ఈ లీలావిభూతిని నిత్యవిభూతిగా చేయండి'' అని పల్కి, పొలిన్దు నిన్ఱ పిరాన్‌కు, నమ్మాళ్వార్లకు మంగళాశాసనం చేశారు. శిష్యులనందఱిని నాయనార్‌కు అప్పగించి, తమ నివాసాన్ని చేరారు. పిళ్ళైలోకాచార్యులవారి శ్రీచరణా లను స్మరిస్తూ పరమపదప్రాప్తిని పొందారు. నాయనార్ కూడా ఆచార్యవిశ్లేషాన్ని సహించలేక చాలా దుఃఖాన్ని పొందారు. కొంతసేపటికి తేరుకొని, పిళ్ళైకు చేయవలసిన చరమకైంకర్యాలను యథావిధిగా నిర్వహింపజేశారు.

## 10. నాయనార్‌ను వానమామలై జీయర్ ఆశ్రయించడం :

నాయనార్, స్వాచార్యాజ్ఞను శిరసా వహించి, పూర్వాచార్య శ్రీసూక్తులను వాచోవిధేయం చేసికొని, ప్రసిద్ధప్రభావాన్ని కలవారై ఆళ్వార్ తిరునగరిలో వేంచేసి ఉండే విషయాన్ని గమనించి, పలు ప్రాంతాలలోని పలువురు మహనీయుల వారి వద్దకు వచ్చి నాయనార్ శ్రీచరణాలలో ఆశ్రయించసాగారు. వారిలో, ముందుగా, వానమామలైక్షేత్రంలో మహాజ్ఞానాధికులై వేంచేసి ఉండే **"అళకర్ వరదర్"** పరమవైరాగ్యంతో ఉత్తమాశ్రమాన్ని స్వీకరించి, **"రామానుజజీయర్"** అనే నామాన్ని పొంది, నాయనార్ శ్రీచరణాల సన్నిధిలో ఛాయవలె, పాదరేఖవలె చాలా సన్నిహితులయ్యారు. వీరికి **"పొన్నడిక్కాల్ జీయర్"** అనే పేరును కూడా పొందారు. (వీరే మొదటి వానమామలై జీయర్).

## 11. నాయనార్ శ్రీరంగనాథుని సన్నిధికి వెళ్ళడానికి అనుజ్ఞను పొందడం :

నాయనార్ ఈ విధంగా పలువురు శిష్యులతో కలసి, సిద్ధాంత ప్రచార పరిరక్షణాలను చేసే సమయంలో, ఒక ఆర్ద్రానక్షత్రం నాడు గద్యత్రయానుసంధానం జరిగేటపుడు **"యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగే సుఖమాస్వ"** (ఈ శరీరం పతనం చెందేవరకు ఇక్కడే శ్రీరంగంలో సుఖంగా ఉండండి) అనే శ్రీసూక్తి ప్రకరణంలో స్వాచార్యులైన తిరువాయ్‌మొళిప్పిళ్ళై చేసిన ఆజ్ఞను నాయనార్ స్మరించి, శ్రీరంగంలో నిత్యవాసం చేస్తూ, శ్రీరంగనాథుని మంగళాశాసనమే కాలక్షేపంగా కల్గి జీవనం సాగించాలని తలచారు. ఆళ్వార్ల సన్నిధిలో తమ కోరికను విన్నపించి, వారి అనుమతిని పొందారు.

## 12. నాయనార్‌శ్రీరంగయాత్రకు బయలుదేరడం :

నమ్మాళ్వార్ల అంగీకారాన్ని పొందిన నాయనార్ **"తెన్నరఙ్గర్ ఇన్నరుళుక్కు ఇలక్కాక ప్పెఱ్ఱోమ్"** (దక్షిణదిక్కులోని శ్రీరంగనాథుని దివ్యానుగ్రహానికి లక్ష్యం కాగలిగాము) అని మనస్సులో సంతోషించి,

శిష్యులతో కలసి శ్రీరంగానికి బయలు దేరారు. దారిలో **“మెన్నడై యన్నమ్ పరన్దు విళైయాడుమ్ విల్లైపుత్తూరుఱైవాన్”** (అందమైన నడకలను కల హంసలు విస్తరించి క్రీడించే శ్రీవిల్లిపుత్తూర్‌లో వేంచేసి ఉండేవాడైన) వటపత్రశాయి స్వామిని సేవించగోరి, ఆ క్షేత్రాన్ని చేరి, **“వడపెరుమ్ కోయిలుడైయాన్”** అనే అచటి స్వామిని, పెరియాళ్వార్లను, గోదాదేవిని సేవించారు. అక్కడ ఉండే పెద్దల ప్రార్థనకు అంగీకరించి, కొన్ని దినాలు అక్కడే ఉండి పోయారు. తమను ఆశ్రయించిన శిష్యులకు సంప్రదాయార్థాలను ఉపదేశించి, అక్కడనుండి బయలుదేరారు. క్రమంగా **“మాలిరుమ్ శోలై మైన్దన్”** (తిరుమాలిరుమ్ శోలైక్షేత్రంలోని నిత్యయౌవనం కల సుందరబాహుస్వామిని) సేవించగోరి, అక్కడకు చేరారు. **“శిలమ్బాఱు”** అనే నూపురగంగలో స్నానమాడి, సుందరబాహు స్వామిని సేవించి, ఆ స్వామికి మంగళాశాసనం చేసి, అక్కడ కొన్నాళ్ళు కూరేశులు నివసించిన చోట సుందరబాహుస్తవంలోని గంభీరార్థాలను తమ శిష్యులకు బోధించారు. అనంతరం అక్కడ నుండి శ్రీరంగానికి బయలుదేరారు. కులశేఖరాళ్వార్లు పల్కిన **“వన్‌పెరు వానక ముయ్య అమరరుయ్య మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశరుయ్య, తున్బమికు తుయరకల అయర్వొన్టిల్లా చ్చుకమ్ వళర... అన్బొడు తెన్‌తిశై నోక్కి ప్పళ్ళికొళ్ళుమ్ అణిఅరజ్గన్ తిరుముఱ్ఱత్తు అడియార్‌తజ్గళ్ ఇన్బమికు ఇరుక్కుమ్ నాళే”** (విశాలమైన పరమపదం ఉజ్జీవించేటట్లు, నిత్యసూరులు ఉజ్జీవించేటట్లు భూలోకం తరించేటట్లు, భూలోకంలోని మానవులు తరించేటట్లు, దుఃఖాన్ని కల్గించే క్లేశాలు తొలగేటట్లు, ఏమాత్రం దుఃఖ స్పర్శలేని ఆనందం వృద్ధి అయేటట్లు, భక్తులపై ప్రీతితో దక్షిణదిక్కుకు శ్రీరంగనాథుని ఆలయముఖద్వారం గడపవద్ద ఉండే దాసుల, గొప్ప ఆనందంతో నిండిన సమూహాన్ని దర్శించి, నేనుకూడా అంగీకరించి, వారితో కలసి ఉండే ఆ సుదినం ఏనాడో కదా) ఇత్యాది పలు పాశురాలను **“కదాహం కావేరీతటపరిసరే”** ఇత్యాది శ్లోకాలను ఆనందంతో అనుసంధిస్తూ ప్రయాణం సాగించారు. **“ఎణ్డిశై క్కణ్‌గళు మిఱైఞ్జియాడు**

**తీర్త్త నీర్ వణ్డిరైత్త శోలైవేలి మన్ను శీర్ అరఙ్గమ్"** (ఎనిమిది దిక్కులలోని జనుల కన్నులు చూచి ఆనందించి స్నానంచేసే పవిత్ర జలాలను కలిగినది, తుమ్మెదలు ధ్వనించే తోటలను తీరంలో కల్గినది అయిన కావేరి నది తీరంలో చిరకాలంగా స్థిరంగా ఉండే అందమైన శ్రీరంగం) అని కీర్తింపబడిన శ్రీరంగంలోని కావేరీనదిని, **"వణ్డిన మురలుమ్ శోలై మయలిన మాలుమ్ శోలై కొణ్డల్ మీదణవుమ్ శోలై కుయిలినమ్ కూవుమ్ శోలై అణ్డర్ పోన్ అమరుమ్ శోలై"** (తుమ్మెదలు ధ్వనించే తోటలు, నెమళ్ళ గుంపులు చేరే తోటలు, మేఘాలు పైన సంచరించే తోటలు, కోయిలల గుంపులు కూసేతోటలు బ్రహ్మాండాధి పతి వేంచేసి ఉండే తోటలు) అయిన శ్రీరంగంలోని ఉద్యానవనాలను చేరి ఆనందించారు. కావేరిలో స్నానమాడి నిత్యకర్మానుష్ఠానాలను ముగించుకొన్నారు.

మేడలతో, మిద్దెలతో నిండిన త్రివిక్రమ ప్రాకారం, అకలంకన్ తిరువీధి, ఆలినాడన్ తిరువీథి, కులశేఖరన్ తిరువీధి, మహేంద్రన్ తిరువీధి ఇత్యాదిగా చెప్పబడే సప్తప్రాకారాలలోని వీధులను కళ్ళార దర్శించి గొప్ప ఆనందాన్ని పొందారు.

ఆ కాలంలో శ్రీరంగంలో **"అణ్ణర్"** అనే ఒక మహనీయులు ప్రసిద్ధులుగా ఉండేవారు. నాయనార్ వారి తిరుమాళిగకు వేంచేశారు. అణ్ణల్, అంతకు ముందే నాయనార్ జ్ఞానభక్తివైరాగ్య వైభవాన్ని గూర్చి వినినందున, నాయనార్‌ను చూచి మహానిధిని దర్శించినట్లుగా చాలా సంతోషించారు. వారికి పలు ఉపచారాలను చేసి, కొద్దిసేపు వారితో సంభాషించారు. ఆ విధంగా కొద్ది సమయం సంభాషించినంత మాత్రం లోనే నాయనార్ సర్వజ్ఞత్వానికి ఆశ్చర్యపడిన అణ్ణర్ "వీరు అవతార విశేషమే, సందేహం లేదు'' అని నిశ్చయించుకొన్నారు. శ్రీరంగనాథుని సన్నిధిలో వీరికి పలు సౌకర్యాలను ఏర్పాటు చేయదలచి, ఆ కాలంలో శ్రీరంగాలయ నిర్వహణను చేసే తిరుమలై తన్ద పెరుమాళ్ భట్టర్- అనే మహనీయులకు నాయనార్‌ను గూర్చి తెలిపారు. భట్టర్‌కూడా

నాయనార్‌దగ్గరకు వచ్చి సేవించి, కొద్దిసేపు వారితో సంభాషించినంతలోనే **"శ్రీమాన్ శ్రీభాష్యకారోసౌ భూతలే పునరుత్థితః, ఇతి నిశ్చిత్య సంతుష్య ప్రావణ్య మతులం దధే"** (శ్రీమద్రామానుజులు మళ్ళీ ఈ భూలోకంలో అంతరించారు- అని నిశ్చయించుకొని, ఆనందించి వారిపట్ల గొప్ప ప్రావణ్యాన్ని పొందారు) అనే రీతిలో నాయనార్‌ను భగవద్రామానుజుల పునరవతారంగానే నిశ్చయించు కొన్నారు. పరిజన పరిబర్హపరిచ్ఛద పురస్కార విశేషాలతో సన్నిధిలో మంగళాశాసనం పొందే క్రమాన్ని ఏర్పాటు చేశారు.

## 13. నాయనార్ శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేయడం :

పలుపలు పరివారాలతో కూడి సన్నిధికి మంగళాశాసనం చేయడం కోసం వేంచేసి నాయనార్ మునుముందుగా శ్రీరామానుజుల సన్నిధిలో అనుమతిని పొంది, ఆ రామానుజులు వేంచేసి ఉండే సన్నివేశాన్ని దర్శించి, గొప్ప అభినివేశాన్ని పొందారు. **"ఇవ్వులకమ్ తన్నిల్ ఎతిరాశర్ కొణ్డరుళుమ్ ఎవ్వురువుమ్ యాన్ శెన్ఱిఱైఞ్జినక్కాల్, అవ్వురువుమ్ ఎల్లా మినిదేను మివ్వరఙ్గత్తిఱ్పోల నిల్లాదెన్నెఞ్జిల్ నిఱైన్దు"** (ఈ లోకంలో శ్రీరామానుజులు పరిగ్రహించిన ఏవిషయమైనా నాకది మిక్కిలి ప్రియమైనదే అయినా, వాటిలో ఈ శ్రీరంగం వలె నామనస్సులో అంతా నిండి ఉండే వస్తువు ఇంకొకటి లేదు) అనే పాశురాన్ని విన్నపించి, తరువాత పరివారంతో కూడిన శ్రీరంగనాథుని క్రమంగా మంగళాశాసనం చేసి, తిరుమాలై, అమలనాదిపిరాన్ మొదలైన దివ్యప్రబంధాలను శ్రీరంగరాజస్తవం మొదలైన స్తోత్రాలను అనుసంధిస్తూ, నంబెరుమాళ్ సన్నిధిలో నిలచారు. శ్రీరంగనాథుడు నాయనార్ ప్రేమతో చల్లగా కటాక్షించి - "మాకు కావలసిన వారిని మేమే అన్వేషించుకొన్నాము. మా అవాప్తసమస్తకామత్వం ఈనాడు ఏకొఱత లేనిది అయినది'' అని పల్కి సకలమర్యాదలను అనుగ్రహించాడు. నాయనార్ కృతార్థులై, **"పెరియార్‌క్కాట్పట్టకాల్ పెఱాదపయన్ పెఱుమాఱు"** (గొప్పవారి అనుగ్రహం లభిస్తే అలభ్య

లాభం కూడా లభించే రీతి ఇది) అని సంతోషించి, అణ్ణర్‌విషయంలో భట్టర్ విషయంలో కృతజ్ఞతను ప్రకటించి, తమ నివాసాన్ని చేరారు.

తరువాత శ్రీపిళ్ళైలోకాచార్యులవారి తిరుమాళిగకు వేంచేసి వాకిటిలో నమస్కరించి, **"రహస్యమ్ విళైన్ద మణ్"** (రహస్యం ఆవిర్భవించిన భూమి) అని అక్కడ ఉండే మృత్సంబంధాన్ని చాలా ఆదరించి, అక్కడ రహస్యత్రయ ప్రవచనాదులను సాగించారు.

## 14. నాయనార్ దివ్యదేశయాత్ర :

తరువాత, నాయనార్‌కు, చోళదేశంలోని మధ్యదేశంలోని, తొండనాడులోని దివ్యదేశాలను సందర్శించాలనే అభిప్రాయం కల్గింది. అందుకు శ్రీరంగనాథుని ఆజ్ఞను పొంది తమ శిష్యవర్గంతో పాటు యాత్రకై బయలుదేరారు. యాత్రాక్రమంలో సకలదివ్యదేశాలను సేవిస్త తిరుమలలో శ్రీవేంకటేశ్వరునకు ఆశ్వయుజమాసంలో జరిగే బ్రహ్మోత్స వాలు సమీపిస్తున్నాయని తెలిసి, అక్కడకు వేంచేశారు. ఉత్సవాలను సేవించి, శ్రీవేంకటేశ్వరుడను గ్రహించిన సత్కారాలను పొంది అక్కడ నుండి బయలుదేరి పెరుమాళ్ కోయిల్ అనబడే కంచికి చేరారు.

## 15. వరదరాజస్వామికి మంగళాశాసనం చేయడం :

అక్కడ ఉండే దివ్యదేశాలకు మంగళాశాసనం చేసి, పెరుందేవి తాయార్‌తో వేంచేసి ఉండే వరదరాజస్వామి దివ్యతిరుమేని సౌందర్యాన్ని సేవించి, ఆ స్వామి అందంలో చాలా అభినివేశాన్ని పొందారు. **"శ్రీదేవరాజ మంగళమ్"** అనే వరదరాజస్వామి విషయంలోని మంగళాశాసనస్తుతిని శిష్యుల ప్రార్థనకు అంగీకరించి వరవరమునులు అనుగ్రహించారని పెద్దలంటారు.

## 16. నాయనార్ శ్రీభాష్యాన్ని అధికరించడం :

నాయనార్, అవతారవిశేష ప్రయుక్తమైన సర్వజ్ఞత్వ పూర్తిని కలవారైనా, ఈభూలోకంలో ఉండే క్రమాన్ని అనుసరించి, స్వాచార్యులైన

తిరువాయ్‌మొழிప్పిళ్ళై ఆజ్ఞను పాటిస్తూ ఒక సదాచార్యుల సన్నిధిలో శ్రీభాష్యాన్ని అధికరించాలని అభిప్రాయపడ్డారు. అపుడు కంచిలో వేంచేసి ఉండేవారు, సత్సంప్రదాయ శుద్ధిని కలవారైన కిడాంబినాయనార్ అనే స్వామి సన్నిధిలో (పూర్వావతారమైన శ్రీరామానుజావతారంలో తామే అనుగ్రహించిన) శ్రీభాష్య మహాగ్రంథాన్ని అధికరించడంకోసం శ్రీరామానుజుల అనుమతిని పొందగోరారు. ఒక శుభదినాన శ్రీపెరుంబూదూర్‌కు వెళ్ళి, అక్కడ ఆశువుగా పలు పాశురాలను అనుగ్రహించారు. వాటిలో- **"ఇదువో పెరుమ్బూదూర్ ! ఇఙ్గే పిఱన్దో ఎతిరాశర్ ఎమ్మిడరై తీర్‌త్తార్! ఇదువో తాన్ తేఙ్గుమ్ పెరునల్ తిరునకరి క్కొప్పాన ఓఙ్గు పుకழுడైయ ఊర్"** (ఇదే కదా శ్రీపెరుంబూదూరు! ఇక్కడ అవతరించే కదా శ్రీరామానుజులు మన దుఃఖాలను తీర్చారు. ఇదే కదా గొప్పదైన ఆழ்వార్ తిరునగరితో సమానమైన, వృద్ధి చెందే కీర్తిని కల ఊరు) అని, **"ఎన్దై ఎతిరాశర్ ఎమ్మైఎడుత్తళిక్క వన్ద పెరుమ్బూదూరిల్ వన్దోమో! శిన్దై మరుళో! తెరుళో! మకిழ் మాఱై మాఱనరుళో ఇప్పేఱ్ఱుక్కడి"** (తండ్రి అయిన శ్రీరామానుజులు మనలను ఉద్ధరించడంకోసం అవతరించిన శ్రీపెరుంబూదూర్‌కు వచ్చామా ! అహా! మన మనస్సు భ్రమించలేదుకదా! మెలకువగానే ఉన్నదా! ఈ పరమప్రాప్యానికి మూలం వకుళాభరణులైన నమ్మాழ்వార్ల అనుగ్రహమా!) అని గల పాశురాలు కొన్ని.

ఈ విధంగా కీర్తించిన తరువాత, భగవద్రామానుజులను సేవించి, వారి అనుజ్ఞను పొంది, మళ్ళీ తిరిగి కంచికి చేరి, కిడాంబినాయనార్ దగ్గర శ్రీభాష్యకాలక్షేపాన్ని చేశారు. తరువాత కొంతమంది పెద్దలు అழకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ సన్నిధిలో శ్రీభాష్యకాలక్షేపాన్ని చేయాలని వచ్చి పదే పదే ప్రార్థించగా, వారి ప్రార్థనను అంగీకరించి, కంచిలోని యథోక్తకారి సన్నిధిలో ఒక సంవత్సర కాలం వేంచేసి ఉండి శ్రీభాష్యప్రవచనాన్ని చేశారు. ఇందువల్లనే యథోక్తకారి సన్నిధిలోని మణవాళమహామునుల అర్చామూర్తి వ్యాఖ్యానముద్రతో వేంచేసి ఉన్నారని పెద్దలంటారు.

## 17. నాయనార్ సకల శాస్త్రపారంగతత్వం :

నాయనార్ శ్రీభాష్యాన్ని అధికరించే సమయంలోను, ఆ మహాగ్రంథాన్ని శిష్యులకు ప్రవచనం చేసేటపుడు తమ న్యాయ మీమాంసాది సకలశాస్త్రపారావార పారీణత్వాన్ని పలు రీతులలో వ్యక్తం చేసేవారు. తర్కమీమాంసాది శాస్త్రాలలో నైపుణ్యం కలవారు పలువురు ఆచార్యులు ఉన్నా, స్వామికి ఉండే పాండిత్యప్రకర్షం విలక్షణమనేది వారు వెలయించిన వ్యాఖ్యానాలలో ప్రత్యక్షరంలోను అత్యంతస్ఫుటంగా వ్యక్తమవుతుంది. ఒక్కొక్క సూక్తి శాస్త్రార్థసారం మూర్తీభవించినదా! అనేటట్లు ఉన్నందున వీరి సర్వతోముఖ పాండిత్యం వేఱెక్కడ దర్శించడానికి సాధ్యం కానిది. **“శెన్దమిழுమ్ వడకలైయుమ్ తికழ్ నావర్”** (అందమైన ద్రావిడవేదం, సంస్కృతవేదం ప్రకాశించే జిహ్వను కలవారు) అనే తిరుమంగైయాழ்వార్ల శ్రీసూక్తికి అద్వితీయ ప్రధాన లక్ష్యభూతులుగా ఈ విశాలభూమిలో వెల్గినవారు, నాయనార్- అనేది యథార్థం.

## 18. నాయనార్ శ్రీరంగానికి తిరిగి రాక :

ఈ విధంగా కాంచీనగరంలో ఒక సంవత్సరకాలం పాటు వేంచేసి ఉండి, శిష్యులను ఉజ్జీవింపచేసి, శ్రీరంగానికి నాయనార్ తిరిగి వచ్చారు. అక్కడ **“పోజ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అజ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ద ఎమ్బెరుమాన్ శెజ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్”** (పొంగే సముద్రాన్ని చుట్టూ కల భూమిని, పరమపదాన్ని వాటిలో ఏదీ జారిపోకుండా పరిపాలించే స్వామి, ఆజ్ఞా దండాన్ని కల శ్రీరంగనాథుని) విశేషకటాక్షానికి పాత్రమై, తమను ఆశ్రయించినవారంతా ఉజ్జీవించేటట్లు సకల సంప్రదాయార్థ విశేషాలను అనుగ్రహిస్తూ ఈలీలావిభూతిని నిత్యవిభూతిగా ప్రకాశింపజేశారు.

## 19. నాయనార్ సన్న్యాసాశ్రమస్వీకారం :

ఆ కాలంలో నాయనార్‌కు జ్ఞాతులు పలువురు ఉండేవారు. మాటిమాటికి జాతాశౌచ - మృతాశౌచ ప్రసక్తి వారికి కలిగేది. దానివల్ల గ్రంథకాలక్షేపానికి, శ్రీరంగనాథుని మంగళాశాసనానికి పదే పదే ఆటంకం కలిగేది. దానిని చూచి నాయనార్‌కు గృహస్థాశ్రమం పట్ల ఏవగింపు కల్గింది. ఉత్తమాశ్రమాన్ని స్వీకరించడమే దీనికి పరిష్కారోపాయమని తలచిన నాయనార్, అపుడు శ్రీరంగంలో ఉండే శ్రీశఠకోపజీయరనే పేరుతో ప్రసిద్ధులై, జ్ఞానానుష్ఠాన సంపన్నులైన మహనీయుల వద్ద తురీయాశ్రమస్వీకారాన్ని చేసి, శ్రీరంగనాథుని సన్నిధికి మంగళాశాసనార్థం వెళ్ళారు. అపుడు శ్రీరంగనాథుడు నాయనార్‌ను చూచి ఆదరించి, తమ తిరునామాన్నే వారికి పెట్టి- అంటే- **"అ*ழ*కియమణవాళ మామునికళ్"** అనే పేరును పెట్టి, సకల మర్యాదలను అనుగ్రహించి, **"యావచ్ఛరీరపాతమత్రైవ శ్రీరంగే సుఖమాస్వ"** (శరీరపతనం వరకు ఇక్కడే శ్రీరంగంలో సుఖంగా వేంచేసి ఉండండి) అని శ్రీరామానుజులను వలె నియమించి, వల్లవరాయమండపాన్ని వారికి బహుమానంగా అనుగ్రహించాడు. సమస్తపరివార పరిచ్ఛదాలతో సాగనంపాడు. మణవాళమహామునులు శ్రీరంగనాథుని అనుగ్రహపూర్ణమైన నియమనాన్ని శిరసావహించి, మఠానికి వెళ్ళి, శ్రీరంగనాథుడు తనపట్ల చూపిన ఆదరాతిశయాన్ని తలచి ఆనందంలో మునిగిపోయారు.

క్రమంగా మణవాళమహామునుల అప్రతిమవైభవం దేశం అంతా వ్యాపించింది. **"ఉలకమ్ నిఱైన్ద పుక*ழ*్"** (లోకం అంతా వ్యాపించిన కీర్తి) అనేటట్లు ప్రసిద్ధులైన శ్రీవరవరమునులను పలుదిక్కుల నుండి వచ్చిన పలువురు ఆశ్రయించి, నాథయామున యతివరాది పూర్వాచార్యులను సేవించని కొఱత తీరినవారయ్యారు. వారంతా ఆ పూర్వాచార్యులు ఇపుడు ఈ వరవరమునుల రూపంలో వేంచేసి ఉన్నారని నిశ్చయించుకొని, కృతార్థులై, పరమానంద భరితులయ్యారు.

## 20. తిరుమలైయాళ్వార్ తిరుమండపం నిర్మాణం :

అళకియమణవాళ మహామునులు తమ మఠంలోని ఒక భాగాన్ని తమకు ఆచార్యులైన తిరువాయ్మొళిప్పిళ్ళై పేరుతో కాలక్షేప మండపంగా తీర్చిదిద్దారు. అందులో పూర్వాచార్యులు అనుగ్రహించిన దివ్యసూక్తులను **"మున్నవరామ్ నమ్ కురవర్మొళికళ్ ఉళ్ళ ప్పెఱ్ఱోమ్"** (పూర్వులైన మన ఆచార్యుల సూక్తులను మనస్సులో పదిలపరచు కొన్నాము) అనేవిధంగా మననం చేసి, వానిని శిష్యులకు ప్రవచించారు. **"అథ శ్రీశైలనాథార్యనామ్ని శ్రీమతి మండపే"** అని ఆరంభించి దేవరాజ గురువు దినచర్యాస్తోత్రంలో ఈ విషయాన్ని ప్రస్తావించారు.

ఈ విధంగా తిరువాయ్మొళిప్పిళ్ళై తిరునామంతో తిరుమలైయాళ్వార్ అనే నిర్మింపబడిన ప్రవచనమండప నిర్మాణంలో పిళ్ళైలోకాచార్యులవారి తిరుమాళిగనుండి **"రహస్యమ్ విళైన్ద మణ్"** అనే ప్రసిద్ధిని పొందిన పవిత్రమైన మన్నును తీసికొనివచ్చి ఉపయోగించారు. దానిని గురుకులంగా భావించి, ముముక్షువులై, తమను ఆశ్రయించిన వారికి సంప్రదాయరహస్యార్థాలను ప్రీతితో వ్యాఖ్యానించారు.

## 21. పట్టర్ పిరాన్ జీయర్ వరవరమునులను ఆశ్రయించడం :

ఈవిధంగా కొంతకాలమైన తరువాత **"గోవిందదాసరప్పన్"** అనే పేరును కల పట్టర్ పిరాన్ జీయర్ మణవాళమహామునుల వద్దకు వచ్చి, వారిని ఆశ్రయించారు. శ్రీరామానుజులపట్ల ఎమ్బార్వలె, వారు క్షణంకూడా మామునులను విడచి ఉండకుండా, పాదచ్ఛాయవలె ఉంటూ, అంతరంగ కైంకర్యాన్ని చేశారు. శ్రీమణవాళ మహామునులతో సాటి వచ్చే మహాచార్యులు ఉభయవిభూతులలో ఎవరూ లేరనే నిశ్చయాన్ని పట్టర్పిరాన్ పొందారు. వీరు అంతిమోపాయనిష్ఠై- అనే పేరు గల చరమపర్వనిష్ఠను తెలిపే గ్రంథాన్ని రచించారు.

## 22. కోయిల్ కన్దాడై యణ్ణన్ నాయనార్‌ను ఆశ్రయించడం :

శ్రీరంగంలోనిత్యవాసం చేసే ఆచార్యపురుషులలో సుప్రసిద్ధులైన కన్దాడై అణ్ణన్ శ్రీమణవాళమహామునుల సంబంధమే తమకు ఉత్తారకమని తలచారు. శ్రీరంగనాథుడు కూడా అణ్ణన్‌కు కలలో కన్పించి, మణవాళమహామునుల వైభవాన్ని తెలియజెప్పి, అంతవరకు వారిపట్ల ఉదాసీనంగా ఉండే అణ్ణన్ అభిప్రాయాన్ని మార్చి సుముఖత కలిగేటట్లు చేశాడు. అపుడు అణ్ణన్ తమ పరివారంతో పాటు శ్రీమామునుల సన్నిధిని చేరి, తమను శిష్యునిగా స్వీకరించమని పదేపదే అర్థించారు. మామునులు వారి ప్రార్థనను కాదనలేక అంగీకరించారు. మణవాళమహామునుల పరిపూర్ణకృపకు పాత్రమైన కన్దాడై అణ్ణన్ వారి అంతరంగశిష్యులలో ఒకరయ్యారు. శ్రీమణవాళమహామునుల పట్ల చరమపర్వనిష్ఠను ప్రకటిస్తూ, కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని నమ్మాళ్వార్లను స్తుతిస్తూ మధురకవులు అనుగ్రహించినట్లుగా, వేఱొక కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని రచించారు. ఈ కన్దాడై అణ్ణన్ పురుషకారంతోనే ఎఱుమ్బియప్పా వరవరమునులను ఆశ్రయించ గలిగారు.

## 23. వేడలప్పై వృత్తాంతం :

మణవాళమహామునులు సాటి లేని వైభవంతో ఆచ్యాసార్వ భౌములుగా శ్రీరంగంలో ప్రకాశించే సమయంలో అద్వైత పండితుడొకడు ఉత్తరభారతం నుండి శ్రీరంగప్రాంతానికి వచ్చాడు. అక్కడి శ్రీవైష్ణవ సమృద్ధిని, మణవాళమహామునుల ప్రశస్తిని విని, చూచి, సహించలేక పోయాడు. అసూయావేశాలతో, పండితగర్వంతో, అక్కడ ఉండే శ్రీవైష్ణవులను అధిక్షేపించి పల్కుతూ, “మీకు సామర్థ్యం ఉంటే నన్ను జయించి, మీ సిద్ధాంతాన్ని నిలబెట్టుకోండి” అని వాదయుద్ధానికి రమ్మని తన దూతను ఒకనిని మణవాళమహామునుల దగ్గరకు పంపించాడు.

ఆ మాయావాది అంతకు ముందు **"వేడలప్పై"** అనే శ్రీవైష్ణవ పండితుని శిష్యుడు. అతడు సహజంగా శ్రీవైష్ణవోత్తముడైనా, సహవాస దోషంచేత, కొంతకాలం అద్వైతమతాభిమానియై ఆరూఢపతితు డయ్యాడు. అటువంటివాని ముందుకు తాము వెళ్ళడం, అతనితో శాస్త్రవాదాన్ని చేయడం తమకు అవద్యాన్ని కల్గిస్తుందని తలచిన మాములు, వాధూలవంశీయులైన ఆవేడలప్పైను పిలిపించి, వారిద్వారా అద్వైతవాది గర్వాన్ని అణచాలని తలచారు. **"వేడల్"** అనే చోటునుండి అప్పైను పిలిపించి, ఆ అద్వైత పండితునితో వాదించమని అన్నారు. తనతో వాదించడానికి వచ్చే పండితుడు సాక్షాత్తు తనకు ఆచార్యులైన వేడలప్పై-అని తెలిసిన ఆ అద్వైతవాది, గరుడుని చూచిన సర్పంవలె, భయపడి వణకి వచ్చిన దారిలోనే వెనక్కి వెళ్ళిపోయాడు.

తరువాత, మాములు వేడలప్పైను సత్కరించి, "మీరిక్కడనే మాకు సహాయంగా ఉండండి" అని అన్నారు. ఈ విధంగా మీములు వారిని అడగడానికి కారణం ఏమంటే - ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తుల అమృత సముద్రంలో అనవరతం అవగాహించేవారై, **"తేవు మ*ఱ్ఱ*అఱియేన్"** (వేఱొక దైవం తెలియను) అనే మధురకవుల నిష్ఠను కలవారై, సదా నమ్మా*ళ్వా*ర్ల శ్రీసూక్తులనే భోగ్యతగా భావించే మణవాళమహాములకు ఆ అనుభవానికి విరోధిగా పర్యవసించే దర్శనవిరోధి నిరసనంకోసం సమర్థులైన సహాయకులను ఒకరిని తమతో నిలుపుకోవలసి వచ్చింది. అప్పై స్వగ్రామ నివాసాన్ని విడచి, శ్రీరంగంలో నివసించడానికి ఉత్సుకత చూపలేదు. మణవాళమహాముల అనుమతిని వేడి, తమ గ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు.

## 24. ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ మాములను ఆశ్రయించడం :

ఈ విధంగా తమకోరిక నెరవేరనందున మాములు "ఇక ఈ కార్యాన్ని నిర్వహించగల్గినవారెవరు?" అని విచారిస్తూ ఉండగా, ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ గూర్చి విన్నారు. అణ్ణన్, సర్వశాస్త్రాలలోను

మహాసమర్థులై, ఆత్మగుణసంపన్నులై, తిరుమలక్షేత్రంలో శ్రీవేంకటేశ్వరునకు నిత్యకైంకర్యాన్ని చేస్తూ అక్కడ సకుటుంబంగా వేంచేసి ఉన్నారని విన్నారు. “వీరే ఈ పనిని నిర్వహించగల సమర్థులు” అని నిశ్చయించుకొని, వారిని శ్రీరంగానికి రమ్మని ఆహ్వానించడం కోసం ఇద్దఱు శ్రీవైష్ణవులను తిరుమలకు పంపించారు.

కాంచీపురంలో నయనవరదాచార్యులవారిని ఆశ్రయించి వేదాంతశాస్త్ర శ్రవణాన్ని చేసి, “ప్రతివాదిభయంకరు”లనే బిరుదును పొంది, విఖ్యాతులై వెలిగే అణ్ణన్, కొంతకాలం వేంకటాద్రిపై ఉండి శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యం చేసి ఆనందించాలని అక్కడకు వెళ్ళారు. ప్రతిదినం ఆకాశగంగనుండి స్వామి తిరువారాధనకు కావలసిన తీర్థాన్ని తీసికొనివచ్చి సమర్పించే కైంకర్యాన్ని అణ్ణన్ నిర్వహిస్తూ వచ్చారు.

ఈ విధంగా కొంతకాలం గడచిన తరువాత, శ్రీరంగం నుండి మణవాళమహామునుల శిష్యులు ఒకరు తిరుమలకు వచ్చారు. అణ్ణన్ వారికి సకలోపచారాలను చేసి, శ్రీవేంకటేశుని దర్శనాదులను చేయించి, తమ ఇంటికి తీసికొని పోయారు. వారికి ఆతిథ్యాన్ని ఇచ్చి, మాటలాడే సందర్భంలో ఆ వైష్ణవస్వామి స్వాచార్యులైన మణవాళమహామునుల వైభవ విశేషాలను వివరంగా తెలిపారు. వాటిని కర్ణామృతంగా ఆస్వాదించిన అణ్ణన్, మణవాళమహామునుల పట్ల మనస్సులో గొప్ప భక్తిని కలవారయ్యారు.

ఆ స్వామిని అడిగి అడిగి మళ్ళీమళ్ళీ వరవరమునుల వైభవాన్ని ఆదరంగా విన్నారు. మఱునాడు ఉదయం యథాపూర్వం ఆకాశగంగ నుండి శ్రీవేంకటేశ్వరుని తిరువారాధన తీర్థాన్ని కుంభంతో తీసికొని, తిరుమాళిగకు వచ్చి, మణవాళమహామునుల వైభవశ్రవణం వల్ల పారవశ్యాన్ని పొందినవారై, తిరుమంజన తీర్థాన్ని సమర్పించడంలో ఆలస్యం చేస్తూ సావకాశంగా ఆ తీర్థంలో పరిమళద్రవ్యాలను చేర్చబోతూ

ఉండగా, వేంకటేశ్వరుని సన్నిధినుండి అర్చకస్వామి వేగంగా వచ్చి, "స్వామి తిరువారాధన సమయం మించి పోతున్నదని గ్రహించకుండా ఈవిధంగా ఆలస్యం చేస్తున్నారే ! తీర్థకుంభాన్ని ఇలా ఇవ్వండి" అని నిష్ఠూరంగా పల్కి, ఆ తీర్థంలో పరిమళద్రవ్యాలను చేర్చనీయకుండానే తీసికొని వేగంగా ఆలయానికి వెళ్ళిపోయారు.

"అయ్యో ! ఈనాడు తిరువారాధన తీర్థంలో పరిమళద్రవ్యాలను చేర్చలేదే! అపచారం జరిగింది" అని అణ్ణన్ పశ్చాత్తాపపడుతూ, పరిమళ ద్రవ్యాలను తీసికొని త్వరగా సన్నిధికి వెళ్ళేలోగానే స్వామికి తిరువారాధన ఆరంభమైనది. ఈ విషయాన్ని గమనించి అణ్ణన్ భయంతో జంకుతూ మెల్లగా లోపలకు ప్రవేశించి, పరిమళద్రవ్యాలను అర్చకులకు ఇచ్చి, వినయంగా బయటకు వచ్చారు. పశ్చాత్తాప పడుతున్న అణ్ణన్‌ను సమాశ్వాసన చేయగోరిన శ్రీవేంకటేశ్వరుడు వారిని అర్చకముఖంగా పిలిచి "అణ్ణన్‌స్వామీ! ఈనాడు మీరు తీసుకొని వచ్చిన తీర్థం ప్రతిదినం సమర్పించిన తీర్థం కంటే మిక్కిలి భోగ్యంగా ఉన్నదే ! ఈనాటి తీర్థంలో పరిమళం విలక్షణంగా ఉన్నది సుమా! మీ విలక్షణభక్తికి మేము చాలా ఆనందపడుతూ ఉండగా, మీరు ఈ విధంగా జంకుతూ, భయపడు తున్నారేమి! భయపడకండి" అని అర్చకముఖంగా పలికారు. ఆ వచనాలను ఆలకించిన అణ్ణన్‌కు చాలా ఆశ్చర్యం కల్గింది. "పరిమళ ద్రవ్యం ఏమీ చేర్చక పోయినా ఈ నాడు స్వామి ఈ విధంగా పలికాడేమి?" అని మనస్సులో విమర్శించి చూచారు. "మణవాళమహామునుల వైభవాలను మననం చేస్తూ ఈనాడు ఆ తీర్థాన్ని తీసికొని వచ్చినందున ఆ ఉత్తమాచార్యవైభవ శ్రవణమే ఈ అతిశయానికి హేతువై ఉండాలి" అని నిశ్చయించుకొన్నారు. అప్పటినుండి మణవాళ మహామునులను త్వరగా సేవించాలనే కుతూహలం అణ్ణన్‌కు ఏర్పడింది. అది క్రమంగా దినదినాభివృద్ధిని చెందింది. కొన్నాళ్ళు గడచిన తరువాత శ్రీవేంకటేశ్వరుని వద్ద అణ్ణన్ అనుజ్ఞను తీసికొని, మణవాళమహామునులను సేవించి,

వారిని ఆశ్రయించడం కోసం అక్కడనుండి బయలుదేరి మార్గక్రమంలో పెరుమాళ్‌కోయిల్‌కు వచ్చి, వరదరాజస్వామిని సేవించి, ఒకటి రెండు దినాలు అక్కడ ఉన్నారు.

అప్పటికే, శ్రీమణవాళమహామునుల ఆజ్ఞను పురస్కరించుకొని అణ్ణన్‌ను శ్రీరంగానికి తీసికొనిరావడం కోసం బయలుదేరిన శ్రీవైష్ణవులిద్దరు మార్గమధ్యంలో కంచికి వచ్చి చేరారు. యాదృచ్ఛికంగా అణ్ణన్‌స్వామి కూడా అక్కడకు వేంచేశారని తెలిసికొని చాలా ఆనందించి వారిని సేవించారు. శ్రీమణవాళమహామునుల అనుగ్రహపత్రాన్ని అణ్ణన్‌కు సమర్పించారు. అణ్ణన్ దానిని ఆదరంగా గ్రహించి, చదివి చాలా ఆనందించారు. ఆ శ్రీవైష్ణవులను చూచి "మహాత్ములారా ! దాసుని భాగ్యపరీపాకం ఎంత గొప్పది! మణవాళమహామునులను సేవించాలని చిరకాలంగా ఆశపడిన నేను తిరుమలనుండి శ్రీరంగానికి బయలుదేరి, దారిమధ్యలో ఈ పెరుమాళ్ కోయిల్‌కు వచ్చాను. ఇక్కడ నేనీ అనుగ్రహపత్రం పొందడం అనేది **"కోర మాతవమ్ శెయ్‌తనన్‌కొల్! అడియేన్"** (ఘోరమైన గొప్ప తపస్సు చేశానా? ఏమో? తెలియలేను) అని, **"విదివాయ్‌క్కిన్ఱు కాప్పారార్?"** (భగవత్కృప పరిస్తున్నది. దానిని అడ్డుకోగలవారెవరు?) అని, **"యానే తవ ముడైయాన్"** (భాగ్యశాలిని నేనే) అని మొదలైన సూక్తులను స్మరింపజేస్తున్నది. మామునుల నిర్హేతుకకృపకు లక్ష్యమైన దాసునకు ఎవరూ సాటిరారు. మంచిది. మీరు నాకోసం శ్రమపడి ఇంత దూరం వచ్చారు. కొంత విశ్రమించండి. వరదరాజస్వామి ఆజ్ఞను పొంది శ్రీరంగానికి బయలుదేరదాం'' అని ఆ వైష్ణవులను విశ్రమింపజేశారు.

అణ్ణన్, మఱునాడు ఉదయం ఆ శ్రీవైష్ణవులతో కలసి వరదరాజ స్వామిని సేవించి, ఆస్వామి ఆజ్ఞను పొంది ఆనాడే కుటుంబంగా శ్రీరంగానికి బయలుదేరారు. క్రమంగా శ్రీరంగాన్ని చేరి, నిత్యానుష్ఠానాన్ని ముగించుకొని, మణవాళమహామునుల సన్నిధిని చేరారు. వారి పాదాలపై

వాలి, తమను అనుగ్రహించమని అర్థించారు. మాములు అణ్ణన్ సాదరంగా పైకి లేవనెత్తి, కౌగలించుకొని, యోగక్షేమాలను విచారించారు.

ఆ సమయంలో శ్రీమణవాళమహామునుల తిరువాయ్మొழி ఈడువ్యాఖ్యానం కాలక్షేపం జరుగుతున్నది. ఆ కాలక్షేపంలో ఆనాడు **"ఒన్ఱుమ్ తేవుమ్"** దశకానికి అవతారికాప్రవచనం జరుగుతున్నది. మాములు ఆ దశకం అవతారికావివరణలో తమ సకలశాస్త్ర పాండిత్యాన్ని వ్యక్తం చేస్తూ, పలు శంకలను, వాటికి శాస్త్రీయాలైన, సహేతుకాలైన పరిహారాలను ప్రస్తావిస్తూ, తమ ప్రవచానాన్ని శోతృకర్ణా మృతంగా అనుగ్రహించారు. వారి వాగ్వైఖరీ విలాసాన్ని ఆలకించిన అణ్ణన్ "ఆழ்వార్లు అందఱు, శ్రీమన్నాథయామున యతివరాది పూర్వాచార్యులందఱు ఏకమై మూర్తీభవించిన రూపమే సుమా, ఇది!'' అని మనస్సులో ఆనందాశ్చర్యాలు నిండుకోగా నిశ్చయించుకొన్నారు. **"ప్రత్యక్షే గురవః స్తుత్యాః"** అనే శాస్త్రక్రమంలో నోరార వారిని స్తుతిస్తూ, లేచి సాష్టాంగ పడ్డారు. తమను శిష్యునిగా అంగీకరించమని అంజలి బంధంతో ప్రార్థించారు. మాములు వారిని చూస్తూ, వినోదంగా ''మీరు ప్రతివాదిభయంకరులు కదా! మేము సాధువులం. ఏవిధంగా మన కలయిక కుదురుతుంది?'' అని మందహాసంతో పలికారు. వెంటనే అణ్ణన్ "స్వామీ! మీరు ఆవిధంగా భావించవద్దు. **"ప్రసిద్ధః పరగోష్ఠీషు ప్రతివాదిభయంకరః, శ్రీవైష్ణవానాం గోష్ఠీషు తద్దాస ఇతి విశ్రుతః"** (ప్రతివాదుల గోష్ఠిలో శ్రీవైష్ణవదాసుడనే ప్రసిద్ధి ఉన్నా, శ్రీవైష్ణవ గోష్ఠిలో నేను వారి దాసునిగా పేరుపడ్డవాడను) అని విన్నపించి, దేవరవారి శ్రీచరణ సంబంధం తప్ప దాసునకు వేఱే ఉజ్జీవనోపాయం ఏదీ లేదు'' అని అంటూ ప్రార్థించారు. మాములు అణ్ణన్‌కు గల ఆత్మగుణసంపదను, విశేషించి, వారు వినయపూర్వకంగా చేసే ప్రార్థనను చూచి, వారికి పంచసంస్కారాలను అనుగ్రహించి, శ్రీవైష్ణవదాసులనే విలక్షణదాస్యనామాన్ని పెట్టారు. అణ్ణన్ కృతార్థులయ్యారు. తరువాత **"పోదచ్చివన్దు"**

ఇత్యాదిగా శ్రీమణవాళ మహామునుల దివ్యమంగళ విగ్రహాన్ని స్తుతిస్తూ, అమలనాదిపిరాన్ అనే ప్రబంధాన్ని అనుగ్రహించారు. ఇది, తిరుప్పాణ్ ఆళ్వార్లు శ్రీరంగనాథుని దివ్యమంగళరూపాన్ని ఆపాదమస్తకం వర్ణిస్తూ పల్కిన అమలనాదిపిరాన్ ప్రబంధం వలె, శ్రీవరవరమునుల దివ్య రూపాన్ని ఆపాదమస్తకం వర్ణిస్తున్నందున, దీనికి కూడా అమలనాదిపిరాన్ అనే పేరు స్థిరపడింది. అణ్ణన్, శ్రీవరవరమునులకు సన్నిహితులై వర్తిస్తూ, వారివద్ద సకల దివ్యప్రబంధ రహస్యవ్యాఖ్యానాలను గ్రహించారు.

### 25. శ్రీమణవాళమహామునుల దివ్యదేశయాత్ర :

ఆళ్వార్‌తిరునగరి మొదలైన దివ్యదేశాలను దర్శించి, అక్కడి అర్చామూర్తులకు మంగళాశాసనం చేయాలనే అభినివేశం మామునులకు కల్గింది. శ్రీరంగనాథుని సన్నిధిలో తమ అభిప్రాయాన్ని విన్నపించి, ఆ స్వామి అనుజ్ఞను పొందిన శ్రీవరవరమునులు దివ్యదేశయాత్రకై బయలుదేరారు. క్రమంగా ఆళ్వార్ తిరునగరిచేరి, అక్కడ కొన్ని దినాలు ఉన్నారు. అక్కడ తమను ఆశ్రయించినవారికి సత్సంప్రదాయార్థాలను ప్రవచించారు. అపుడు అళ్లకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన ఆచార్యహృదయంలోని **"జ్ఞానచతుర్థికళిన్ మేలేయిఉతే ఆనన్ద షష్ఠికళుక్కుదయమ్"** అనే చూర్ణికకు సరసమైన అర్థం తెలిసికోవాలి- అనే ఆశ మామునులకు కల్గింది. తిరునారాయణపురంలో "జననాచార్యులని" ప్రసిద్ధి పొందిన **"ఆయ్"** అనే మహనీయుల వద్ద ఆచూర్ణికలోని విశేషార్థాలను గ్రహించవచ్చునని కొందఱు పెద్దలు పల్కగా విని, తిరునారాయణపురానికి బయలుదేరారు.

### 26. తిరునారాయణపురత్తు ఆయ్‌వద్ద విశేషార్థశ్రవణం :

అంతకుముందే జనన్యాచార్యులవారు మణవాళమహామునుల అప్రతిమ ప్రభావవిశేషాలను తెలిసికొన్నవారైనందున, శ్రీరంగానికి వెళ్ళి,

వారిని సేవించి రావాలని ఆశపడి, వారు అపుడు ఆ*ళ్వార్* తిరునగరిలో ఉన్నారని గ్రహించి అక్కడకు బయలుదేరారు. తిరునారాయణపురానికి వెళ్ళాలని బయలుదేరిన మామునులు కూడా కొంతదూరం ప్రయాణం చేశారు. మార్గమధ్యంలో ఆయ్, మణవాళ మహామునులు -ఇద్దఱు యాదృచ్ఛికంగా కలసికొన్నారు. ఆయ్‌వద్ద మామునులు తమ కోరికను విన్నపించి, ఆచార్యహృదయంలోని అర్థవిశేషాలను విని, చాలా ఆనందించారు. అపుడు జరిగిన సంభాషణవశంచేత మణవాళ మహా మునుల సర్వతోముఖవైదుష్య విశేషాన్ని సాక్షాత్తుగా దర్శించిన ఆయ్ విస్మితులై ఆనందంగా **"పుదూరిల్ వన్దుదిత్త పుణ్ణియనో! పూమ్ కమ*ళు*మ్ తాతార్‌మకి*ళ్*మార్బన్ తానివనో ! తూదూర వన్ద నెడుమాలో! మణవాళమామునివన్ ఎన్రై యివర్ మూవరిలుమ్ యార్?"** (శ్రీభూత పురిలో అవతరించిన పుణ్యాత్ములైన శ్రీరామానుజులా ? వకుళపుష్పాలు పరిమళించే మాలికను కల నమ్మా*ళ్వా*ర్లేనా? పాండవదూతగా వచ్చిన శ్రీకృష్ణుడా! ఈ ముగ్గురిలో మణవాళమహా మునులు ఎవరు?) అనే పాశురాన్ని పల్కి, మామునులు విలక్షణావతార వ్యక్తి విశేషమని అంతటా తెలియజెప్పారు.

### 27. మణవాళమహామునుల మఠాన్ని దగ్ధం చేయడం- మామునులు తమ ప్రభావాన్ని ప్రకటించడం :

మణవాళమహామునులు ఈ విధంగా ఆ*ళ్వా*ర్ తిరునగరిలో అద్భుతమైన రీతిలో ప్రవచనాన్ని చేస్తూ, అప్రతిమశిష్యసమృద్ధితో వెలిగే టపుడు, వీరి ఈ ప్రభావాన్ని ఏమాత్రం సహించలేని అసూయాళువులు కొందరు ఆసురమైన దూరాలోచనను చేసి, మణవాళమహామునులు వేంచేసి ఉండే కుటీరరూపంలో ఉండే మఠానికి నడురాత్రి సమయంలో నిప్పుపెట్టారు. అపుడు మణవాళమహామునులు తమ ప్రభావంతో ఆ అగ్ని తమకు సోకకుండా ఆదిశేషుల రూపాన్ని ధరించి, బయటకు వచ్చారు.

మఠం అగ్ని దగ్ధమవడం గమనించి దుఃఖిస్తున్న శిష్యుల మధ్యకు వచ్చి నిలచారు. ఆ అద్భుతదృశ్యాన్ని శిష్యులందఱు దర్శించి ఆశ్చర్యపడ్డారు.

ఈ విధంగా కొందఱు ద్రోహులు శ్రీవరవరమునుల మఠానికి నిప్పు అంటించారని విని, ఆప్రాంతప్రభువు విచారణ చేసి, అపరాధులను దండించదలచాడు. అపుడు కరుణాసముద్రులైన మామునులు "న కశ్చిన్నాపరాధ్యతి" (తప్పు చేయనివాడెవడు?) అనే లక్ష్మీదేవివలె భావించే వారైనందున, తగిన వచనాలతో ఆ ప్రభువును శాంతింపజేసి, అతని బారినుండి అపరాధులను కాపాడారు. శ్రీవరవరమునుల విషయంలో అపచారపడినవారు తమ తప్పును తెలిసికొని పశ్చాత్తాపపడి, మామును లను తమను క్షమించి, అనుగ్రహించమని వేడగా, వారిని తమ శిష్యులుగా స్వీకరించి, సంస్కరించారు. కూరేశుల గుణం కంటే మించిన ఈ మహాగుణాన్ని చూచి అందఱు విస్మయాన్ని పొందారు.

## 28. ఆఴ్వార్ తిరునగరి మొదలైన చోట్ల కైంకర్యాలను నిర్వహింప జేయడం :

ఆఴ్వార్ తిరునగరిప్రాంతాన్ని పాలించే ప్రభువు మామునుల వైభవాన్ని విని, చూచి, వారి పట్ల చాలా భక్తిని, గౌరవాన్ని పొంది, వారి శ్రీచరణాలను సకుటుంబంగా ఆశ్రయించాడు. అతనికి "శ్రీశఠకోప దాసన్" అనే దాస్యనామాన్ని పెట్టి, సాంప్రదాయికార్థాలను మామునులు ఉపదేశించారు. అపుడు ఆ ప్రభువు "మీ దాసుడనైన నన్ను స్వరూపాను రూపమైన కైంకర్యంలో నియమించాలి'' అని ప్రార్థించి, వారినుండి నియమనాన్ని పొంది, అక్కడ వేంచేసి ఉండే పొలిన్దు నిన్రపిరాన్ మనస్సుకు, నమ్మాఴ్వార్ మనస్సుకు ఆనందం కలిగేటట్లు పలు తిరుమండప నిర్మాణాలను చేశాడు. కాలమేఘన్ తిరుమండపం, ఆఴ్గియమణవాళన్ తిరుమండపం - అని వ్యవహరింపబడే మండపాలన్నీ ఆప్రభువు చేసిన నిర్మాణాలే. ఈవిధంగా తిరుక్కుఱుఙ్గుడి దివ్యదేశంలో కూడా తిరువేఙ్గడముడైయాన్ అనే ఒక పరమభాగవతుని

తమ విశేషకటాక్షానికి పాత్రంగా చేసి, అతని ద్వారా అక్కడ పలు కైంకర్యాలను నిర్వహింపజేశారు. ఇంకా, పాండ్యదేశంలోని పలు దివ్యదేశాలలో సైతం ఈవిధంగా కొంతకాలం వేంచేసి ఉండి, అక్కడ తమ అభిమానుల ద్వారా కైంకర్యాలను చేయించారు.

## 29. శ్రీమణవాళమహామునులు శ్రీరంగానికి తిరిగి చేరడం :

ఈ రీతిలో పాండ్యదేశంలోని దివ్యదేశాలన్నిటిలో వేంచేసి ఉండి, అక్కడ తమను ఆశ్రయించిన వారిని సంస్కరించి, ఉజ్జీవింపజేసి, వారికి పలు విశేషార్థాలను ఉపదేశించారు. సమర్థులను కటాక్షించి, ఆయా చోట్ల కైంకర్యనిర్వహణ ఆ దివ్యదేశాలలోని అర్చామూర్తుల కల పలు వైభవాలు, విశేషాలు జరిగే ఏర్పాట్లను చేయించి, **"రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్"** అనే మంగళాశాసనానికి అతిశయాన్ని కల్గించారు. తరువాత చిరకాలం తాము శ్రీరంగనాథుని వీడి ఉన్నందువల్ల, ఇక విడిచి ఉండ లేక త్వరగా శ్రీరంగానికి చేరుకొన్నారు.

## 30. ఎఱుమ్బియప్పా మణవాళమహామునులను ఆశ్రయించడం :

చోళసింహపురం (**"తిరుక్కడికై"**) కు సమీపంలో ఉండే **"ఎఱుమ్బి"** అనే అగ్రహారంలో జన్మించినవారు, ఎఱుమ్బియప్పా అనే పేరుతో ప్రసిద్ధులైన దేవరాజాచార్యులవారు శ్రీరంగంలోని శ్రీరంగనాథుని సేవించదలచి, అక్కడకు వచ్చి, అణ్ణన్ తిరుమాళిగలో విడిదిచేశారు. అపుడు అణ్ణన్‌తో పాటుగా శ్రీవరవరమునుల కాలక్షేప గోష్ఠిలో అన్వయించే అవకాశం అప్పాకు కల్గింది. మామునుల సర్వతో ముఖమైన ప్రజ్ఞావిశేషాన్ని చూచి, ఆనందించినా, వారిని ఆశ్రయించాలనే మనఃపరీపాకం ఇంకా కల్గినందున, వారివద్ద తీర్థ ప్రసాదాలను స్వీకరించకుండానే తమ ఊరికి వెళ్ళిపోయారు.

అక్కడ నిత్యకర్మానుష్ఠానాన్ని ముగించుకొని, తమ గృహంలోని అర్చామూర్తి చక్రవర్తి తిరుమకన్‌కు తిరువారాధన చేయగోరి, సన్నిధిలో

దండం సమర్పించి "కౌసల్యాసుప్రజా రామ!" అని సుప్రభాతాన్ని అనుసంధిస్తూ ఆరాధనాగృహ కవాటాలను తెరవాలని యత్నించారు. ఎంతసేపు ఎంతగా ప్రయత్నించినా ఆ కవాటాలు తెరుచుకోలేదు. పలు ఉపాయాలు చేసిచూచినా ఏవిధంగాను సఫలం కాలేదు. అపుడు ఎఱుమ్బియప్పాకు చాలా దుఃఖంతో ఏమి చేయాలో తోచలేదు. ఏమీ భుజించకుండానే "ఏమి అపచారపడ్డానో! అయ్యో!" అని విచారిస్తూ ఆనాడు రాత్రి నిద్రపోయారు. ఆ రాత్రి అప్పాకు స్వప్నంలో వారి అర్చామూర్తి చక్రవర్తితిరుమకన్ (శ్రీరాముడు) కన్పించి "మాకు ప్రాణస్థానీయులై, లోకానికి అద్వితీయప్రాణభూతులైన శ్రీమణవాళమహాములను ఆశ్రయించకుండా, ఇక్కడకు తిరిగి వచ్చారు. అందువల్ల మీకు మేము తలుపు తెరవలేదు. సాక్షాత్తు తిరువనన్దాழ்వాన్ (ఆదిశేషులు) శ్రీమణవాళమహామునులుగా వచ్చి అవతరించారని గ్రహించండి. వారి దగ్గరకు వెళ్ళి ఆశ్రయించి, పవిత్రతను పొంది, వస్తే తప్ప మీ చేతినుండి మేము తిరువారాధనను స్వీకరించబోయేది లేదు. వెంటనే వెళ్ళండి" అని నియమించాడు. ఎఱుమ్బియప్పా వెంటనే నిద్రలేచి, విస్మితులై, ఆ ఆశ్చర్యాన్ని ఆత్మీయులకు తెల్పి, అపుడే బయలుదేరి శ్రీరంగాన్ని చేరారు.

ఎఱుమ్బియప్పా శ్రీరంగాన్ని చేరి మణవాళమహామునులను ఆశ్రయించాలని వారి వద్దకు వెళ్ళిన సమయంలో, మణవాళ మహామునులు శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేయడంకోసం కోవెలకు వేంచేస్తున్నారు. అప్పా ఆ విధంగా వేంచేసే మామునులకు నమస్కరించి, వారి విశేషకటాక్షానికి పాత్రులై, క్రమంగా తమ గృహంలో జరిగిన వృత్తాంతాన్ని అంతటిని వారికి విన్నపించారు. వేరు తెగినచెట్టు వలె వారి శ్రీచరణాలపై పడి, అపరాధక్షామణాన్ని అర్థించారు. "దాసునకిక మీ శ్రీచరణాలు తప్ప శరణం ఇంకొకటి లేదు. నన్ను పాల ముంచినా, నీట ముంచినా మీదే భారం" అని చాలా ప్రార్థించారు. మామునుల

నిరవగ్రహానుగ్రహానికి పాత్రమై, వారివద్ద పంచసంస్కారాలను పొంది, ఆనాటినుండి వారి సన్నిధిలో మెలగుతూ సకలార్థాలను విని కృతార్థులయ్యారు.

ఎఱుమ్బియప్పా తమ పరమభక్తిపరీవాహరూపంగా శ్రీవరవర మునుల విషయంలో కావ్యనాటక చంపూస్తోత్రాదులను పెక్కింటిని రచించారు. కాలక్రమంలో ఈ విధంగా ఎంతో మంది వరవరమునులను ఆశ్రయించి, ఉజ్జీవించారు.

## 31. శ్రీరంగనాథుని సన్నిధిలో ఈడుముప్పతాఱాయిరప్పడి కాలక్షేపం :

శ్రీమణవాళమహామునులు సాటి లేని వైభవంతో, అపార శిష్యసమృద్ధితో శ్రీరంగంలో ఆచార్యసార్వభౌములై జగత్ప్రసిద్ధిని పొందిన సమయంలో, ఒకనాడు, శ్రీరంగనాథుడు మామునులను తన సన్నిధికి ఆహ్వానించి, "జీయర్! రేపటి నుండి మా పెరియతిరుమండపంలో నమ్మాళ్వార్ల తిరువాయ్మొழி ప్రబంధానికి గల ఈడు ముప్పత్తాఱా యిరప్పడి మొదలైన వ్యాఖ్యానాలతో ప్రవచనాన్ని చేయండి'' అని నియమిస్తూ అనుగ్రహించాడు. మామునులు **"మహాప్రసాదమ్"** అని ఆనందించి, ఆవిధంగానే మరునాటినుండి ఆరంభించి ఈడు ప్రవచనాన్ని తిరుమామణిమండపంలో శ్రీరంగనాథుని సమక్షంలో ఆరంభించారు. వారి ప్రవచనవైఖరి "ఇది గంగాప్రవాహమా? లేక, గంగకంటే పవిత్రమైన కావేరీనదీ ప్రవాహమా?'' అని ఆశ్చర్యపడేటట్లుగా శ్రోతలకు ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కల్గించేదై ఉండేది. తమ విశదవాక్ శిఖామణిత్వాన్ని చక్కగా సుప్రతిష్ఠితం అయేటట్లుగా మామునులు ప్రవచనం చేయసాగారు.

అపుడు నమ్బెరుమాళ్, ఉభయదేవేరులతో కలసి దివ్యసింహాస నంలో వేంచేసి ఉండి, ఆ అపూర్వసన్నివేశాన్ని దర్శించే ఆదిశేషుడు, పెరియతిరువడి, శ్రీసేనాపతియాழ்వాన్ మొదలైన నిత్యసూరులతో,

నమ్మాళ్వార్లు మొదలైన దివ్యసూరులతో భక్తబృందంతో కలసి గొప్ప సభ నిర్వహిస్తూ, వరవరమునుల కాలక్షేపాన్ని "రంగీ వత్సర మేక మేవ మశ్రుణోత్" (శ్రీరంగనాథుడు ఒక సంవత్సరకాలం ఈవిధంగా ఆలకించాడు) అనేటట్లు ఒక సంవత్సర కాలంపాటు అన్ని ఉత్సవాలను, బ్రహ్మోత్సవాదులతో పాటుగానిలిపి, ఆలకించాడు.

ఈ విధంగా ఒక సంవత్సర కాలం ఏఅంతరాయం లేకుండా ఆనందంగా వరవరమునుల ఈడువ్యాఖ్యాన కాలక్షేపం జరిగింది. ఆ ప్రవచనాన్ని పూర్తి చేసేవాడు వచ్చింది. ఆనాడు శ్రీరంగనాథుని మనస్సులో ఒక అభిప్రాయం కల్గింది. అది ఏమంటే - ''నేను విభవావతారాలలో కొందఱు మహనీయుల దగ్గర సేవచేసినా, వారిలో ఆచార్యగుణపూర్తి సంపూర్ణంగా లేనందున, నా మనస్సులో లోటు కల్గింది. ఆ కొఱత అంతా తీరేటట్లు ఇపుడు ఈ సదాచార్య సమాశ్రయణం నాకు లభించడం గొప్ప విశేషమే. ఈ విధంగా నాకు లభించిన ఈ మహాభాగ్యం చిరకాలం ఈ లోకంలో నిలిచేటట్లు ఈ సదాచార్యుల విషయంలో ఏదైనా కైంకర్యం నేను చేయాలి. ఈ ఆచార్యశిఖామణికి ఒక అందమైన తనియన్‌ను రచించి, ఆఈడు సభలో లోకంలో అంతా కీర్తించేటట్లు విన్నపిస్తాను'' అనే అభిప్రాయం కల్గింది.

వాస్తవానికి "పద్య మంగుళివిచ్ఛేదః" (గురువుకు స్తుతిపద్యాన్ని కాని, అంగులి విచ్ఛేదాన్ని చేసికొని కాని గురుదక్షిణను సమర్పించాలి) అనే ప్రమాణానుసారం తనియన్ శ్లోకాన్ని అనుసంధించడం అనేది శిష్యకృత్యాలలో గొప్పది కనుక, శ్రీరంగనాథునకు మామునుల విషయంలో కల్గి ఉండే శిష్యభావాన్ని దేశమంతా తెలిసేటట్లు మనస్సులో తోచడం చాలా తగినది.

## 32. శ్రీశైలేశతిరుమంత్రావతారం :

ఆనాడు కాలక్షేపగోష్ఠిలో "అవానిల్ అన్దాది ఇప్పత్తఱిన్దార్ పిఱన్దార్ ఉయర్న్దే" (విచ్ఛేదం లేని ఈ అన్దాది ప్రబంధాన్ని తెలిసినవారు

పునరావృత్తి రహితమోక్షాన్ని పొందుతారు.) అనే పర్యంతం వ్యాఖ్యానాన్ని నిర్వహించి తరువాత మాములు గౌరవాన్ని, ప్రశంసలను పొందవలసిన సమయం వచ్చింది. అపుడు శ్రీరంగనాథుడు నాలుగు అయిదు సంవత్సరాల వయస్సు కల అర్చక బాలునిగా రూపొంది, గొప్ప వేగంతో గోష్ఠిలో మధ్య ఎవరు అడ్డు పెట్టినా లక్ష్యం చేయకుండా వచ్చి ప్రవేశించి, అంజలిని చేస్తూ, **"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్, యతీంద్ర ప్రణవం వందే రమ్యజామాతరం మునిమ్"** అనే తనియన్ శ్లోకాన్ని అందరి ముందు విన్నపించి అదృశ్యుడయ్యాడు. ఈ దృశ్యాన్ని చూచిన వారంతా అత్యాశ్చర్యపడ్డారు.

ఈ విధంగా దైవీవాక్కుగా అవతరించిన గొప్ప మంత్రమనదగిన ఈ తనియన్‌ను శ్రీరంగనాథుని ఆజ్ఞను అనుసరించి శిష్యులు తాళపత్రంలో లిఖించి, ఆ పత్రానికి పసుపు అద్ది, శ్రీరంగనాథుని శ్రీచరణసన్నిధిలో సమర్పించారు. వేదానికి ప్రణవంవలె, ద్రావిడవేదాను సంధానంలో ఈ తనియన్‌ను మొదట చివర అనుసంధింపబడాలనే నియమం తెన్నాచార్యసంప్రదాయంలో భగవదాజ్ఞానుసారంగా ఏర్పడింది.

తరువాత, శ్రీవరవరముని శిష్యులచే **"వాழி తిరువాయ్‌మొழி ప్పిళ్ళై మాతకవాల్ వాழும்"** అని ఆరంభమయే వాழிత్తిరునామం శ్రీరంగనాథుని నియమనాన్ని అనుసరించి రచింపబడింది. దాని అనుసంధానంతోనే దివ్యప్రబంధానుసంధానం పూర్తికావాలనే నియమంకూడా ఏర్పడింది. తదనంతరం, శ్రీరంగనాథుడు, మణవాళ మహామునులను తన దగ్గరకు పిలచి, అంతు లేని మర్యాదలను చేసి, కానుకలను అందచేసి, వారిని సకల పరివార పరిచ్ఛదాలతో తిరువీథిలో ఊరేగింపుగా తీసికొనిపోయి మఠానికి చేర్చవలసినదిగా పరిజనాన్ని ఆజ్ఞాపించగా, వారు ఆ విధంగానే చేశారు. శ్రీరంగనాథుడపుడు **"కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ"** (కృతకృత్యుడైన-

చేయగోరిన పనిని చేసి ముగించిన- శ్రీరాముడు మనస్సులో ఆర్తిని తీరినవాడై, మిక్కిలి ఆనందించాడు కదా) అనే క్రమంలో మనస్సులో చాలా ఆనందపడి, తాను కృతార్థుడనయ్యానని భావించాడు.

**33. మాములు దివ్యసూక్తులను (గ్రంథాలను) అనుగ్రహించడం :**

ఇతఃపూర్వమే పలువురు పూర్వాచార్యులచే రచింపబడిన దివ్యగ్రంథాలను ప్రవచనం చేయడంలోనే మిక్కిలి అభినివేశాన్ని కల శ్రీవరవరమునులు స్వతంత్రంగా కూడా కొన్ని గ్రంథాలను రచించగల సామర్థ్యం కలవారు. ~~ఈ~~లోకం భాగ్యపరిపాకదశం చేత, శిష్యుల ప్రార్థనకు అంగీకరించి, భగవదాజ్ఞను పురస్కరించుకొని **"తేనే పాలే కన్నలే యముదే"** అనదగిన దివ్యగ్రంథాలను కొన్నిటిని అనుగ్రహించారు.

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన రహస్యగ్రంథాలలో- శ్రీవచనభూషణం, తత్త్వత్రయం, ముముక్షుప్పడి- అనే మూడు రహస్యగ్రంథాలు చాలా గొప్పవి, ప్రధానమైనవి కనుక, ఆమూడిటిని గొప్పగా వ్యాఖ్యానించారు. పిళ్ళైలోకాచార్యులవారి అనుజులు అ*ళ*కియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ - అనే మహనీయులు రచించిన ఆచార్యహృదయమనే రహస్యగ్రంథాన్ని అందంగా వ్యాఖ్యానించారు.

పెరియవాచ్చాన్‌పిళ్ళై నాలాయిరాన్ని పూర్తిగా వ్యాఖ్యానించినా, అందులో పెరియ*ళ*్వార్ తిరుమొ*ళి*లోని మొదటి పాశురంనుండి **"వాక్కు త్తూయ్‌మై యిలామైయినాలే మాదవా వున్నై" (5-1-1)** అనే పర్యంతం గల భాగానికి వ్యాఖ్యానం చెదలుపట్టి లుప్తమై పోయింది. ఆ భాగానికి శ్రీవరవరమునులు తీయని వ్యాఖ్యానాన్ని ప్రసాదించారు. ఆ వ్యాఖ్యానాన్ని రసజ్ఞులైన మహనీయులను సేవించి "అయ్యో ! మిగిలిన నాలాయిరవ్యాఖ్యానం కూడా లుప్తమై పోతే ఎంత బాగుండేది ! ఇటువంటి అమృతంవంటి వ్యాఖ్యానం శ్రీవరవరమునుల ద్వారా అవతరించి ఉండేది కదా! అని అన్నారని ప్రసిద్ధి.

ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధానికి, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన జ్ఞానసార, ప్రమేయసారాలకు వ్యాఖ్యానాలను రచించారు. గీతకు తాత్పర్యదీపిక- అనే సంగ్రహ వ్యాఖ్యను రచించారని కూడా కొందఱి అభిప్రాయం. ఈగ్రంథం ముద్రింపబడింది కూడా. కాని, కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు ఇది వరవరముని ప్రణీతం కాదని అభిప్రాయబడ్డారు. ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యకు, తమను గ్రహించిన రహస్యత్రయ వ్యాఖ్యానాలకు ప్రమాణత్తిరట్టు (ప్రమాణాసూచి) సంకలనం చేశారు. తిరువారాధన ప్రయోగమనే నిత్యారాధనప్రక్రియను అనుగ్రహించారు. ఉపదేశరత్తినమాలై, తిరువాయ్మొழி నూఱ్ఱన్దాది, ఆర్తిప్రబంధం- అనే మూడు ద్రావిడగ్రంథాలను అనుగ్రహించారు. (దేవరాజమంగళం, యతిరాజవింశతి, కంచిలోని దివ్యదేశాల అర్చామూర్తులని స్తుతించే శ్లోక ద్వయం రచించారని ఇతఃపూర్వమే తెలుపబడింది.)

**34. శ్రీవరవరమునుల శ్రీసూక్తి వైభవం :**

లోకంలో గ్రంథాలను రచించిన ఆచార్యులు పలువురున్నారు. అయినా, మణవాళమహామునుల దివ్యసూక్తులలోని మాధుర్యం, గాంభీర్యం, అర్థపుష్టి, రసపుష్టి అనితరసాధారణం. **"నామూలం లిఖ్యతే కించిన్నానపేక్షిత ముచ్యతే"** (మూలంలో లేనిది వ్రాయబడదు. అక్కర లేనిది చెప్పబడదు) అనే విధంగా ఉండే వ్యాఖ్యానశైలి వీరికే స్వంతం. వేఱు ఏ ఆచార్యుల వ్యాఖ్యానం ఈ విధంగా అవతరించలేదని అనడం సహజోక్తి; అతిశయోక్తి కాదు. పలు మతాంతరాలను ఖండిస్తూ వ్యాఖ్యానించేటపుడు కూడా ఎవరి మనస్సును నొప్పించకుండా, ఉండేటట్లు, వ్యర్థదూషణ పరిహాసాదులకు కొంచెం కూడా అవకాశం లేనట్లు, ఏసందర్భాన్ని చూచినా శాస్త్రార్థమే సిద్ధాన్తమై లభించేటట్లు, "సకలశాస్త్రపారంగతులు వీరొక్కరే సుమా!" అని నిశ్చప్రచంగా భావించేటట్లు, అనన్వయం, క్లిష్టాన్వయం, భ్రాంతిని కల్గించడం మొదలైన

ఏ దోషాలను కొంచెం కూడా చోటు లేనట్లుగా శ్రీసూక్తులను ప్రసాదించిన వారు శ్రీవరవరమునులే. సూత్రాలవంటి పిళ్ళైలోకాచార్యులవారి శ్రీసూక్తులకు వీరు అవతారికలను ప్రసాదించే అందం, మూలానికి అర్థం తెలిపే వైఖరి, అక్కడక్కడ ఉక్తార్థాలను పిండీకృతం చేసి, సందర్భాన్ని పరిసమాప్తి చేసే విధానం - అన్నీ అద్భుతంగా ఉంటాయి. నిశితంగా పరిశీలించే సహృదయనిర్మత్సర గుణగ్రహణపారీణుల మనస్సు **"ఉళ్ళున్దోఱు మెన్నెఞ్జు ఎరివాయ్ మెழுకొక్కుమ్"** (నా మనస్సు, అగ్ని సమీపంలోని మైనంవలె, కరిగిపోతుంది) అనే విధంగా ద్రవిస్తుంది.

వాస్తవానికి, ఈ మహాచార్యుల సూక్తులను సేవించిన తరువాత ఇంకొక సూక్తివైపు మనస్సు మళ్ళదు. **"స్థితేరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే"** (మకరందం నిండుగా ఉండే తామర పూవులో వాలిన తుమ్మెద ఇంకొక ముళ్ళగోరింట పూవువైపు కన్నెత్తి అయినా చూడదు) అనే శ్రీయామునుల శ్రీసూక్తి స్మరింపజేస్తుంది. పలు మాటలెందుకు? మిగిలిన వారి గ్రంథాలను చూచినపుడు వారి వారి జ్ఞానం ఏతవన్మాత్రమని పరిచ్ఛేదించి తెలియవచ్చు. కాని, శ్రీవరవర మునుల వ్యాఖ్యానాలను పరిశీలించినపుడు, హనుమంతుని గూర్చి శ్రీరాముడు పల్కిన సూక్తి గుర్తుకు వస్తుంది. అది ఏమంటే- **"నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః, నా సామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుమ్, నూనం వ్యాకరణం కృత్స్నమ్ అనేన బహుధా శ్రుతమ్, బహు వ్యాహరతానేన న కించిదపశబ్దితమ్"** (ఋగ్వేదం తెలిసినవానికి, యజుర్వేదం అధ్యయనం చేసినవానికి, సామవేదం గ్రహించినవానికి తప్ప ఇంకొకనికి ఈవిధంగా మాటలాడడం సాధ్యం కాదు. ఇతడు వ్యాకరణాన్ని పలు మార్లు చక్కగా చదివాడు. ఎంతో మాటలాడినా ఒక అపశబ్దం కూడా పలుకలేదు) ఇత్యాది సూక్తి మామునుల విషయంలోనే పొసగుతుంది - అనేది అసూయారహితుల అనవద్యసిద్ధాంతం.

**35. అష్టదిగ్గజాలు :**

శ్రీవరవరమునుల శ్రీచరణాలను ఆశ్రయించినవారు పలువేలమంది ఉన్నా, వారిలో ప్రధానంగా లెక్కించదగిన, అష్టదిగ్గజాలనే పేరును కలవారు ఎనిమిదిమంది. వారు **(1) వానమామలై జీయర్, (2) పట్టర్‌పిరాన్ జీయర్, (3) తిరువేఙ్గడరామానుజ జీయర్ (4) కోయిల్ కన్దాడై అణ్ణన్, (5) ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ (6) ఎఱుమ్బియప్పా, (7) అప్పిళ్ళై, (8) అప్పుళ్ళార్** - అనేవారు.

**36. వైభవనిగమనం :**

భగవద్రామానుజుల వైభవం వలె శ్రీవరవరమునుల వైభవం కూడా మహాసముద్రమే. ఇక్కడ అత్యంత సంక్షేపంగా మాత్రమే తెలుప బడింది. **"అడియార్‌కళ్ వాழ, అరఙ్గనకర్ వాழ, శడకోపన్ తన్ద తమిழ్‌నూల్ వాழ, మణవాళమామునియే! ఇన్న మొరు నూற்ఱాణ్డి రుమ్"** (శిష్యులు ఉజ్జీవించేటట్లు, శ్రీరంగం ఉజ్జీవించేటట్లు, శఠకోపులు అనుగ్రహించిన ద్రావిడవేదం ఉజ్జీవించేటట్లు, ఓమణవాళ మహామునీ! ఇంకా ఒక నూఱేండ్లు వర్ధిల్లండి) అని ఆనాటినుండి వేదం ఉన్నంతవరకు, వేద ప్రతిపాద్యుడున్నంతవరకు, త్రిసంధ్యం, ముల్లోకాలు కీర్తించేటట్లుగా ఈ మహాచార్యులు వేంచేసి ఉండాలనే మహాత్ముల ఆశ, ఆశంస కనుక, వీరి పరమపదగమన వృత్తాంతం ప్రస్తావింపబడడం లేదు.

నమ్మాழ్వార్లు తమ గొప్పతనాన్ని **"తువళిల్ మామణిమాడమ్", "ఉణ్ణుమ్ శోఱు"** ఇత్యాది దశకాలలో స్వయంగా వ్యక్తం చేసినట్లుగా, శ్రీవరవరమునులు కూడా తమ వైభవాన్ని ఆర్తిప్రబంధంలోని ఒక పాశురంద్వారా తమ గొప్పతనాన్ని తామే మనవంటివారు అనుసంధించి ఉజ్జీవించేటట్లు పలికారు. ఆ పాశురం ఏమంటే-

తెన్నరఙ్గర్ శీరరుళుక్కిలక్కాక ప్పెற்றோమ్
తిరువరఙ్గమ్ తిరుప్పదియే యిరుప్పాక ప్పెற்றోమ్,

మన్నియశీర్ మాఱన్ కలై యుణవాక ప్పెఱ్ఱోమ్
మతురకవిశొల్పడియే నిలైయాక ప్పెఱ్ఱోమ్,
మున్నవనా నజ్గురవర్ మొழிకళుళ్ళ ప్పెఱ్ఱోమ్
ముழுతు నమక్కవై పొழுతుపోక్కాక ప్పెఱ్ఱోమ్,
పిన్నెయొన్రుతనిల్ నెఙ్జు పేరామల్ పెఱ్ఱోమ్
పిఱర్మినుక్కమ్ పొఱామైయిల్లా ప్పెరుమైయు మ్పెఱ్ఱోమే.

అందమైన శ్రీరంగంలో "అరుళ్కొడుత్తిట్టు అడియవర్రై ఆళ్కొళ్వార్" (దయనుచూపి దాసులను పాలించేవాడై) "అన్పొడు తెన్తిశై నోక్కి ప్పళ్లికొళ్ళుమ్" (విభీషనునిపై గల ప్రేమతో దక్షిణదిశకు అభిముఖంగా శయనించి ఉండే) శ్రీరంగనాథుని నిర్హేతుక కృపకు లక్ష్యభూతుల మయ్యాము. "తెన్నాడుమ్ వడనాడుమ్ తొழுనిన్ర తిరువరఙ్గత్తిరుపతి" (దక్షిణదేశం, ఉత్తరదేశం ఆరాధించేటట్లుగా వేంచేసి ఉండే శ్రీరంగమనే దివ్యక్షేత్రం) అని, "ఆరామమ్ శూழ்న్ద అరఙ్గమ్" (ఉద్యానవనాలను చుట్టూ కల్గిన శ్రీరంగం) అని, "తలైయరఙ్గమ్" (అన్ని దివ్యదేశాలలో ముఖ్యమైన శ్రీరంగం) అన చెప్పడేటట్లు అఖిలదివ్యదేశాలలో ప్రధానమైన శ్రీరంగ క్షేత్రాన్నే నిత్యంగా పొందాము. పరభక్తి మొదలైన కల్యాణగుణాలు పొందికగా కల్గి ఉండే ఆழ்వార్ల భక్తులకు అమృతం వంటి వకుళభూషణ వాగమృతాన్ని ఆహారంగా (భోజనంగా) భుజించ గలిగాము. "తేవు మఱ్ఱఱియేన్" (వేఱొక దైవాన్ని తెలియను) అని పల్కినందున, వారిని కూడా పరిహసించే వారు - అనే రీతిలోని మధురకవుల దివ్యసూక్తిరీతిలో "యతీంద్ర మేవ నీరంధ్రం సిషేవే దైవతం పరమ్" (పరదైవంగా శ్రీరామానుజులనే నిరంతరం సేవించారు), "ఉన్నై యొழிయ వొరు దైవమ్ మఱ్ఱఱియా మన్నుపుకழ் వడుకనమ్బి తన్నిలైయై" (మిమ్ములను తప్ప వేఱొక దైవాన్ని తెలియని, స్థిరమైన కీర్తిని కల వడుగనంబి నిష్ఠను) అని, మేము మాకు సంబంధించినవారు గొప్పగా పలికే చరమపర్వనిష్ఠనే నిష్ఠగా పొందాము. ఆ చరమపర్వనిష్ఠను ప్రతిపాదించే మన పూర్వాచార్యుల దివ్య సూక్తులైన

శ్రీవచనభూషణాది రహస్యగ్రంథాలను **"నెఞ్జతన్దాల్ తేఱలుమామ్"** (మనస్సులో అర్థం చేసికొని తేటపడినా) అనే రీతిలో అనుసంధించ గలిగాము. అందులో గొప్ప ఆదరాన్ని కల మనకు వేఱొక విషయంలో కాలం గడపకుండా, పూర్తిగా వాటితోనే కాలక్షేపం చేయగలి గాము. ఈ విధంగా అయిన తరువాత, వాటికంటే వేఱయిన అన్యగ్రంథా లలో దేనిలోను మనస్సు చలించకుండా, ఆ చరమపర్వనిష్ఠలోనే (పూర్వా చార్యుల రహస్యగ్రంథాలలోనే) నిలకడ అయిన స్థితిని (నిష్ఠను) పొంద గలిగాము. ఇది అంతా ఒక ఎత్తు, అది ఒక ఎత్తు- అనే రీఈతిలో ఉన్నదై **"ఇప్పడి యిరుక్కుమ్ శ్రీవైష్ణవర్కళ్ ఏ*గ్ఱ్ఱ*మఱిన్దు ఉకన్దిరుక్కై యుమ్"** (ఈ విధంగా ఉండే శ్రీవైష్ణవుల గొప్పతనాన్ని తెలిసి, ఆనందించడం) అనే రీతిలో అరుదుగా ఉండే ఇతరుల సమృద్ధిని చూస్తే ఓర్వలేనితనం లేని గొప్పతనాన్ని కూడా పొందామే! ఈ మహాలాభం ఉండే తీరు ఏమి! ఆహా!

శ్రీమణవాళమహామునుల ముఖ్యమైన వైభవాలన్నీ ఈ పాశురంలో తెలుపబడినవి.

శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।
శ్రీరంగవాసినే భూయా న్నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

సజ్జనశ్రుతిపీయూషం చరితం వరయోగినః ।
దివ్య మాశ్చర్యభరితం లిఖితం సుహృదాం ముదే ॥

---

శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్ అనుగ్రహించిన

# శ్రీవరవరముని సుప్రభాతమ్

శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్ తమ ఆచార్యులైన శ్రీవరవర మునులను సుప్రభాతాన్ని పాడే వాచికకైంకర్యాన్ని ఈశ్లోకంనుండి ప్రారంభిస్తున్నారు.

**1. రవి రుదిత స్తథాపి న వినశ్యతి మే తిమిరం**
**వికసతి పంకజం హృదయపంకజ మేవ న మే ।**
**వరవరయోగివర్య! వరణీయ! దయైకనిధే !**
**జయ! జయ! దేవ! జాగృహి జనేషు నిధేహి ధియమ్ ॥**

అందఱిచేత అభిలషించదగినవారుగా, దయకు ముఖ్యమైన నిధివంటి వారుగా వేంచేసి ఉండే వరవరమునులనబడే ఓ యోగివర్యా! తమరు నిత్యశ్రీతో వర్ధిల్లాలి. మీరు నిద్రలేవండి. సూర్యుడు ఉదయించినా నా అజ్ఞానాంధకారం పోలేదు. పద్మాలు వికసించినా నాహృదయ పద్మం వికసించలేదు. నాతోపాటు అందరు ఉజ్జీవించేటట్లుగా మీరు మనస్సులో సంకల్పించండి.

**2. స్వపన మిదం తవ స్వమహిమానుభవైకరసం**
**తదపి తథావిధం తదితి జాతు న వేత్తి జనః ।**
**వరవరయోగివర్య! తదిదం విజహాతు భవాన్**
**అపరిమితం హితం త్రిజగతా మనుచింతయితుమ్ ॥**

ఓ వరవరమునీ! తమ ఈ నిద్ర లోకంలోనివారి నిద్రవలె తామస మైనది కాదు. ఇది భగవానుడు ఏకాగ్రతతో తన వైభవాన్నిగూర్చి చింతిస్తూ పొందే యోగనిద్రవంటిదే ఇది. అయినా, ఈ లోకంలోని జనిధర్మాన్నికల చేతనులు తమ జ్ఞానసంకోచంకారణంగా మీ యోగనిద్రను యథా తథంగా తెలియలేకపోతున్నారు. అందువల్ల మానవసజాతీయులై నిద్రించే ధర్మాన్ని విడచి, ముల్లోకాలకు అంతు లేని హితాన్ని చింతించడం కోసం మీరు ప్రబోధాన్ని పొందాలి సుమా!

**3. అవతరణం తదేవ జగతా మవివేకభృతాం**
**వివిధహితావబోధన కృతే హి కృతం భవతా ।**
**తత ఇత ఏహి యోగశమనాన్మమ నాథ! జనాన్**
**అమృతమయై రపాంగవలయై రభిషేచయితుమ్ ॥**

దాసునకు స్వామి అయిన ఓ వరవరమునీ! తమరు ఈ అవతారాన్ని అంగీకరించడం అవివేకులైన జనులకు నానావిధహితాలను గూర్చి వారికి తెలిపి, వాటిని వారికి అనుగ్రహించడంకోసమేకదా! అందువల్ల మీరు యోగసాధనమండి లేచి ఇక్కడకు వేంచేయండి. ఎందుకోసం? అని అంటే, అమృతవర్షి అయిన తమ కరుణావీక్షణాలతో చేతనులను అనుగ్ర హించడంకోసం. మీరు ప్రబోధాన్ని పొంది లేచి లోకులు ఉజ్జీవించేటట్లు కటాక్షించాలి.

4. శరదరవిందబృందసుషమాపరిపోషభుజా
తవ యనేన కేచన పరిచరణేన తథా!
మధురగభీరధీరచతురై రుదితై రితరే
వరద! ధురం ధరంతి భవసింధు మముం తరితుమ్ ॥

వరాలను ఇచ్చే ఓ వరవరమునీ! లోకంలోనివారు ఎవరు దేనిని కోరుతున్నారో, వారికి దానిని అనుగ్ర హించడంవల్లకదా మీకు ఈ వరదనామం కల్గింది. కొందరు, శరత్కాలంలోని కమలసమూహం యొక్క కాంతిపౌష్కల్యాన్ని కల తమ వీక్షణంతో ఈ సంసార సముద్రనిస్తరణభారాన్ని ధరిస్తున్నారు. (మామునుల చూపుతోనే కొందరు ముక్తిని పొందుతున్నారు- అని భావం) కమలంవంటి తమ పాదాల సంబంధంతోనే మఱికొందరు మోక్షాన్ని పొందుతున్నారు. బుద్ధి మంతులైన మఱికొందఱు మధుర గంభీరాలైన, చాతుర్యంతో కూడినవైన- అంటే- గొప్ప అర్థాలతో కూడినవై, సులభంగా అర్థం తెలిపే రీతిలో అందంగా ప్రకాశిస్తూ ఉండే - శ్రీసూక్తులతో సంసారసముద్రం దరిని చేరడానికి తగిన ఉపాయనిష్ఠను పొందుతున్నారు.

5. పరమనభోనివాస! ఫణిపుంగవ ! రంగపతేః
భవన మిదం హితాయ జగతో భవతాఽధిగతమ్ ।
తదపి సదైవ దేవ నృగతిం ప్రకటీకురుషే
తదిహ మహత్త్వమేవ కురు వైభవ ముద్భిదురమ్ ॥

పరమపదంలో శ్రీభూమినీళానాయకుడైన భగవానునకు సింహాసనంగా వేంచేసి ఉండే ఆదిశేషస్వరూపా! వరవరమునీ! తమచే జగత్తు హితంకోసం శ్రీరంగనాథుని శ్రీరంగం నిత్యనివాసంగా స్వీకరింపబడింది. ఆ విధంగా ఉన్నా మీరు ఎల్లప్పుడూ మావలె మనుష్యవృత్తిని కలవారుగానే దర్శనమిస్తున్నారు. తమ ఈ మహామహిమను లోకం అంతా తెలిసికొని, ఉజ్జీవించడంకోసం దానిని ప్రకటించాలి.

6. త్వదభిమతప్రియ స్త్వదనువర్తనధన్యతమాత్
అల మతిరిక్త ఇత్యఖిలలోకసుబోధ మిదమ్ ।
అవనితలం త్వదీప్సిత మిదం చ హి తత్ర వసన్
అయ మఖిల స్తదైవ నిరుపాయ ముపైతి పదమ్ ॥

వరవరమునీ! మీ విషయంలో చాలా అభినివేశాన్ని పొంది కైంకర్యాన్ని చేసే దాసుల కంటే తమ దాసుల అభిరూపంలో ఒదిగి ఉండేవారు తమకు చాలా ప్రియులు - అనే విషయం లోకప్రసిద్ధం. మీరు అభిమానించి కోరి వర్తించే ఈ భూతలంలో నివసించే ఈ చేతనులుకూడా మీ పరమ ప్రీతికి పాత్రభూతులైన ఆ దాసులు నివసించే చోటునే పొందుతున్నారు.

జీయర్ నాయనార్ అనుగ్రహించిన

# శ్రీవరవరమునిప్రపత్తి

## తనియన్

శ్రీసౌమ్యజామాతృమునేః సుపౌత్రం
శ్రీభాష్యకారాంఘ్రిసరోజభక్తమ్ ।
తన్మంగళం స్తోత్ర ముదాహర ద్యః
తం సౌమ్యజామాతృగురుం ప్రపద్యే ॥

శ్రీమణవాళమహామునుల పౌతులు, శ్రీరామానుజుల పట్ల భక్తిని కలవారు, శ్రీమణవాళమహామునుల మంగళాశాసనాన్ని రచించినవారైన అభిరామవరులను శరణుపొందుతున్నాను.

**సౌమ్యోపయంతృమునివర్యపదారవిందే**
**సమ్యక్ ప్రపత్తి మథ మంగళ మాతనోద్యః ।**
**తత్ర్పౌత్ర మార్య మభిరామవరం ప్రపద్యే**
**సత్త్వోత్తరం సకలజీవదయాంబురాశిమ్ ॥**

శ్రీమణవాళమహామునుల విషయంలో ప్రపత్తి, మంగళాశాసన స్తోత్రాలను రచించినవారు, వారి పౌత్రులు, గొప్ప సత్త్వగుణాన్ని కలవారు, అందరిపట్ల గొప్ప దయను కలవారైన అభిరామవరులనే జీయర్‌నాయ నార్‌ను శరణుపొందు తున్నాను.

( శ్రీమణవాళమహామునుల పౌత్రులైన జీయర్‌నాయనార్ (అభిరామవ రాచార్యుల) చేత రచింపబడ్డ ఈ ప్రపత్తి ప్రాచీన స్తోత్రకోశా లలో చాలాకాలం క్రితం ముద్రింపబడింది. జీయర్ నాయనార్ శఠకోప సూరి విషయంలో నక్షత్ర మాలికా అనే స్తుతిని, శ్రీరామానుజుల విషయంలో దినచర్యా స్తుతిని కూడా రచించారు.)

**1. శ్రీమద్యతీంద్రచరణప్రవణామలాత్మన్!**
**ధీభక్తిశాంతికరుణాదిగుణామృతాబ్ధే ।**
**సౌమ్యోపయంతృమునివర్య ! సతాం జనానాం**
**నాథౌ ! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥**

శ్రీరామానుజుల శ్రీచరణాలలో ప్రావణ్యాన్ని కల అమలాత్మా! జ్ఞాన భక్తివైరాగ్యకరుణాదికల్యాణ గుణాలకు అమృతసముద్రమా! సౌమ్యోపయంతృముని వర్యా! సత్పురుషులకు నాథాలైన మీ పాదాలు రెండింటిలో ప్రపత్తిని చేస్తున్నాను.

2. శ్రీమన్ ! పరాంకుశవచోమృతపూరపాన-
సంసిద్ధశౌరిచరణానుభవప్రవాహ ।
సౌమ్యోపయంతృమునివర్య! జగద్ధితౌ యౌ
భవ్యౌ ! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

భగవత్కైంకర్యలక్ష్మిని కలవాడా! నమ్మాళ్వార్ల శ్రీసూక్తులనే అమృతరసప్రవాహ పానాన్ని చేయడానికి సంసిద్ధుడైన భగవానుని శ్రీచరణాల అనుభవప్రవాహాన్ని కలవాడా! వరవరమునీ ! లోకానికి హితమైనవి, శుభకరమైనవి అయిన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

3. పద్మాలయారమణభవ్యపదాబ్జయుగ్మ-
ప్రేమామృతాబ్ధిపరివాహనిమగ్నచేతాః ।
సౌమ్యోపయంతృమునివర్య! సమస్తలోక-
సేవ్యౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రియఃపతియొక్క శుభకరమైన పదాబ్జయుగ్మంలోని భక్తి అనే అమృతసముద్ర ప్రవాహంలో మునిగిన మనస్సును కలవాడా! వరవరమునీ! సకలలోకాలచే సేవింపతగినవి అయిన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

4. ముక్తిప్రదౌ మురరిపో రివ పాదపద్మౌ
భక్త్యాద్యుపాయరహితస్య పరం ముముక్షోః ।
సౌమ్యోపయంతృమునివర్య! సతాం జనానాం
నాథౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

'భక్తి మొదలైన ఉపాయాలు ఏమీ లేని' మోక్షాన్ని పొందగోరేవారికి మురారి పాదపద్మాలవలె ముక్తి ప్రదాలు, సత్పురుషులను పాలించేవి అయన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ శరణు పొందుతున్నాను.

5. రామానుజార్యవరదర్శనధూర్వహేంద్ర !
కామాదిదూరగణదూరగ దేశికేంద్ర ।
సౌమ్యోపయంతృమునివర్య! సమస్తలోక -
బంధౌ! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీరామానుజ దర్శనమనే గొప్ప సిద్ధాంతాన్ని ప్రచారం చేసే భారాన్ని నిర్వహించడంలో గొప్పవాడా! కామం మొదలైన హేయగుణాలకు ప్రతిభటమైనవాడా! దేశికేంద్రా! సౌమ్యోపయంతృమునివర్యా! అన్ని లోకాలకు బంధువులైన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

6. వానాద్రియోగివరమానసరాజహంస!
వాధూలనాథవరదార్యవరాభివంద్య ।
సౌమ్యోపయంతృమునివర్య! సరోజశంఖ-
చిహ్నౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

వానమామలైజీయర్ మనస్సు అనే సరస్సులో విహరించే రాజహంసవంటివాడా! వాధూల వరదులనే కోయిలణ్ణన్‌కు పూజనీయుడా! వరవరమునీ! మహాపురుషత్వాన్ని సూచించే పద్మశంఖచిహ్నాలను కల మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

7. శ్రీభట్టనాథమునివర్యవరేష్టదేవౌ
శ్రీదేవరాజగురుపుంగవపారిజాతౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! సదాఽంతరంగ -
శిష్టౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీభట్టనాథమునివర్యులకు (పట్టర్ పిరాన్ జీయర్) ఇష్టదైవం, శ్రీదేవరాజులనే (ఎఱుమ్బియప్పా) గొప్ప గురువులకు పారిజాతంవంటివి, అంతరంగభక్తులకు శిష్టమైనవి అయిన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

8. రామానుజార్యవరవేంకటయోగివర్య-
శ్రీమన్నతార్తిహరసూరిభి రీడ్యమానౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! సదాఽస్మదీయ -
భాగ్యౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

రామానుజార్యులు, వేంకటయోగివర్యులు, శ్రీనతార్తిహరసూరి అనే శిష్యులచేత స్తుతింపబడేవి, మాకు సంపద అయినవి అయిన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ! శరణు పొందుతున్నాను.

9. అమ్లానకోమలసరోజసుగంధిరమ్యౌ
సర్వై రనన్యశరణై రనుభావ్యమానౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! సదాఽశరణ్య -
నాథౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

వాడని, సుకుమారం అయిన పద్మంవలె సువాసనను కల్గి మనోహరంగా ఉన్నవి, అనన్య శరణు లందఱిచేత అనుభవింపదగినవి, అశరణ్యాశరణ్యాలు అయిన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ! ఎల్లప్పుడు శరణు పొందుతున్నాను.

10. మంజుప్రవాళసదృశా వతిపాపినోఽపి
సంసారసాగరసముద్ధరణప్రవీణౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! విభో! సుభోగ్యౌ
స్వామిన్! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

మంజులమైన పగడంవంటివి, గొప్ప పాపులను సైతం సంసార సాగరం నుండి ఉద్ధరించడంలో సమర్థమైనవి, చాలా భోగ్యమైనవి అయిన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ! ప్రభూ! స్వామీ! శరణు పొందుతున్నాను.

11. అస్మత్కులాధిపగురూత్తమ! యోగివర్య!
భోగీంద్ర! భీకరగురోః మహితార్యవర్య!

సౌమ్యోపయంతృమునివర్య! భవత్కృపాయాః
పాత్రం కురుష్వ భగవన్! శరణాగతం మామ్ ॥

మా ప్రపన్నకులానికి గొప్ప గురువైనవాడా! యోగివర్యా! ఆదిశేషస్వరూపా! ప్రతివాదిభయంకర అణ్ణన్‌కు గొప్ప ఆచార్యుడవైన వాడా! వరవరమునీ! భగవన్! మిమ్ములను శరణు పొందిన నన్ను మీ కృపకు పాత్రుణ్ణి చేయాలి.



ప్రతివాదిభయంకరం అణ్ణన్ అనుగ్రహించిన

# శ్రీరమ్యజామాతృమునిమంగళమ్

## మున్నుడి

ఈ మంగళాశాసనం అనుష్టుప్ ఛందస్సులో రచింపబడ్డ సుమధుర కృతి. ఇదే రీతిలో అణ్ణన్ వరవరమునులను ఉద్దేశించి ఇంకొక మంగళా శాసన స్తోత్రాన్ని కూడా రచించారు. శ్రీ పిళ్ళైలోకమ్‌జీయర్ "లక్ష్మీనాథ సమారంభామ్" అనే పొదుత్తనియన్ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ "ఆచార్యాణా మసౌ వసౌ విత్యాభగవత్తః స చాచార్య వంశో జ్ఞేయః" అనే ఆగమసూక్తికి ఉదాహరణంగా అణ్ణన్ అనుగ్రహించిన ఈ మంగళాశాసన స్తుతిని ఉదాహరిస్తూ ఈ క్రిందివిధంగా అన్నారు. "వేదాన్తాచార్యరాన అణ్ణావుమ్- "పత్యుః శ్రియః పదాబ్జాభ్యాం ప్రయుంజానాయ మంగళమ్" ఎన్ఱు తుడఙ్గి, "యతీంద్ర ప్రవణాయ" ఎన్ఱు నడువాకవుమ్, "పూర్వాచార్యేషు సర్వేషు పూర్ణప్రేమాను బధ్నతే...." ఎన్ఱు శ్రియః పతియై తుడఙ్గి శ్రీమద్రామానుజా చార్యర్ నడువాకవుమ్, శ్రీశైలేశదయా పాత్రరాన పెరియజీయర్ అళవాక శేఖరిక్కైయలే ఇదువే శుద్ధసంప్రదాయమ్". ఈవిధంగా పూర్వాచార్య పరంపరను సేవించే వరవరమునులను తాము సేవిస్తున్నట్లుగా అణ్ణన్ వచించడానికి తిరువరంగత్తముదనార్ ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధంలో పలువురు దివ్యసూరులను, నాథమునిని, యామునా చార్యుల

వారిని సేవించే భగవద్రామానుజను తాము ఆరాధిస్తున్నట్లుగా పల్కడం దోహందంచేసి ఉంటుంది అనడంలో ఆశ్చర్యంలేదు. ఇటువంటి విలక్షణ మైన ఈ సత్కృతి పలువురి దృష్టికి రాకపోవడం, ప్రచారంలోకి రాకపోవడం ఆశ్చర్యకరమే! ప్రస్తుతం క్లుప్తంగా తాత్పర్యంతో పాటుగా ఈ కృతి ముద్రింపబడుతున్నది.

తనియన్

1. య శ్చక్రే మంగళాశాస్తిం మనోజ్ఞవరయోగినః ।
ప్రణమామి దయాళుం తం ప్రతివాదిభయంకరమ్ ॥

శ్రీవరవరమునుల మంగళాశాసనాన్ని రచించినవారు, దయాళువు అయిన శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్‌కు నమస్కరిస్తున్నాను.

2. మంగళాశాసనం కర్తుం మనోజ్ఞవరయోగినః ।
మనః ప్రసీద భద్రం తే త్వన్మూలం క్షేమ మాత్మనామ్ ॥

ఓ మనసా! వరవరమునుల మంగళాశాసనం చేయడంకోసం నీవు నాకు ప్రసన్నం కావాలి!నీకు మంగళం. నీవల్లనే జీవులకు క్షేమం కల్గుతుంది.

3. పత్యుః శ్రియః పదాబ్జాభ్యాం ప్రయుంజానాయ మంగళమ్ ।
శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయాస్తు మంగళమ్ ॥

శ్రియఃపతి పాదపద్మాలకు మంగళాశాసనాన్ని చేసే శ్రీవరవర మునులకు మంగళం కలగాలి.

4. శ్రియఃకృపామయాపాంగసుధాస్రోతోఽవగాహినే ।
అస్తు మంగళ మార్యాయ రమ్యజామాతృయోగినే ॥

లక్ష్మీదేవి కరుణతో నిండిన చూపులు అనే అమృతప్రవాహంలో మునిగే వరవరమునులకు మంగళం కలగాలి.

5. విహితానతయే నిత్యం విష్వక్సేనపదాబ్జయోః ।
మంగళం రమ్యజామాతృమునీంద్రాయ మహౌజసే ॥

విష్వక్సేనుల శ్రీపాదపద్మాలకు నిత్యం నమస్కరించే, గొప్ప తేజస్సును కల వరవరమునులకు మంగళం కలగాలి.

6. ప్రపన్నజనకూటస్థం ప్రపన్నాయ పరాంకుశమ్ ।
ఆశాసే రమ్యజామాతృమునిరాజాయ మంగళమ్ ॥

జనకూటస్థులైన నమ్మాళ్వార్ల విషయంలో ప్రపత్తి చేసిన వరవరమునులనే యోగివర్యులకు మంగళాన్ని ఆశాసిస్తున్నాను.

7. నాథాయ నాథమునయే నమోవాకం వితన్వతే ।
మంగళం మమ నాథాయ మనోజ్ఞవరయోగినే ॥

ప్రపన్నకులానికి నాథులు అయిన నాథమునులకు నమోవాకాన్ని విస్తరింపజేసే వారు, నాకు నాథులైనవారైన వరవరమునులకు మంగళం.

8. పుండరీకాక్షపాదాబ్జే పుష్కలప్రేమ పుష్ణతే ।
రమ్యజామాతృమునయే మాననీయాయ మంగళమ్ ॥

పుండరీకాక్షులనబడే ఉయ్యక్కొణ్డార్ శ్రీపాదపద్మాలలో పూర్ణమైన భక్తిని కల, మాననీయులైన రమ్యజామాతృమునికి మంగళం.

9. శ్రీరామమిశ్రచరణా వంతఃస్వాంతం వితన్వతే ।
సౌమ్యజామాతృమునయే సర్వజ్ఞాయాస్తు మంగళమ్ ॥

శ్రీరామమిశ్రులనే మణక్కాల్ నమ్బి శ్రీచరణాలలో తమ మనస్సును విస్తరింపజేసేవారు, సర్వజ్ఞులు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం కలగాలి.

10. పాదయోః యామునేయస్య భక్తి ముద్వహతే పరామ్ ।
మంగళం రమ్యజామాతృమునీంద్రాయ మనస్వినే ॥

శ్రీయామునుల శ్రీపాదాలలో గొప్ప భక్తిని కల, మనస్వి అయిన వరవర మునులకు మంగళం.

**11.** శ్రీపరాంకుశదాసార్యపాదపద్మానుమోదినే ।
మంగళం మమ దేవాయ మనోజ్ఞవరయోగినే ॥

శ్రీపరాంకుశదాసులనే పెరియనంబి శ్రీపాదపద్మాలలో భక్తిని కలవారు, నాకు దేవులు అయిన వరవరమునులకు మంగళం.

**12.** యతీంద్రప్రవణాయాస్మద్గురవే గుణశాలినే ।
ప్రయుంజే మంగళం రమ్యజామాతృవరయోగినే ॥

శ్రీరామానుజుల విషయంలో ప్రావణ్యాన్ని కలవారు, మాకు ఆచార్యులు, గుణా లతో శోభిల్లేవారు అయిన వరవరమునులకు మంగళం.

**13.** పూర్వాచార్యేషు సర్వేషు పూర్ణప్రేమానుబధ్నతే ।
మంగళం రమ్యజామాతృమునీంద్రాయ దయాళవే ॥

పూర్వాచార్యులందఱిపట్ల పూర్ణమైన భక్తిని కల, దయాళువు అయిన వరవర మునీంద్రులకు మంగళం.

**14.** భవ్యశ్రీశైలనాథార్యపరిపూర్ణకృపాజుషే ।
రమ్యజామాతృమునయే మహాభాగాయ మంగళమ్ ॥

మంగళకరం అయిన, తిరువాయ్‌మొழிప్పిళ్ళైయొక్క, పరిపూర్ణం అయిన కరుణను పొందే మహానుభావులు వరవరమునులకు మంగళం.

**15.** జ్ఞానభక్తివిరక్త్యాదికల్యాణగుణరాశయే ।
సౌమ్యజామాతృమునయే సద్భిః సేవ్యాయ మంగళమ్ ॥

జ్ఞానం, భక్తి, లౌకికవిషయాలలో విరక్తి మొదలైన కల్యాణగుణాల రాశివంటివారు, సత్పురుషులచే సేవింపదగినవారైన సౌమ్యజామాతృ మునికి మంగళం.

**16.** సాక్షా న్నారాయణాయాస్మదనుగ్రహవిధిత్సయా ।
మంగళం మర్త్యరూపాయ మనోజ్ఞవరయోగినే ॥

మనలను అనుగ్రహించడంకోసం మానవరూపాన్ని పొందిన సాక్షాన్నారాయణుడైన వరవరమునులకు మంగళం.

17. వానాద్రియోగివరవేంకటయోగివర్య
శ్రీభట్టనాథమునివాదిభయంకరార్యాః ।
రామానుజార్యవరదార్యనతార్తిహారి-
శ్రీదేవరాజగురవోఽష్ట దిశా గజా స్తే ॥

వానమామలై జీయర్, తిరువేంగడ రామానుజ జీయర్, పరవస్తు పట్టర్ పిరాన్ జీయర్, ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్, కందాడై అణ్ణన్, ఎఱుంబియప్పా, అప్పిళ్ళై, అప్పుళ్ళార్ అనే ఆచార్యులు ఎనిమిది మంది మీరు నియమించిన అష్టదిగ్గజాలు.

---

ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# వరవరమునిమంగళమ్

సుమారు 20 సం॥కు పూర్వం కాంచీపురంలో ముద్రింపబడ్డ "శ్రీవాది భీకరార్యసూక్తిమాలా" ద్వితీయభాగం నుండి ఈ స్తుతి గ్రహింపబడింది.

1. శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।
శ్రీరంగవాసినే భూయా న్నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

కైంకర్యలక్ష్మీశోభితులు, మహాత్ములు, శ్రీరంగంలో నిత్యవాసం చేసేవారు అయిన రమ్యజా మాతృ మునులకు నిత్యశ్రీః, నిత్యమంగళం కలగాలి.

2. శ్రీరంగాదిస్థలేశానం మంగళాశాసనం శుభమ్ ।
కుర్వతే సౌమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ॥

శ్రీరంగం మొదలైన దివ్యస్థలాలలోని అర్చామూర్తులకు మంగళా శాసనాన్ని చేసే సౌమ్యజా మాతృమునులకు మంగళం.

3. శ్రీరామానుజయోగీంద్రదర్శనాబ్ధిసుధాంశవే ।
సౌమ్యజామాతృమునయే సర్వజ్ఞాయాస్తు మంగళమ్ ॥

శ్రీరామానుజదర్శనం అనే అమృతసముద్రాన్ని ఉప్పొంగేటట్లు చేసే చంద్రుని వంటివారు, సర్వజ్ఞులు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

4. శ్రీపతే శ్చరణాంభోజప్రేమామృతమహాబ్ధయే ।
సౌమ్యజామాతృమునయే సత్త్వోద్రిక్తాయ మంగళమ్ ॥

శ్రియఃపతి శ్రీచరణాంభోజాలపట్ల భక్తికి అమృతమహాసముద్రం వంటివారు, సత్వగుణోద్రేకాన్ని కలవారు అయిన సౌమ్యజామాతృ మునికి మంగళం.

5. శ్రీరామానుజభాష్యార్థవ్యాఖ్యానాసక్తచేతసే ।
సౌమ్యజామాతృమునయే సదా భోగ్యాయ మంగళమ్ ॥

శ్రీరామానుజుల శ్రీభాష్యంయొక్క వ్యాఖ్యానంలో ఆసక్తిని కల మనస్సును కలవారు, భక్తులకు ఎల్లప్పుడూ భోగ్యులు అయిన సౌమ్యజా మాతృమునికి మంగళం.

6. శ్రీమచ్ఛఠారిసూక్తీనాం వ్యాఖ్యావైదగ్ధ్యశాలినే ।
సౌమ్యజామాతృమునయే సదాశ్లిష్టాయ మంగళమ్ ॥

నమ్మాళ్వార్ల శ్రీసూక్తులను వ్యాఖ్యానించడంలో గొప్ప చాతుర్యాన్ని కలవారు, సత్పురుషులచే సేవింపబడేవారు అయిన సౌమ్యజామాతృ మునికి మంగళం.

7. శ్రీరామానుజపాదాబ్జప్రాప్యప్రాపకభావతామ్ ।
ప్రాప్తాయ సౌమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ॥

శ్రీరామానుజుల పాదపద్మాలే ప్రాప్యప్రాపకాలనే భావాన్ని పొందిన సౌమ్యజామాతృమునికి నిత్య మంగళం.

8. అష్టాక్షరబ్రహ్మవిద్యానిష్ఠాయాఽమితతేజసే ।
సౌమ్యజామాతృమునయే శౌరిహృద్యాయ మంగళమ్ ॥

అష్టాక్షర బ్రహ్మవిద్యానిష్ఠులు, గొప్ప తేజస్సును కలవారు, శౌరి అనబడే భగవానునకు మనోహరులైన సౌమ్యజామాతృమునికి మంగళం.

9. సదా ద్వయానుసంధానసాక్షాత్కృతమధుద్విషే ।
సౌమ్యజామాతృమునయే శాంతిభూషాయ మంగళమ్ ॥

ఎల్లప్పుడూ ద్వయానుసంధానంద్వారా భగవానుని తమ చిత్తంలో సాక్షాత్కరింప జేసికొన్నవారు, శాంతి అనే గుణానికి అలంకారంవంటి వారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

10. ప్రసన్నజనసందోహమందారాయ మహాత్మనే ।
సౌమ్యజామాతృమునయే సాత్త్వికేంద్రాయ మంగళమ్ ॥

ప్రపన్నజనసమూహానికి కల్పవృక్షంవంటివారు, మహాత్ములు, సాత్త్వికులలో గొప్పవారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

11. తులామాసేఽవతీర్ణాయ భోగిరాజాంశత శ్శుభే ।
మూలర్క్షే సౌమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ॥

ఆదిశేషుని అంశతో తులామాసంలో మంగళకరం అయిన మూల నక్షత్రంలో అవతరించిన సౌమ్యజా మాతృమునికి మంగళం.

12. శ్రీశైలేశగురో ర్దివ్యశ్రీపాదాంబురుహాలయే ।
సౌమ్యజామాతృమునయే సర్వదా నిత్యమంగళమ్ ॥

తిరువాయ్మొழிప్పిళ్ళై అనబడే శ్రీశైలేశుల దివ్య శ్రీపాదాలనే పద్మాలలో తుమ్మెదవంటివారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.



# శ్రీమణవాళమహామునుల తిరునక్షత్రతనియన్

తులాయా మతులే మూలే పాండ్యే కుంతీపురీవరే ।
శ్రీశేషాంశోద్భవం వందే రమ్యజామాతరమ్ మునిమ్ ॥

తులాయామ్ = తులామాసంలో, అతులే = సాటి లేని, మూలే = మూల అనే నక్షత్రంలో, పాండ్యే = పాండ్యదేశంలోని, కుంతీపురీవరే = కుంతీపురమనబడే ఆழ్వార్ తిరునగరిలో, శ్రీశేషా+అంశ+ఉద్భవం = ఆదిశేషుల అంశతో ఉద్భవించిన, రమ్యజా మాతరమ్ మునిమ్ = శ్రీవరవర మునులను, వందే = నమస్కరించి, స్తుతిస్తున్నాను.

**(అతులే మూలే) -** శ్రీమణవాళమహామునులు అవతరించిన మూలనక్షత్ర వైభవాన్ని ప్రతివాది భయంకరం అణ్ణన్ వరవరమునిశతక ప్రారంభంలో **"యదవతరణ మూలం ముక్తిమూలం ప్రజానాం శఠరిపుముని దృష్టామ్నాయ-సామ్రాజ్యమూలమ్, కలికలుషసమూలోన్మూలనే మూల మింధే స భవతు వరయోగీ నః సమస్తార్థమూలమ్"** (ఏ మణవాళమహామునుల అవతారహేతువు అయిన మూల అనే నక్షత్రం లోకంలోని చేతనుల మోక్షానికి మూలకారణంగా ఉన్నదో, శ్రీశఠకోపులు దర్శించిన ద్రావిడవేదాన్ని ప్రమాణసామ్రాజ్యంలో అభిషిక్తం చేయడానికి (పట్టాభిషేకం చేయడానికి) కారణమైనదో, కలిదోషాన్ని సమూలంగా పెళ్ళగించి వేయడానికి కారణమై వెల్గుతున్నదో- అటువంటి మూల అనే నక్షత్రంలో అవతరించిన మణవాళమహాములు దాసభూతులమైన మన సకలపురుషార్థాలకు హేతుభూతులు) అని కీర్తించారుకదా! అందువల్ల మూల నక్షత్రం అతులం అనడం అన్వర్థం. మణవాళమహామునుల తిరునాళ్పాట్టులోని భావంకూడా ప్రకృతంలో భావ్యం.

**(శ్రీశేషాంశోద్భవమ్)-** సంసారిచేతనోద్ధరణ కోసం భగవానుని ఆదేశం మేరకు భూలోకంలో భగవద్రామానుజులుగా అవతరించిన ఆదిశేషులు ఆ అవతరాంలో 120 సంవత్సరములు మాత్రమే వేంచేసి ఉన్నందున, మిగిలిన

80 సంవత్సరాల కాలం భూమండలంపై వేంచేసి ఉండడం కోసం తిరిగి వరవరమునులై అంతరించారని వారి వైభవాన్ని తెలిపే సంప్రదాయ చరిత్ర గ్రంథాలు పేర్కొంటున్నాయి. **"సంప్రదాయచంద్రికై"** అనే తమప్రబంధంలో అప్పిళ్ళాన్ అనే వరవరముని శిష్యులు ఈ విషయాన్ని ప్రస్తావించారు. **"దుగ్ధోదన్వద్ధవళమధురం శుద్ధసత్త్వైకరూపం రూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీంద్రావతారమ్"** (పాలసముద్రమువలె తెల్లనిది, మధురమైనది, పూర్తి సాత్త్విక గుణాన్ని కల్గినది అయిన శ్రీవరవరమునుల రూపం వారు ఆదిశేషుల అవతారమనే విషయాన్ని బాగా తెల్పుతున్నది ) అని అంటూ వీరి అవతార మహిమను తెలిసిన అణ్ణన్ వరవరముని శతకంలో పలికారు. తమ ఆదిశేషరూపాన్ని వరవరమునులు పలు సందర్భాలలో ప్రదర్శించిన వైనం వీరి చరిత్రలో గమనించవచ్చు.

**(రమ్యజామాతరమ్ మునిమ్)- "అ*ழ*కియమణవాళన్"** (అందమైన పెళ్ళికొడుకు) అనే పేరు శ్రీరంగనాథుని నామం. దీనిని వరవరమునుల తల్లి తండ్రులు వీరికి నామకరణమహోత్సవ సమయంలో పెట్టారు. ఈనామానికి సంస్కృతీకృతరూపమే రమ్యజామాతృనామం. వీరు సన్న్యాసాశ్రమస్వీకారాన్ని చేసినపుడు శ్రీరంగనాథుడు వీరి పూర్వపు పేరు అయిన అ*ழ*కియమణ వాళనామంతోనే వ్యవహరింపబడాలని **"నీర్ నమ్ముడైయ నామమాన మున్ తిరునామత్తైయే ము*ற்ற* నడత్తుమ్"** (మీరు నాపేరునే కలిగి ఉండండి) అని అంటూ ఆజ్ఞాపించినందున **"రమ్యజామాతృముని"**గా వీరు ప్రసిద్ధి చెందారు. అటువంటి వరవరమునులను **"వందే" - "శిన్దైయాల్ శొల్లాల్ శెయ్‌కైయినాల్"** అని అన్నట్లు మనసా, వాచా, కర్మణా సేవిస్తున్నాను -అని భావం. ఈ శ్లోకంలోని ఇంతకంటే విశేషాలు ఆచార్యసన్నిధిలో ఉపదేశ పూర్వకంగా గ్రహించడం ఉచితం. కనుక విస్తరించడంలేదు.

## నిత్యతనియన్

**శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।**
**యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥**

తిరువాయ్‌మొ*ழ*ి ప్పిళ్ళై దయకు పాత్రమైనవారు, జ్ఞానం భక్తి మొదలైన గుణాలకు సముద్రం వంటివారు, శ్రీరామానుజుల పట్ల గొప్ప భక్తిని కలవారైన శ్రీ వరవరమునులను నమస్కరిస్తున్నాను.

**వాழித్తిరునామమ్**

1. ఇప్పువియిల్ అరఙ్గేశర్క్కీడళిత్తాన్ వాழியే
ఎழిల్ తిరువాయ్‌మొழిప్పిళ్ళై యిణైయడియోన్ వాழியే
ఐప్పశియిల్ తిరుమూలత్తవరిత్తాన్ వాழியే
అరవరశప్పెరుఞ్జోది యనన్దనెన్నుమ్ వాழியే
ఎప్పొழுదుమ్ శ్రీశైల మేత్తవన్దోన్ వాழியే
ఏరారు మెతిరాశ రెన వుదిత్తాన్ వాழியே
ముప్పురినూల్ మణివడముమ్ ముక్కోల్ తరిత్తాన్ వాழியே
మూదరియ మణవాళమామునివన్ వాழியே

ఇప్పువియిల్ = ఈభూమిలో, అరఙ్గేశర్కు = శ్రీరంగనాథునకు, ఈడు= తిరువాయ్ మొழి ప్రబంధానికి నమ్పిళ్ళై కృపజేసిన ఈడు అనే వ్యాఖ్యను, అళిత్తాన్= అనుగ్ర హించిన వరవరమునులు, వాழியే = వర్ధిల్లాలి, ఎழిల్ = ప్రకాశించే, తిరువాయ్ మొழిప్పిళ్ళై = తిరువాయ్‌మొழిప్పిళ్ళై అనే ఆచార్యుల, ఇణై అడియోన్ = శ్రీపాదద్వంద్వాన్ని కలవారు, వాழியే = వర్ధిల్లాలి, ఐప్పశియిల్ = అల్పిశిమాసంలోని, తిరు మూలత్తిల్ = మూల అనే నక్షత్రంలో, అవతరిత్తాన్ = అవతరించినవారు, వాழியే = వర్ధిల్లాలి, అరవు అరశ ప్పెరుమ్ శోది = సర్పాలకు ప్రభువు అయిన గొప్ప జ్యోతిస్స్వరూపుడు, అనన్దన్ = అనంతుడు అయిన వరవరమునులు, ఎన్నుమ్ = ఎల్లప్పుడు, వాழியே = వర్ధిల్లాలి, ఎప్పొழுదుమ్ = ఎల్లప్పుడూ, శ్రీశైలమ్ = శ్రీశైలమనబడే వేంకటాచలాన్ని, ఏత్త వన్దోన్ = స్తుతించడంకోసం వచ్చిన వరవరమునులు, వాழியే = వర్ధిల్లాలి, ఏర్ ఆరుమ్ = సౌందర్యం నిండిన, ఎతిరాశర్= యతిరాజులే, ఎన = అని భావించేటట్లు, ఉదిత్తాన్ = అవతరించిన

వరవరమునులు, వాழ்ழியే = వర్ధిల్లాలి, ముప్పురి నూల్ = యజ్ఞోపవీతాన్ని, మణి వడముమ్ = తులసి, తామరపూసల మాలెలను, ముక్కోల్ = త్రిదండాన్ని, తరిత్తాన్ = ధరించిన వరవరమునులు, వాழ்ழియే = వర్ధిల్లాలి, మూదు అరియ= సనాతనులైన, గొప్పవారైన, మణవాళమామునివన్ = మణవాళమహామునులు, వాழ்ழియే = వర్ధిల్లాలి.

2. మున్దై మఱై త్తమిழ் విరిక్కుమ్ ముత్తిరై క్కై వాழ்ழియే
మున్నూలుమ్ తిరుమార్బుమ్ ముక్కోలుమ్ వాழ்ழియే
ఉన్దియు మొత్త తిరువరైయు ముడైయழகుమ్ వాழ்ழియే
ఒరునాళుమ్ మఱక్కవొణ్ణా వొళిముఱువల్ వాழ்ழియే
శిన్దై తిరైక్కొణ్డరుళుమ్ తిరుమేని వాழ்ழియే
శెழுఙ్కరుణై కుడియిరుక్కుమ్ తిరునయనమ్ వాழ்ழియే
వన్దరుళి యెనై ఎడుత్త మలర్త్తాళ్గళ్ వాழ்ழియే
మణవాళమామునివన్ వాయ్క్కిన్బన్ వాழ்ழియే

మున్దై మఱై = ప్రాచీనమైన సంస్కృతవేదాన్ని, తమిழ் = ద్రావిడవేదాన్ని, విరిక్కుమ్ = వ్యాఖ్యానించే, ముత్తిరై క్కై = వ్యాఖ్యానముద్రను కల వరవరమునుల శ్రీహస్తం, వాழ்ழియే= వర్ధిల్లాలి, మున్నూలుమ్ = (వరవర మునుల) యజ్ఞోపవీతం, తిరు మార్బుమ్= అందమైన వక్షస్థలం, ముక్కోలుమ్= త్రిదండం, వాழ்ழియే = వర్ధిల్లాలి, ఉన్దియుమ్= నాభి, ఒత్త = దానికి తగిన, తిరు వరైయుమ్ = అందమైన నడుము, ఉడై = కాషాయంయొక్క, అழகుమ్= అందం, వాழ்ழియే = వర్ధిల్లాలి, ఒరు నాళుమ్ = ఏనాడూ, మఱక్క ఒణ్ణా = మఱువలేని, ముఱువల్ = చిఱునవ్వు, వాழ்ழియే = వర్ధిల్లాలి, శిన్దై = మనస్సుయొక్క, తిరై కొణ్డు = తెరను తీసి, అరుళుమ్= అనుగ్రహించే, తిరుమేని = దివ్యమంగళరూపం, వాழ்ழియే = వర్ధిల్లాలి, శెழுమ్ = నిబిడమైన, కరుణై = కరుణ, కుడి ఇరుక్కుమ్ = నివాసం ఉండే, తిరు నయనమ్ = తిరునేత్రాలు, వాழ்ழియే = వర్ధిల్లాలి, వన్దరుళి = నాదగ్గరకు వచ్చి, ఎనై =

నన్ను, ఎడుత్త = ఉద్ధరించిన, మలర్ త్తాళ్‌గళ్ = తామరపూలవంటి శ్రీపాదాలు, వాళ్ళియే = వర్ధిల్లాలి, వాయ్‌క్కు ఇన్బన్ = వాక్కుకు ఆనందాన్ని కల్గించే, మణవాళమామునివన్ = వరవరమునులు, వాళ్ళియే = వర్ధిల్లాలి.

3. తినైప్పొళ్ళుదుమ్ తనై మఱవా చ్చిన్దైతన్దాన్ వాళ్ళియే
శీర్ తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై తిరువడియోన్ వాళ్ళియే
నినైప్పోర్‌కళ్ పిఱవినై నీక్కుమవన్ వాళ్ళియే
నీళ్పువియిల్ తన్ పుకళ్ళై నిఱుత్తినాన్ వాళ్ళియే
అనైత్తాళ్ళ్వార్‌కలైప్పొరుళై ఆయ్‌న్దురైప్పోన్ వాళ్ళియే
అళ్ళకారు మెతిరాశఱ్కన్బుడైయోన్ వాళ్ళియే
ఎనైప్పోలుమ్ పావియర్‌కట్కిరఙ్గుమవన్ వాళ్ళియే
ఎన్నప్పన్ మణవాళమామునివన్ వాళ్ళియే

తినై ప్పొళ్ళుదుమ్ = క్షణకాలం కూడా, తనై = తనను, మఱవా = మఱువని, శిన్దై = మనస్సును, తన్దాన్ = అనుగ్రహించిన వరవరమునులు, వాళ్ళియే = వర్ధిల్లాలి, శీర్ = కల్యాణగుణాలను కల, తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళై= తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళైయొక్క, తిరు అడియోన్ = శ్రీపాదాలను ఆశ్రయించిన వరవరమునులు, వాళ్ళియే = వర్ధిల్లాలి, నినైప్పోర్‌కళ్ = తమను ధ్యానించే వారి, పిఱవితనై = జన్మను, నీక్కుమవన్ = లేకుండాచేసే వరవరమునులు, వాళ్ళియే = వర్ధిల్లాలి, నీళ్ పువియిల్ = విశాలమైన భూమండలంలో, తన్ పుకళ్ళై = తన కీర్తిని, నిఱుత్తినాన్ = స్థిరంగా నిలిపిన వరవరమునులు, వాళ్ళియే= వర్ధిల్లాలి, అనైత్తు ఆళ్ళ్వార్‌కళ్ = అందఱు ఆళ్ళ్వార్ల, కలై ప్పొరుళై= శాస్త్రాల (దివ్యప్రబంధాల) పొరుళై= అర్థాన్ని, ఆయ్‌న్దు = విచారించి, ఉరైప్పోన్= వ్యాఖ్యానించే వరవరమునులు, వాళ్ళియే = వర్ధిల్లాలి, అళ్ళకు ఆరుమ్ = సౌందర్యం నిండిన, ఎతిరాశఱ్కు = యతిరాజుల విషయంలో, అన్బు ఉడైయోన్=భక్తిని కల వరవరమునులు, వాళ్ళియే = వర్ధిల్లాలి, ఎనైప్పోలుమ్ = నావంటి, పావియర్ కట్కు = పాపులకు, ఇరఙ్గుమవన్ = దయచూపే

వరవరమునులు, వాళ్రియే= వర్ధిల్లాలి, ఎన్ అప్పన్ = నాతండ్రి అయిన, మణవాళమామునివన్ = మణవాళమహా మునులు, వాళ్రియే = వర్ధిల్లాలి.

## తిరునాళ్‌పాట్టు

శెన్దమిళ్ వేదియర్ శిన్దై తెళిన్దు శిఱన్దు మకిళ్న్దిడునాళ్
శీరులకారియర్ శెయ్‌దరుళ్ నఱ్కలై తేశు పొలిన్దుడునాళ్
మన్దమది ప్పువి మానిడర్‌తఙ్గళై వానిలుయర్త్తిడునాళ్
మాశఱు ఞానియర్‌శే రెతిశాశర్‌తమ్ వాళ్వు ముళైత్తిడునాళ్
కన్దమలర్ పొళ్రిల్ శూళ్ కురుకాదిపన్ కలైకళ్ విళఙ్గిడునాళ్
కారమర్‌మేని యరఙ్గర్‌క్కు ఇడైకణ్‌కళ్ కళిత్తిడునాళ్
అన్దమిల్ శీర్ మణవాళముని ప్పరనవతారమ్ శెయ్‌దిడునాళ్
అళ్గు తికళ్న్దిడుమైప్పిశియిల్ తిరుమూలమదనైనాళే

శెమ్ తమిళ్ వేదియర్ = ఋజువైన, అందమైన ద్రావిడవేదాన్ని తెలిసిన పండితుల, శిన్దై= మనస్సు, తెళిన్దు = తేటపడి, శిఱన్దు= గొప్పతనాన్ని పొంది, మకిళ్న్దిడునాళ్ = ఆనందించే సుదినం, శీర్ ఉలకారియర్ = కల్యాణ గుణగరిష్ఠులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, అరుళ్ శెయ్‌ద = అనుగ్రహించిన, నల్ కలై = గొప్ప శాస్త్రం అయిన శ్రీవచనభూషణంయొక్క, తేశు = తేజస్సు, పొలిన్దిడునాళ్ = వర్ధిల్లే సుదినం, మన్ద మది = మందమతులైన, పువి= భూమి లోని, మానిడర్‌తఙ్గళై = మానవులను, వానిల్ = పరమపదంలోనికి, ఉయర్త్తిడు నాళ్= ఉద్ధరించే సుదినం, మాశు అఱు = దోషం లేని, ఞానియర్= జ్ఞానులు, శేర్ = ఆశ్రయించే, ఎతిరాశర్‌తమ్ = యతిరాజుల, వాళ్వు = ఉజ్జీవనం, ముళైత్తిడునాళ్ = అంకురించే సుదినం, కన్ద మలర్ = సుగంధాన్ని కలిగిన పూలను కల, పొళ్రిల్ = తోటలు, శూళ్ = చుట్టి ఉండే, కురుకు = కురుకాపురికి (ఆళ్వార్‌తిరునగరికి), అదిపన్ = ప్రభువు అయిన నమ్మాళ్వార్ల, కలైకళ్ = శాస్త్రాలు (ప్రబంధాలు), విళఙ్గిడునాళ్ = వెలిగే సుదినం, కార్ అమర్ మేని =మేఘంవంటి మేనిని కల, అరఙ్గఱ్కిడై = శ్రీరంగనాథుని, కణ్‌గళ్=

తిరునేత్రాలు, కళిత్తిడునాళ్ = సంతోషించే సుదినం, అన్దమ్ ఇల్ = అంతులేని, శీర్ = మహిమను, (కల్యాణగుణాలను) కల, పరన్ = సర్వోత్కృష్టులైన, మణవాళముని = మణవాళమహాముని, అవతారమ్ శెయ్దిడునాళ్ = అవతరించిన సుదినం, ఏది? అని అంటే, అழకు = అందం, శోభ, తికழన్దిడుమ్ = ప్రకాశించే, ఐప్పిశియిల్ = అల్పిశి మాసంలోని, తిరుమూలమ్ అదనైనాళే = అందమైన మూల అనే నక్షత్రమే.

**వాழి తిరువాయ్మొழిప్పిళ్ళై మాతకవాల్**
**వాழుమ్ మణవాళమామునివన్ - వాழియవన్**
**మాఱన్ తిరువాయ్మొழి ప్పొరుళై మానిలత్తోర్**
**తేఱుమ్బడి యురైక్కుమ్ శీర్**

తిరువాయ్మొழిప్పిళ్ళై గొప్ప దయవల్ల ఉజ్జీవించే మణవాళమామునులకు మంగళం. తిరువాయ్మొழి ప్రబంధం దివ్యార్థాన్ని ఈలోకంలోనివారంతా స్పష్టంగా తెలిసేటట్లు వివరించే వారి గొప్పతనానికి మంగళం.

**అడియార్కళ్ వాழ యరఙ్గనకర్ వాழ**
**శడకోపన్తణ్డమిழ్నూల్ వాழ - కడల్శూழ్న్ద**
**మణ్ణులకమ్ వాழ మణవాళమామునియే**
**ఇన్నుమొరు నూఱ్ఱాణ్డిరుమ్**

దాసులు ఉజ్జీవించేటట్లు, శ్రీరంగనగరం ఉజ్జీవించేటట్లు, శఠకోపులు అనుగ్రహించిన చల్లని ద్రావిడవేదం ఉజ్జీవించేటట్లు, సముద్రపరివేష్ఠితం అయిన భూలోకం అంతా ఉజ్జీవించేటట్లు ఓ మణవాళమహామునీ! ఇంకా ఒక నూటేండ్లు వేంచేసి ఉండండి.



# శ్రీవరవరమునివరాష్టోత్తర శతనామస్తోత్రమ్

**( దేవరాజగురుకృతమైన శ్రీవరవరముని శతకానికి వాధూల వీరరాఘవాచార్య స్వామి ప్రసాదించిన సంస్కృత వ్యాఖ్యానం ముంబయి నగరంలోని వేంకటేశ్వర స్టీమ్‌ప్రెస్‌లో ఇప్పటికి సుమారు 107 సంవత్సరములకు ముందు దేవనాగరిలిపిలో ముద్రింపబడింది. ఆ గ్రంథంలో చివర ఈ అష్టోత్తర శతనామ స్తోత్రం కూడా ముద్రింపబడింది.)**

1. శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవః ।
యతీంద్రప్రవణో రమ్యజామాతృమునిశేఖరః ॥

2. తులామూలావతీర్ణశ్చ శేషాంశకలితోదయః ।
శుభగః కరుణాసింధుః సూరిసంతోషకారకః ॥

3. త్రిదండపాణిః కాషాయచేలో ధవళవిగ్రహః ।
శిఖీ యజ్ఞోపవీతీ చ శ్రీమాన్ సర్వజగద్గురుః ॥

4. దివ్యోర్ధ్వపుండ్రదీప్తాంగః తులసీమాలికాంచితః ।
పుండరీకాక్షో మహాన్ పురుషపుంగవః ॥

5. రంగేశమంగళార్థీ చ రమణీయగుణాకరః ।
జగదుజ్జీవనకరో జానకీనాథజీవనః ॥

6. ప్రపన్నచాతకాంభోదః పరివ్రాజకమండనః ।
శ్రీవైష్ణవకులాంభోజభాను రాశ్రితకల్పకః ॥

7. భట్టనాథార్యసేవ్యాంఘ్రిః వరదార్యప్రియంకరః ।
శ్రీవానాచలరామానుజార్య పూజ్యపదద్వయః ॥

8. అష్టవిద్వత్పరివృతః సర్వసూరినిషేవితః ।
లోకపావనచారిత్రః సౌమ్యః పాపవినాశనః ॥

9. శ్రీరంగనాయకీపుణ్యపుంజసత్త్వనికేతనః ।
శ్రీజిహ్వావదధీశాన దాసభాగ్యఫలోదయః ॥

10. పరాంకుశపదాంభోజభృంగః కల్యాణసాగరః ।
శుచ్చి ర్భక్తినిధిః జ్ఞానదీప్తో వైరాగ్యభూషణః ॥

11. శ్రీరంగనిలయః సర్వవేదవేదాంతపారగః ।
సర్వజ్ఞమౌళిః సారజ్ఞో ద్రావిడామ్నాయవర్ధనః ॥

12. వ్యాఖ్యాతజగదాచార్యప్రబంధోవైదికోత్తమః ।
శ్రీరామానుజసిద్ధాంతవర్ధనః కలినాశనః ॥

13. శ్రీరామానుజసంబంధదాయకః శ్రీవిధాయకః ।
రామానుజార్యపారమ్యస్థాపకః తత్త్వదీపకః ॥

14. మృదుః సర్వసమః శాంతో దాంతః స్వామీ చ వత్సలః ।
శేషీ సుశీలః సుశ్లోకః సుభాషీ మోక్షదాయకః ॥

15. హితవాదీ హితకరః ప్రియవాదీ ప్రియంకరః ।
సులభః సిద్ధధర్మాభిరక్షణో దేశికోత్తమః ॥

16. శ్రీరంగనాయకాచార్యః సేవకావ్యాజబాంధవః ।
మంత్రరత్నార్థనిష్ణాతో మంత్రసారతమార్థవిత్ ॥

17. బదరీతాపసోద్గీతశ్లోకః సుశ్లోకవందితః ।
అస్తోకమహిమా లోకప్రకాశో లోకజీవనః ॥

18. గోదాపాదాబ్జసద్భక్తః కుశలీ కోవిదప్రియః ।
సర్వపూర్వోత్తరాచార్య సుధాసాగరచంద్రమాః ॥

19. పూర్ణచంద్ర ప్రభాసాంద్రః పూర్ణకామః పురాణవిత్ ।
దేవదేవప్రియో దివ్యప్రభావో దీనశేవధిః ॥

20. సత్యవాక్ దక్షిణకలారక్షకో ధరణీధరః ।
ప్రాపకః ప్రాప్యభూతశ్చ ప్రజ్ఞావాన్ ప్రతిభాకరః ॥

21. అర్థపంచకయాథాత్మ్యదాయీ దాస్యామృతప్రదః ।
శ్రీనృసింహార్యసంసేవ్యః శ్రీమాన్ వరవరో మునిః ॥

ఇదం శ్రీరమ్యజామాతృమునే రష్టోత్తరం శతమ్ ।
దివ్యనామ మహాపుణ్యం పశ్యతః పాపనాశనమ్ ॥



# శ్రీమణవాళమహామునుల తిరుమంజన క్కట్టియమ్

కాషాయశోభి కమనీయ శిఖానివేశం
దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్ ।
ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రం
రూపం తవాస్తు యతిరాజ! దృశోర్మమాగ్రే ॥

శ్రీ భూభ్యాం రంగనాథే శఠజిదుపనిషద్వ్యాక్రియాం శ్రోతుకామే
శేష స్సంతోషయిష్యన్ వరవరమునితాం ప్రాప్య యో వర్తతేగ్రే ।
కాషాయశ్రీతులస్యంబుజ మణిసుశిఖాయజ్ఞసూత్రత్రిదండై:
భాంతం శుభ్రోర్ధ్వపుండ్రం స్మర హృదయ! సదా కోశముద్రాంకహస్తమ్.

పోదచ్చివన్దుపరిమళమ్ వీశిప్పుదుక్కణిత్త
శీదక్కమలత్తై నీరేఱ వాట్టి చ్చిఱన్దడి ఎన్
ఏదగ్రై మాగ్రుమ్ మణవాళ యోగి యినిమైతరుమ్
పాదక్కమలఙ్గళ్ వాழ்ియరో పాదక్కమలఙ్గళ్ వాழ்ియరో

1) అరఙ్గనకరీడుదనై అళిత్తరుళుమ్ పెరుమాళ్ !
2) అழ்కాన కురుకూరిల్ అవతరిత్త! పెరుమాళ్ !
3) అరవరశప్పెరుఞ్జోతి యనన్దనెన్నుమ్ పెరుమాళ్ !
4) అరుళరఙ్గర్ శ్రీశైలమేత్త వన్ద పెరుమాళ్!
5) ఇరవుపకల్ ఎతిరాశరడి మకిழ்ుమ్ పెరుమాళ్!
6) ఇన్నిలత్తిల్ పిఱవిదనై మకిழ్న్దురైక్కుమ్ పెరుమాళ్!
7) తిరుమాక దిగ్గజఙ్గళిట్టరుళుమ్ పెరుమాళ్!
8) దేవపిరానడియిణైయిల్ అన్బుపూణ్డ పెరుమాళ్!

నమ్మణవాళమామునిప్పెరుమాళ్!

9) పల్పమెన త్తికழ்మ్ పైఙ్గழ்లున్దన్ పల్లవమే విరలుమ్
పావన మాకియ పైన్దువరాడై పడిన్ద మరుఙ్గழ்కుమ్

ముప్పురినూలొడు మున్ కైయిలేన్దియ ముక్కోల్తన్నழకుమ్
మున్నవర్ తన్దిడుమొழికళ్ నిఱైన్దిడు ముఱువల్ నిలావழకుమ్
కఱ్పకమే విழి కరుణై పొழిన్దిడు కమలక్కణ్ణழకుమ్
కారిశుతన్ కழల్ శూడియ ముడియుమ్ కననచ్చికై ముడియుమ్
ఎప్పొழుదుమ్ వరయోగి యిన్వడివు ఎన్నిదయత్తుళదాల్
ఇల్లై యెనక్కెదిరిల్లై యెనక్కెదికిల్లై యెనక్కెదిరే

1. దేవరీరుడైయ తిరువడిత్తామరైకళిన్ భోగ్యతాతిశయత్తుక్కు ఒరు పోలియాక గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళరవికరవికసిత మానదోర్ శెన్దామరైప్పూవై అదినుడైయ గర్వసర్వస్వనిర్వాపణ పూర్వకమాక త్తిరువడి కళిన్కీழ్ అముక్కి, అదిన్ తలైమేల్ వెఱ్ఱియుడన్ వీఱ్ఱిరుక్కుమ్ ఇరుప్పినழకుమ్.

2. పంకజరజస్సువ్ పాదారుంతుదమావ్బుడి చేటీజనలోచనచర్చా-సహాసౌకుమార్యశాలినికళాన పిరాట్టిమారుమ్ పిడిక్క క్కూశుమ్బుడి పుష్పహాససుకుమారతరరాన పెరియపెరుమాళుక్కుమ్ మెత్తెన్న పఞ్జశయనమాయ్, అత్యంతసుకుమారరాన దేవరీర్ తమక్కాసనమాయ్ క్కొణ్డు తొణ్డుపూణ్డ పుణ్డరీకత్తుక్కు స్వదాస్యార్హసారస్యాదికళై యూట్టుకైక్కు తదాస్యాంతరత్తిల్ శొరుకియిట్టువైత్తాప్పోలే మఱైత్తిట్ట ఇడత్తిరువడికళుమ్

3. సంసరణదవదహనదందహ్యమానసకలజగదవనపర - సంతత చింతా సమాక్రాంతియాలే విధృతతయా ఫణిపతిశయన శయానరాన పెరియ పెరుమాళుడైయ యోగనిద్రాముద్రాను- కారియాక ఇడత్తొడైయిన్మేల్ వళర్త్తి, క్కణ్ణారక్కణ్డు కఴివదోర్ కాదలు ఱ్ఱార్క్కు ము ఱ్ఱూట్టాక క్కాట్టియిట్ట వలత్తిరువడికళుమ్,

4. పరబ్రహ్మభూతపరమపురుషవిషయకసంగ కామాత్యుద్దీపకరాన మన్నియ శీర్ మాఱనెన్నుమ్ మాఱనుక్కు దేవరీరుడైయ పదసరసిజవ్యాజేన కుసుమ శరసహితమాక వమైత్తువైత్త అమ్బరాత్తూణి కళ్పోలే ఇణైత్తువైత్త కణైక్కాళ్ కళుమ్.

5. కీழ్నోక్కి క్కిళర్కిన్ఱ శుడర్చ్చోదివెళ్ళఙ్గళ్ ఆసనాభిఘాతత్తాల్ మఱియుణ్డు శుழிత్తాప్పోలే ఇరణ్డురుకుమ్ తిరణ్డురుణ్డు మడియుణ్డ ముழన్దాళ్ కళుమ్

6. కన్దళిత్తకదళీకాణ్డకరికరభఙ్గళై వెన్ఱు అడిపెరుత్తు, మునిశిఱుత్తు మదమదెన్ఱు మాంసలఙ్గళాయ్ విళఙ్గుకిన్ఱ తిరుత్తొడైకళుమ్,

7. శరప్రమథనశమధనసార్వభౌమజైత్రయాత్రారథమ్పోన్ఱ దేవరీర్ తిరుమేనిక్కు క్కీழురుణ్డువరుమ్ ఇరణ్డు చక్రమణ్డళఙ్గళ్పోన్ఱ పృథునితమ్బబిమ్బఙ్గళుమ్

8. తిరువరైయిల్ కడితొడఙ్గి క్కణైక్కాల్కళ్ నడువళవుమ్ ఉళ్ళుళ్ళ వడివழకుక్కు అత్యన్తప్రకాశకమాయ్, పొరుత్తముడన్ ధరిత్తిరున్ద కమనీయ కాషాయముమ్,

9. ఇడవరుకిల్ తొడైయడియిల్ తొఙ్గుకిన్ఱ తలైప్పుడనే నడుక్కోత్తు, మడిత్తుడుత్త సర్వోత్తరోయోత్తరీయముమ్,

10. సంధ్యారాగరంజితమాన శారదాభ్రత్తిల్ తనిత్తெழున్దోర్ కొడిమిన్నల్ నిలైనిన్ఱు పడర్న్దాప్పోల్ అరైచ్చివన్దవాడైయిన్మేల్ నెళిన్దుకొణ్డు నిగనిగెన్ఱ పొన్నరై నాణ్పూణ్డవழకుమ్,

11. భవదనుభవరసవివశరుడైయ వభినివేశపాశపరిభ్రామిత- మతిమంధాన మధ్యమానమానసౌందర్యదుగ్ధసింధువానదు శుగ్గోరుమ్తిరైన్దெழున్దు నడుక్కుழిత్తిట్ట శుழிపోల్ శున్దరమామ్ ఉన్దిమలరుమ్,

12. వినయముడన్ వీశుకిన్ఱ వెట్టివేర్ విశిఱికళాల్ అత్యంత ఘుమఘుమిత శనైఃశనైః ప్రసరన్ మందగంధవహవిహరణ-విశేషఙ్గళాలే దేవరీరుడైయ దివ్యలావణ్యతరఙ్గిణీపార్శ్వభాగఙ్గళిల్ ఇరణ్డలైవరిశై పరమ్బినాప్పోల్ ఇరుపక్కముమ్ తికழ்కిన్ఱ త్రివళికళుమ్,

13. "మా మేక" మెన్బదై అభినయిత్తు క్కాట్టువదుపోల్ నెఞ్జుక్కు నేరాక క్కొఞ్జమ్ శాయ్త్తఞ్జలిత్త తిరుక్కైకళుమ్,

14. తఙ్గవళైమేల్ తఙ్గిత్తొఙ్గుకిన్ఱ శఙ్గిలికళోడిణక్కముఱ్ఱకణైక్కైకళుమ్,

15. అభినవతరదరవికస్వరసరసిజవరముకుళతళత్తళాయమాన నిజాఙ్గులీ శిఖాంగులీశోభైయై నిజహృదయజలజదళైకరసికహార్ద జనార్దననుక్కు అవనమిత్తుక్కాట్టుకైయాల్ ముఱుక్కియిట్ట మున్కైకళుమ్,

16. అఘటితఘటనాసమర్థచతుర్భుజభుజదుర్భరవిభూతిద్వయ భరభరణార్థ మాక క్కనకమయగిరివరజ్ఞళిరణ్డై వెళిరఱ క్కట్టిత్తు ప్పుకరెళ్ల క్కడైన్ద తూణాక్కి మడుత్తాప్పోల్ ఇరణ్డట్టత్తిలుమ్ తిరణ్డురుణ్డు, నీణ్డు, దృఢతరజ్ఞళుమాయ్, శిరీషకుసుమ - సౌకుమార్యమ్ తిరణ్డు వడివుకొణ్డా ప్పోల్ అత్యంతమృదు - లజ్ఞళుమాయ్, [22]సాక్షాత్ భుజగపతి భోగాత్మ కత్వప్రత్యాయ- కజ్ఞళుమాయ్ విళఙ్గుకిన్ఱ బాహుదణ్డజ్ఞళుమ్,

17. హృదయాంతర్నిహితబ్రహ్మపురగోవనార్థ మిట్ట హాటకమయ కవాటపుటమ్పోల్ పళపళెన్ఱకన్ఱు గాఢవ్యూఢమాయ్, వయఃపరిమాణ సూచనార్థమాక క్కొఙ్జమ్ తళర్న్దదుపోల్ విళఙ్గుకిన్ఱ విశాలవక్షఃస్థలముమ్,

18. అళ్లకుశెణ్డాడుకిఱ అమ్మార్బినళ్లకిల్ ఆళ్లఙ్గాల్పట్టు మయఙ్గి విళ్లకిన్ఱ మనోనయనయుగళజ్ఞళ్ మూన్ఱుక్కుమ్ కైప్పిడికొడుత్తు, ఆవఱ్ఱై త్తోళక్కిల్ తువక్కుకైక్కు త్తొఙ్గవిట్ట అవలంబసూత్ర- త్రయమ్పోన్ఱ సౌదామనీ సవర్ణసౌవర్ణ యజ్ఞసూత్రముమ్,

19. సేశ్వరవిభూతిద్వయత్తుక్కుమ్ నిళ్లల్కొడుత్తు వళర్న్దు, విశాలజ్ఞళు మాయ్, గిరివరశిఖరసుఖప్రతిష్ఠితసింహస్కంధసంధిబంధసంస్థాన బద్ధస్పర్ధజ్ఞళు మాయ్, శరిన్దుయర్న్దు విళఙ్గుకిన్ఱ తిరుత్తోళ్కళుమ్,

20. కంఠరుద్ధప్రణవాక్షరజ్ఞళ్ కళ్లుత్తుళ్లే నెరుక్కుణ్డు, విమ్మి ప్పుఱమ్ పొశిన్దాప్పోల్ రేఖాత్రయవిభక్తాంగమాయ్, క్రముకతరుణ- గ్రీవాకమ్బు ప్రతిమమాయ్ విళఙ్గుకిన్ఱ తిరుక్కళ్లుత్తినళ్లకుమ్,

21. శుగ్గ్రుమొళివట్టమ్ శూళ్న్దశోది పరన్దదెన్గిఱపడియే శారదశర్వరీ పర్వాగ్ర సమయసమేధితసకలకలాపూర్ణసర్వాహ్లాదకరమాన, మఱుక్కళ్లు త్తిన చంద్రమండలత్తైయుమ్, అప్పోదలర్న్ద శెన్దామరైప్పూవైయుమ్ సహజకాంతి శైత్యమార్దవసౌరభ్యాదికళాల్ అధఃకరిత్తు, కిట్టినారై మైయలేగ్గ్రిమయక్కుమ్ మాయమన్దిరమాయ్ విళఙ్గుకిన్ఱ స్మయమాన ముఖారవిందముమ్,

22. నిన్ఱవానిల్లా నెఞ్జు పిణిప్పుణ్ణుమ్ పడుక్కణ్ణిక్కయిగ్గ్రు చ్చురుళ్కళ్పోల్ శురుణ్డురుణ్డు, నీణ్డు, మనోహరజ్ఞళుమాయ్, మున్ శిలనాళ్ శాత్తిక్కళైన్ద ఘనకనకమకరకుండలద్వయత్తై త్తళర్న్దు వళర్న్దు వడువిట్టవడివళ్లకాల్

కోళ్శొల్లిత్తరక్కడవదు-కళువాయ్, మార్దవాతిశయత్తాల్ మెల్ల వశైన్దాడువదుపోల్ తోళళవుమ్ తళతళెన్ను తొఱ్ఱుకిన్ఱ తిరుచ్చెవికళుమ్,

23. ఇశైన్దు కనిన్ద ద్రాక్షాద్వయమ్‌పోల్, నడుప్పదిన్దు, వకుప్పుణ్డు, తిరణ్డెఝున్ద చుబుకవికాసముమ్,

24. స్వాంతఃస్వాంతన్నిరంతరచింత్యమానానంతశయానంతచిరంతనో దంత సంతానసాక్షాత్కారహఠాత్కారసముదంచితరోమాంచ విశేషఙ్గళాలే పరమ పురుషసంశ్లేషహర్షాతిరేకసూచకఙ్గళుమాయ్, అవ్యక్తాంకురశ్మశ్రు సమూహతయా "యత్రర్షయః ప్రథమజాః యే పురాణాః" ఎన్గిఱ నిత్యయు వత్వత్తై కోళ్శొల్లిత్తరక్కడవదుకళుమాయ్, పుకర్‌పడైత్తు ప్పెరుత్తు విళఙ్గుకిన్ఱ తాలుమూలఙ్గళుమ్.

25. సకలవిబుధసదాస్వాద్యమాన దేవరీరుడైయ వదనసుధానిధి మండలాంత రాళత్తిల్ తిరట్టియిట్ట అమృతరససారఙ్గళ్‌పోల్ అత్యంత భోగ్యఙ్గళుమాయ్, చ్చివన్దు కనిన్ద కోవైప్పఴత్తైయుమ్ కడైన్దు, తుణ్డిట్ట పవళక్కొడియైయుమ్ హసిత్తు చ్చిఱిప్పదుపోల్ మందస్మిత మనోహరఙ్గళుమాయ్, అతిరుచిర భావగర్భమాన దొరువార్‌త్తై శొల్లత్తొడఙ్గి త్తుడిప్పదుపోల్ విళఙ్గుకిన్ఱ తిరుప్పవళఙ్గళుమ్,

26. అభిమతజనదర్శనానందవేగత్తాల్ అర్చావతారసమాధియైక్కడన్దు విమ్మి, వెళివిఝుకిన్ఱ అవ్యక్తమధురమందహాసవికాసముమ్,

27. స్ఫటికమయగండశైలకృతఙ్గళాన ఇరణ్డు ముకురమణ్డలఙ్గళై మాశఱక్కడైన్దు, తూళిట్టు, త్తులక్కి, తుడైత్తువైత్తాప్పోల్ తళతళన్ఱ దివ్యకపోలఙ్గళుమ్,

28. తొఱ్ఱుకిన్ఱ శెణ్బకప్పూప్పోలే నునిమలర్‌న్దుయర్‌న్దు, అడికుఱుకి నీణ్డు, నళికాయుధమ్‌పోల్ రంధ్రద్వయశోభితమాయ్, మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో? కొఝున్దో? ఎన్ను నిత్యసందేహజనకమాయ్ విళఙ్గుకిన్ఱ కోలనీళ్ కొడిమూక్కినఴకుమ్,

29. ఎప్పాలుమ్ పరన్దుళ్ల సకలజనఙ్గళుక్కుమ్ తఙ్గళైయే నోక్కినాప్పోల్ అత్యంత రఞ్జకఙ్గళుమాయ్ పుడై పరన్దు, మిళిర్‌న్దు, ఇలఙ్గొళిశేర్ అరవిన్దమ్‌పోల్

నీణ్డు, విశాలఙ్గళుమాయ్, శణ్డైయిడుమ్ ఇరణ్డు కెణ్డైకళ్ పోన్ఱ నెగ్ఱియుళ్ల కాల్ విళఙ్గుకిన్ఱ తణ్డామరైక్కణ్గళుమ్,

30. గుణారోపణమ్కొణ్డు వళైన్దు నిన్ఱ శార్ఙ్గవిల్లై నిజమాన వడివళ్లకాల్ వెన్ఱుకొణ్డు వళైన్దునిన్ఱ తిరుప్పురువవట్టఙ్గళుమ్,

31. శారదాష్టమ్యోషధీశనుడైయ అతినిర్మలమండలాంతరాళత్తిల్ ఊఙ్గ్ఱు మాఱామల్ శురన్దు, పెరుకివరుకిన్ఱ ఇరణ్డు అమృతధారైకళ్ తదుపాంత వినిర్మితదివ్యాలవాలకుల్యాకూలబంధవిశేషఙ్గళాలే పరస్పరమెదిర్కొణ్డు, మఱియుణ్డు, కూడిక్కుఱుకి, గంభీరమాయ్ వళ్ర్న్దిళ్ర్న్దు వళర్న్దు పడర్న్దదోర్ కఱ్పక క్కొడియిన్ అడియిల్ ఏఱి ప్పాయ్న్దు, నిఱైన్దు తేఙ్గినిన్దాప్పోల్ తిరునెగ్ఱియిన్ నడువిల్ వడువిట్టు పడిన్దుకొణ్డు, అవిచ్ఛిన్న రేఖముమాయ్, భ్రూపక్ష్మయుగళాంతరాళస్థిత కోణద్వయ శోభితము మాయ్, విచ్ఛిన్న మూలముమాయ్, కోలనీళ్కొడిమూక్కినడియై విళాక్కాలై క్కొణ్డు విళఙ్గుకిన్ఱ రామానుజాఖ్యదివ్యపీఠసంయుతమాన దివ్యోర్ధ్వపుండ్ర విశేషముమ్,

32. అదినిడైయిల్ అమృతోద్భవైయాన సకలవిభూతిపట్టాభిషేకసామ్రాజ్య లక్ష్మియినుడైయ స్వేచ్ఛావిహారవిక్షిప్తపదకమలలాక్షారసధారారేఖైపోల్ చ్చివన్దు, పడిన్దు విళఙ్గుకిన్ఱ రక్తవర్ణశ్రీచూర్ణరేఖైయుమ్,

33. మలర్న్దుయర్న్ద తిరుముడియుమ్,

34. వళర్న్దు మడిన్దు వ్యక్తావ్యక్తమాయ్ విళఙ్గుకిన్ఱ తిరుక్కుళ్లలొళ్లుఙ్గుమ్,

35. శుగ్ఱిచ్చుళ్లత్తి క్కుళైత్తిట్టు ముడిత్తు త్తొఙ్గవిట్ట శిఖాబంధముమ్,

36. పిన్నెడుత్త పిడరియళ్లకుమ్,

37. తిరువనన్దాళ్ల్వాన్ పిన్పడమ్పోలే నడుప్పదిత్తు, పరన్దు నెఱిత్తిట్ట తిరుముదుకుమ్,

38. వలవరుకిల్ కైమేలుమ్, మార్బిలుమాయ్ మున్నాట్టి త్తాఙ్గియిట్ట త్రిదండాగ్రముమ్,

39. శీరియదోర్ నిధిపోల్ తిరుమున్బేనోక్కి వైత్తిట్టువైత్త తిరువడినిలైకళుమాయ్ ఇప్పోదు దేవరీర్ తిరుమఙ్జనమ్ కొణ్డరుళ ఎழுన్దరుళి యిరుక్కుమழகు ఏదేనుమ్ శిన్దైమరుళో?

40. మంత్రరత్నానుసంధాన సంతతస్ఫురితాధరముమ్, తదర్థతత్త్వనిధ్యాన సన్నద్ధపులకోద్గమముమాయ్ తిరుమఙ్జనమ్ కొణ్డరుళ ఎழுన్దరుళి ఇరుక్కు మழగు ఏదేనుమ్ శిన్దైమరుళో?

జగన్మోహనమంత్రప్రభావమో? సకలరసగుళికావిశేషమో?
సర్వభోగచింతామణిప్రకాశమో? అఖిలజగత్సుకృతవిపాకమో?
అఖిలఫలకల్పలతాప్రసరమో? మస్త సంపత్ సామ్రాజ్యవేషమో?
సర్వమంగళసంతానప్రసవమో? సకలజగజ్జీవన మూలమో?
సర్వానందకందావతారమో? సకలకలారహస్యసర్వస్వమ్మో?
సర్వేశ్వరాపద్ధనమో? ఇవైయెల్లామ్ తిరణ్డెழுన్దు కొణ్డదోర్ వడివో?
ఇదువుమన్ఱి, అప్రమేయతేజస్సో?
నాఙ్గళ్ ఏదొన్ఱటియా, ఇవ్వழకుడన్ దేవరీర్ ఊழிదోఱుమ్ ఊழிదోరుమ్
వాழ்న్దిడుక ! వాழ்న్దిడుకవే ! యతిసార్వభౌమనే!

41. అన్బుడనే యణ్ణనుక్కు అడిమైపూణ్డ నేర్త్తై యాఱవో!
అழல్ శరత్తర విన్దిరైశిత్తై యణిత్త వేర్త్తై యాఱవో!
అద్దైవుడనే తిరుప్పదికళ్ నడన్ద వేర్త్తై యాఱవో!
అరవరశా యడియిణైయిల్ అన్బుపూణ్డ వేర్త్తై యాఱవో!
అరుళాలే యడియార్కట్కుడళిత్త వేర్త్తై యాఱవో!
అడిక్కొదిప్పాల్ ఇన్నిలత్తిల్ ఆర్త్తి యురైత్త వేర్త్తై యాఱవో!
అరుళాలే కచ్చిదనిల్ అడియోఙ్గళై యళిత్తి వేర్త్తై యాఱవో!
అనవరతమ్ వియాక్కియైకళ్ అళిత్త కళై యాఱవో!
దేవరీర్ మఙ్జనమాడి యరుళ్వదే!

42. శెన్దమిழ் వేదియర్ శిన్దై తెళిన్దు శిఱన్దు మకిழ்న్దిడవే
శీరులకారియర్ శెయ్దరుళ్ నఱ్కలై తేశు పొలిన్దిడవే

మన్దమది ప్పువి మానిడర్తజ్గళై వానిలుయర్త్తిడవే
మాశఱు ఞానియర్శే రెతిశాశర్తమ్ వాழ்వ్ముళైత్తిడవే
కన్దమలర్ పొழிల్ శూழ் కురుకాదిపన్ కలైకళ్ విళజ్గిడవే
కారమర్మేని యరజ్గర్క్కు ఇణైకణ్కళ్ కళిత్తిడవే
ఇన్ద నిలన్దన్నిల్ వన్దుదయమ్ శెయ్ద శున్దరమామునియే
ఇన్బైజ్గళ్ కణ్జ్గళ్ కళిత్తిడ మఞ్జనమాడి యరుళ్వదే

43. వలమాకవణ్ణలే నల్లెణ్ణెయ్ మఞ్జళాల్
నన్ మఞ్జనజ్కొణ్డు నాడోఱుమ్ వాழ்కవే

44. కజ్గై నీరొరుపాల్ కావిరి యొరుపాల్ కమழ்తరుమ్ యమునైనీరొరుపాల్
తుజ్గపత్తిరైయిన్ తూయనీరొరుపాల్ తుకిల్వణ్ణ ప్పొరునల్ నీరొరుపాల్
మజ్గల్ తోయ్ శెన్ని వేజ్గడత్తిల్ ఇలజ్గుమ్ స్వామిపుష్కరిణియిన్
తీర్త్తము మొరుపాల్
ఇజ్గనే పెరుకుమెజ్గళ్ మామునియే! మఞ్జనమాడిమకిழ்న్దే

45. కావేరీసలిలాని కాంచనతటే కల్హారకాశ్మీరభూ
కర్పూరాదిపరిష్కృతాని కలితే కాషాయకాశేయకే ।
కాలాకాంక్షిభి రష్టదిగ్గజముఖై రన్వాస్యతే కింకరైః
కామం కారుణికః కరోతు కరుణాం కాంతోపయంతా మునిః ॥

జీయర్ తిరువడికళే శరణమ్.



# భగవద్రామానుజదర్శనమ్

## ( విశిష్టాద్వైతమ్ )

**ఆదిశేషస్వరూపాయ జ్ఞానాదిగుణరాశయే,**
**సౌమ్యజామాత యోగీంద్రగురువర్యాయ మంగళమ్.**
**మతం రామానుజార్యస్య వైదికోత్తమసమ్మతమ్,**
**హితం చ సర్వలోకానాం సేవధ్వం భక్తిపూర్వకమ్.**

"శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు పరదైవం.ఆ స్వామివిషయంలో చేసే భక్తి, ప్రపత్తులు ఉన్నతమైన ఉపాయాలు. ఆ పరమపురుషుని దర్శించి, సర్వవిధకైంకర్యాలను చేసి, ఆ స్వామిని మెప్పించి, ఆయన ఆనందాన్ని చూచి ఆనందించడం గొప్ప ఫలం" అని శాస్త్రాలలో చెప్పబడింది.

శాస్త్రాలన్నిటిలో గొప్ప శాస్త్రం వేదం. వైదికులందరు వేదాన్ని ముఖ్య ప్రమాణంగా అంగీకరించి, తమ తమ సిద్ధాంతాలను స్థాపించారు. అటువంటి వేదంలో, పూర్వం తెలిపిన రీతిలో, శ్రియఃపతి అయిన నారాయణునకు పరత్వం, భక్తి ప్రపత్తులకు పరమోపాయత్వం, భగవదనుభవ కైంకర్యాలకు పరమ పురుషార్థత్వం స్పష్టంగా చెప్పబడింది. ఈ వేదం నిన్నకాని, ఈనాడుకాని ఏర్పడిన ప్రమాణం కాదు. అది అనాది. ఏ పురుషునిచేత నిర్మింపబడినది కాదు. ఈ విషయం వైదికులందరిచేత అంగీకరింపబడింది. అటువంటి వేదంలో ఈ తత్త్వహితపురుషార్థాలు సుస్పష్టంగా చెప్పబడినందున ఈ సిద్ధాంతంకూడా అనాది అయిన సిద్ధాంతమే. నిన్ననో, మొన్ననో ఎవరి చేతనో నిర్మింపబడినది? అని అనే అవకాశమే లేదు... అయినా, కొన్ని సమయాలలో వాటిలో చెప్పబడే అర్థవిశేషాలు కూడా మనవంటివారు తెలిసికోలేని విధంగా మరగుపడిపోయాయి. ఆ విధంగా వేదవేదాంతార్థాలు మరగుపడిన కాలంలో, మహానుభావులు కొందరు అవతరించి, వాటిని మళ్ళీ వెలుగులోకి తెచ్చారు. ఆ క్రమంలోనే మన ఆచార్యసార్వభౌములైన భగవద్రామానుజులు వైదికసిద్ధాంతం ఒకవిధంగా మరగుపడి పోయినపుడు అవతరించి, అందులో ఉండే అర్థవిశేషాలను తాము రచించిన శ్రీభాష్యం మొదలైన గ్రంథాలద్వారా, తాము పలికిన ఉపదేశాలద్వారా లోకంలో ప్రకాశింప జేశారు.

అందువల్లనే మన సిద్ధాంతానికి "భగవద్రామానుజ దర్శనమ్" (ఎమ్బెరుమానార్ దర్శనమ్) అనే ప్రసిద్ధి ఏర్పడింది.

భగవానుడైన శ్రీమన్నారాయణుడు బుద్ధుని రూపంలో అవతరించాడు. అతడు లోకాన్ని నిర్వహించేటపుడు పలు అవతారాలను ఎత్తాడు ఆ నారాయణుడే బుద్ధుని రూపంలో అవతరించి, "వేదం ప్రమాణం కాదు, అందులో ఉపదేశింప బడినవి అనుష్ఠించదగినవి కావు" అని ప్రచారం చేశాడని పురాణాదులవల్ల తెలుస్తున్నది. ఆ బుద్ధునకు – వైభాషికుడు, సౌత్రాంతికుడు, యోగాచారుడు, మాధ్యమికుడు – అని నలుగురు శిష్యులు ఉండేవారు... బుద్ధుని ఉపదేశం పూర్తిగా మాధ్యమికునిలో బాగా ఫలించిందని చెప్పవచ్చు. అతని మతంలో – "ఏమీ లేదు, అంతా శూన్యం" అనేదే ముఖ్యమైన వాదం. అందువల్ల "శూన్యమే తత్త్వం" అని అనేవాడు మాధ్యమికుడు. ఆ మాధ్యమికుని పక్షం వ్యాసభగవానునిచే నిర్మింపబడిన బ్రహ్మసూత్రాలలో ప్రస్తావింపబడి, ఖండింపబడింది. ఇది వైదికమతాలన్నీ ఒప్పుకొన్న విషయం. మాద్యమికుడు చెప్పే మతం, యుక్తులు వినేవారికి వినాలని అనిపించే టట్లుంటాయి.

అతనిని చూచి కొందరు "ఏమీ లేదు, అంతా శూన్యమ్" అని నీవు అంటున్నావే. ఆ విధంగా చెప్పడానికి నీకు ఆధారం ఏమి? ఎవడైనా తగిన ఆధారాన్ని చూపించికదా, తన సిద్ధాంతాన్ని స్థాపించాలి నీవు సర్వం శూన్య మనడానికి ఏది ఆధారం – ఏది యుక్తి?" అని అడిగినపుడు, "ఒక వస్తువు ఉన్నదని చెప్పేవారే ఆధారంతో, యుక్తితో దానిని చూపించాలి. లేదని అనడానికి ఏ ఆధారం అక్కర లేదు. యుక్తికూడా అవసరం లేదు" అని అతడంటాడు. ఇటువంటి మతం లోకంలో అంతటా బాగా ప్రచారాన్ని పొందిన కాలం ఆదిశంకరుల కాలమని తెలుస్తున్నది శంకరులు రచించిన ఉపనిషద్భాష్యం, సూత్రభాష్యం, గీతాభాష్యం అనే గ్రంథాలను జాగ్రత్తగా ఎవరైనా గమనిస్తే, మాధ్యమికుని వాదాన్ని వారు పలు సందర్భాలలో ఖండించడం, అద్వైతమతాన్ని స్థాపించడం స్పష్టంగా కనిపిస్తుంది. ఆ విషయాన్ని ముందు సంగ్రహంగా చూద్దాం.

సర్వం శూన్యమని వాదించే మాధ్యమికుని చూచి, శంకరులు ఈ విధంగా అడిగారు "లోకంలో పలు పదార్థాలున్నాయి. వాటిని లోకంలో ఉండేవారు

చూస్తున్నారు." వీడు మానవుడు, ఇది రత్నం, ఇది చెరువు, ఇది వీథి, ఇది కోవెల?" అని తెలుస్తున్నది. మరి, నీవు ఏమీ లేదని అంటున్నావే! లోకంలో పలు పదార్థాలు కనబడుతున్నాయే! వాటిని నీ మతంలో ఏ విధంగా నిర్వహిస్తావు– ఆ అనుభవాన్ని ఏవిధంగా నిరూపిస్తావు?" అని మాధ్యమికుని శంకరులడిగారు.

దానికి మాధ్యమికుడు "వస్తువు ఉన్నా ఉందని తోచవచ్చు. లేకపోయినా ఉందని తోచవచ్చు. కనిపించడంకోసం? అని అంటూ ఒక వస్తువు తప్పక ఉండాలి? అనే నిశ్చయం లేదు. అయితే, మరి కనిపిస్తున్నదే! అంటే, వస్తువు ఉన్నా కనిపించవచ్చు. లేకపోయినా కనిపించవచ్చు. ఉదాహరణకు – ఒక చోట తాడు ఉన్నది. అది భ్రమవల్ల పాముగా తోస్తున్నది. ఇంకొక చోట ముత్యపు చిప్ప ఉన్నది. భ్రమవల్ల అది వెండివలె తోస్తున్నది. అయితే, అక్కడ పాము ఉన్నదా – వెండి ఉన్నదా – అని అంటే లేదుకదా! అందువల్ల ఉండే వస్తువే కనిపించాలనే నియమం లేదు. లేని వస్తువుకూడా ఉన్నదని తోచవచ్చు – అని అంటాము" అని అతడు బదులిచ్చాడు.

అపుడతనిని చూచి శంకరులు "జగత్తు లేదు, నిజంగా లేకుండానే ఉన్నా, దానిని మనం అంగీకరిస్తున్నాము. అయితే, ఇక్కడ గమనించవలసిన విషయమేమంటే, తాడు ఉండే చోటనే పాము ఉన్నదని తోస్తున్నది. ముత్యపు చిప్ప ఉండే చోటనే వెండి ఉన్నదని తోస్తున్నది. ఇవి లేని చోట ఉందని తోచడం లేదు. తాడు ఉన్నచోటనేకదా పాము ఉన్నదని తోస్తున్నది. ముత్యపు. చిప్ప ఉండేచోటనేకదా వెండి ఉన్నదని తోస్తున్నది వాటి స్ఫురణానికి తాడు, ముత్యపు చిప్ప – అనే పదార్థాలు (ఆధారంగా) అధిష్ఠానంగా ఉన్నాయి... తాడు లేని చోట అక్కడ పాము ఉన్నదని తోచదు.వాస్తవానికి ముత్యపు చిప్పే లేకపోతే వెండి ఉన్నదని తోచదు. తాడు, పాము ఉండే చోట్లలోనే పాము. అని, వెండి అని తోస్తున్నది.అందువల్ల తాడు పామువంటి అధిష్ఠానమనే ఒక వస్తువును తప్పక అంగీకరించి తీరాలి. ఆ అధిష్ఠానమే బ్రహ్మం. ఆ బ్రహ్మాన్ని సత్యమని ఒప్పుకోవాలి. నీవు జగత్తు లేదని అన్నట్లే, నేనుకూడా లేదనే అంగీకరిస్తాను. అధిష్ఠానమైన బ్రహ్మంలో జగత్తు వాస్తవంగా లేదు. భ్రమవల్ల ఉందని తోస్తున్నది, అంతే "అని మాధ్యమికుని మతాన్ని ఖండించి, శంకరులు తమ మతమైన అద్వైతాన్ని

స్థాపించారు. వారి గ్రంథా లలో బహదారణ్య కోపనిషత్ వ్యాఖ్యానాన్ని పరిశీలిస్తే, మాధ్యమికునకు, ఆదిశంకరులకు మధ్య మాటీమాటికి జరిగే పలు వాదాలను, సర్వశూన్యవాది అయిన మాధ్యమికుని మతం ఖండింపబడి, అధిష్ఠానమనే వస్తువు ఒకటి ఉన్నది – అని స్థాపింపబడడాన్ని స్పష్టంగా చూడవచ్చు.

మాధ్యమికునకు, ఆదిశంకరులకు మధ్య ఏ విధంగా వాదం జరిగిందో, అదే రీతిలో భగవద్రామానుజులకు ,ఆదిశంకరులకు మధ్యకూడా వాదం జరిగింది. ఏ విధంగా – అంటే, తాడు లేని చోట పాము ఉన్నదని తోచడం లేదు. తాడు ఉండే చోటే పాము ఉన్నదని తోస్తున్నది. అందువల్ల తాడు అనేది ఒక సత్యమైన వస్తువని అంగీకరించాలి – అని అన్నట్లే, ఆ విధంగానే, బ్రహ్మమనే అధిష్ఠానవస్తువును (ఆధారంగా ఉండే వస్తువును) ఒప్పుకోవాలి – అని శ్రీరామానుజులంటారు... బ్రహ్మంలో జగత్తు అసత్యంగా భాసిస్తున్నదని శంకరులు చెప్పిన విషయాన్నిగూర్చి వారితో శ్రీరామానుజులు వాదించి, జగత్తును కూడా సత్యమైన వస్తువుగా అంగీకరించాలనే సిద్ధాంతాన్ని శంకరులు వాదించిన దారిలోనే వాదించి, అంగీకరించేటట్లు చేశారు. ఇది చాలా పెద్ద వాదం. దీనిని వివరించే గ్రంథాలు అనేకం ఉన్నాయి. దీనిని బాగా అర్థం చేసికోవాలంటే ఇంకా కొన్ని ప్రశ్నలు ఎదురవుతాయి. వాటికి తగిన సమాధానాలను తెలియాలంటే శ్రీభాష్యాది గ్రంథాలను ఆచార్య సన్నిధిలో అధికరించాలి. అపుడే శ్రీరామానుజుల మేథావిలాసం, వారు మనకు చేసిన ఉపకారం ఎంత ఆశ్చర్యకరమైనవో తెలుస్తుంది. అటువంటి శ్రీరామానుజుల వాదాలలో కొన్ని ఇపుడు సంగ్రహంగా ప్రస్తావింపబడు తున్నాయి.

తాడును చూచినపుడు, అది పాము అని తోస్తున్నది. తాడు లేకపోతే ఆ విధంగా తోచదు. అందువల్ల తాడును తప్పక అంగీకరించాలని? అని అనేటట్లే, “వేరొక చోట పాము అనే వస్తువు లేకపోతే (వాస్తవంలో పాము అనే వస్తువే లేకపోతే). తాడు ఉండే చోట పాము ఉన్నదనే భ్రాంతి కలదు కదా!” అని శ్రీరామానుజులు శంకరులను ప్రశ్నించారు. ఆ విధంగానే “వెండి అనే ఒక వస్తువు వాస్తవానికి లేకపోతే ముత్యపుచిప్పను చూచినపుడు, అది వెండి? అనే భ్రాంతి కలుగుతుందా? అనికూడా శ్రీరామానుజుల ప్రశ్న. మీరు మాధ్యమికుని

చూచి ఏమని ప్రశ్నించారు? "తాడు అనేదే లేకపోతే పాము అనే భ్రాంతి కలుగుతుందా? కలుగదుకదా అనికదా!" అధిష్ఠానమనే వస్తువును మీరు ఒప్పుకొన్నారుకదా! ఆవిధంగా అంగీకరించిన మిమ్ములను చూచి నేను ఒకటి ప్రశ్నిస్తున్నాను. ఎక్కడా కూడా పాము అనే వస్తువు కాని, వెండి అనే వస్తువు కాని లేదని అనుకొందాం. అపుడు తాడును చూచిపపుడు పాము?" అని ముత్యపు చిప్పను చూచినపుడు, అది వెండి? అని భ్రాంతి కలుగుతుందా? అధిష్ఠానమనే వస్తువు తప్పక ఉండి ఉండాలని మాధ్యమికునితో మీరు వాదించినట్లే, ఏ వస్తువుగా భ్రాంతి కలుగుతున్నదో, ఏ వస్తువులో భ్రాంతి కలుగుతున్నదో, అవి రెండూ వేరొక చోట వాస్తవానికి తప్పక ఉండి ఉండాలి. లేకపోతే ఆ భ్రాంతి ఏర్పడదుకదా! ఈ విధంగా చూచినపుడు జగత్తు సత్యమైనపుడే మీరు చెప్పే అర్థనిర్వాహం కుదురుతుంది తప్ప, జగత్తు సత్యం కానపుడు, అది భ్రాంతివల్ల తోస్తున్నది? అనే అవకాశం లేదు" ఈవిధమైన చక్కని యుక్తులను శంకరులతో పల్కి, జగత్తు సత్యమని అంగీకరించేటట్లు శ్రీరామానుజులు చేశారు. ఇదే భగవద్రామానుజుల వాదసరళి. మాధ్యమికునకు వేదం ప్రమాణం కాదు. వేదంతో అతడు చెప్పవలసిన విషయంకూడా ఏదీ లేదు. శంకరులు వైదికులై నందున వేదాన్ని పురస్కరించుకొని తమ సిద్ధాంతాన్ని స్థాపించవలసి ఉన్నది. అద్వైతం తత్త్వమని పలికి, వేదం ప్రమాణమని అంగీకరించి, అద్వైతాన్ని వారు స్థాపించేటపుడు వారికి కొన్ని చిక్కులు ఎదురయ్యాయి. శంకరులు వైదికులు భగవద్రామానుజులు వైదికులు... వీరిద్దరు వైదికులు కనుక, వేదం మొదలైన శాస్త్రాలను ఆధారంగా చేసికొని తమ సిద్ధాంతాలను స్థాపించవలసి ఉన్నది. మాధ్యమికుడు వైదికుడు కాడు. కనుక అతడు వేదాన్ని ప్రమాణంగా చూపించనక్కరలేదు వేదాన్ని ప్రమాణంగా చూపించి, ఆ వేదవాక్యాల అర్థాలను తెలియజేసి, అద్వైతసిద్ధాంతమే ఆ వేదవాక్యాలలో తెలుపబడిందని శంకరులు నిరూపించాలి. విశిష్టాద్వైతసిద్ధాంతమే వేద వాక్యాలలో తెలుపబడిందని శ్రీరామానుజులు నిరూపించాలి. ఈ క్రమంలో వీరిద్దరి మధ్య జరిగిన వాదప్రతివాదాలను మనం గమనిస్తే వేదవాక్యాలకు వీరిద్దరు ఏ యే విధంగా అర్థనిర్ణయం చేశారో తెలుస్తుంది. భగవద్రామానుజులు వేదవాక్యాలను వివరించిన శైలి చాలా ఆశ్చర్యకరమైనది, అందమైనది కూడా.

మనం అందరం మన భాగ్యవశంచేత భగవద్రామానుజదర్శనానికి చెందినవారం అయ్యాము. శ్రీరామానుజులవతరించి విశిష్టాద్వైతసిద్ధాంతాను గుణంగా తమ గ్రంథాలను, ఉపదేశసూక్తులను అనుగ్రహించారు. వారికి తరువాత ఈ సంతతిలో కొందరు మహనీయులు అవతరించి, ఆ అర్థ విశేషాలను యథోచితంగా ఈనాటికీ ఉపదేశిస్తున్నారు. అయితే, ఒక కొరత మాత్రం ఉన్నది. అది ఏమంటే – కాలక్రమంలో ఆ గ్రంథాలలోని అర్థాలను తప్పక తెలిసికోవలసి ఉండగా, వాటిని మనం విడచిపెట్టాం. దీనికొక ఉదాహరణాన్ని చెప్పవచ్చు. చంద్రుడు పదహారు కళలతో ప్రకాశిస్తాడు. అతడు నగరాలలో ప్రకాశించేటపుడు ఆ చంద్రుని ఉదయాన్ని చూచి పలువురు ఆనందిస్తారు.అడవిలో చంద్రుడు ప్రకాశిస్తే, అక్కడ అతని వెన్నెలను చూచి ఆనందించేవారెవరూ ఉండరు. అరణ్యాలలో ప్రకాశించే చంద్రునివలె ఇపుడు శ్రీరామానుజుల శ్రీభాష్యాది గ్రంథాలున్నాయి". మన సమాజంలో అందరం ఆ యతిరాజచంద్రుని గూర్చి తప్పక తెలిసికోవాలి, ఆ తరువాత ఎంత సాధ్యమైతే అంత వారి గ్రంథాలలోని విషయాలను స్వాధీనం చేసికోవాలి" – అనే అభిప్రాయం ఎవరికీ కలగడం లేదు. తెలిసికోవాలనే ఆసక్తి నూరుమందిలో ఒక్కరికికూడా లేకపోవడం కాదు, కోటిమందిలో ఒక్కరికి కూడా లేదని అనాలి. ఈ అపూర్వమైన సంపదను మనం కోలుపోతున్నామనే చింతకూడా మనకు కలగడం లేదు. ఈ విషయాన్ని మనం గ్రహించి, మన సంప్రదాయానికి, సిద్ధాంతానికి చెందిన గ్రంథాలను, ఉపదేశాలను తెలిసికోవడానికి ముందుకు రావాలి. శ్రీవైష్ణవసమాజంలో ఏర్పడిన ఈ కొరతను తప్పక అందరు గ్రహించాలి.

వేదవాక్యాలకు శంకరులు అర్థనిర్ణయం చేశారు. శ్రీరామానుజులు అర్థ నిర్ణయం చేశారు. లోకంలో కొంతమందితో మనం కలసి వర్తిస్తాము. వారితో మనకు సంబంధం ఏర్పడుతుంది అపుడు కొందరు ఈ విధంగా అనవచ్చు. "శంకరులకు జ్ఞానం అధికం, రామానుజులకు హృదయం విశాలం" – అని వారనచ్చు అపుడు, "శ్రీరామానుజులకు హృదయం విశాలమైతే, జ్ఞానం గొప్పది కాదా!" – అని నా వంటివారికి తోచవచ్చు. అందువల్ల శంకరుల జ్ఞానాన్ని, శ్రీరామానుజుల జ్ఞానాన్ని మనం తటస్థ బుద్ధితో చూడాలి.

మన పూర్వాచార్యపరంపరాహారంలో మధ్యమణిగా వెలిగే భగవద్రామానుజుల మేథావిలాసం అనితరసాధారణమైనది. అద్భుతమైన, అందమైన వారి శ్రుతివాక్యసమన్వయరీతిని కొంచెం గమనించి చూద్దాం. “తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే, యః శ్రుతిస్మృతిసూత్రాణా మంతర్జ్వర మశీశమత్” అనేది ఒక ప్రసిద్ధశ్లోకం. వేదవాక్యాలకు, స్మృతులకు, బ్రహ్మసూత్రాలకు మిగిలినవారి వాదాలవల్ల కలిగిన కష్టాన్ని శ్రీరామానుజులనే మహాయోగి అవతరించి సరి అయిన రీతిలో సమన్వయించి అర్థాన్ని చెప్పి తీర్చారు – అని దీని భావం.

ఈ మాట అభిమానంతో, పక్షపాతంతో చెప్పే మాట కాదు. నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలో నారాయణపరత్వాన్ని స్థాపించేటపుడు కొన్ని సందర్భాలలో వారు ఆ పరత్వాన్ని చాలా స్పష్టంగా, అందంగా తెలిపారు. “పేశనిన్ఱ శివనుక్కుమ్ పిరమన్ తనక్కుమ్ పిఱర్ క్కుమ్ నాయకన్ అవనే, కపాలనన్మోక్కత్తు క్కణ్డుకొణ్మిన్!” తిరువాయ్ మొళి – (4–3–10) అనేది అందులో ఒకటి. దీని అర్థాన్ని కొంచెం వివరిస్తాను.

లోకంలో బ్రహ్మ, విష్ణువు, శివుడు – అని ముగ్గురు దైవాలు ప్రధానంగా లెక్కింపబడుతున్నారు. ఈ ముగ్గురు దైవాలలో ఒకడైన బ్రహ్మకు మొదట అయిదు తలలు ఉండేవి.బ్రహ్మకుమారుడైన శివునకు కూడా అయిదు తలలే. బ్రహ్మకుండే అయిదు తలలో ఒక తలను శివుడు తన గోటితో గిల్లివేశాడు. తండ్రి తలను ఖండించిన పాపంకారణంగా ఆ తల శివుని చేతికి అంటుకొనిపోయింది. అందువల్ల అతడు కపాలి అయ్యాడు. ఆ బాధనుండి విముక్తిని పొందడంకోసం అతడు శ్రీమన్నారాయణుని అర్థించ వలసివచ్చింది. భగవదనుగ్రహంవల్ల శివుని చేతినుండి ఆ కపాలం వీడిపోయింది. శివునకు కలిగిన ఆ కష్టం తీరింది. అతడు స్వస్థుడయ్యాడు.

ఇపుడీ ముగ్గురు దైవాలను గమనిస్తే, ఒక దైవం – తలను కోలుపోయిన దైవం, ఇంకొక దైవం – ఆ తల చేతికి అంటుకొన్నందున కపాలియై బాధపడిన దైవం. మరి ఒక దైవం – ఆ కష్టాన్ని తీర్చిన దైవం. ఈ ముగ్గురు దైవాలలో పరుడెవడో మీరే చెప్పండి. – అని పైసూక్తిలో ఆళ్వారు లంటున్నారు. ఈ విధంగా

ఆళ్వారులు చేసే ఉపదేశాలన్నీ ప్రతివాదులుకూడా వెంటనే అంగీకరించేటట్లు స్పష్టంగా, అందంగా ఉంటాయి.

ఇపుడు శ్రుతులకు అర్థం చెప్పేటపుడు శంకరులు చెప్పే విధానాన్ని, శ్రీరామానుజులు చెప్పే విధానాన్ని కొంచెం చూద్దాం. విశిష్టాద్వైతం వేదతాత్పర్య మనే విషయాన్ని అందరు తెలిసేటట్లు శ్రీరామానుజులు చెప్పే విధానాన్ని గమనిద్దాం ముందు అద్వైతమంటే ఏమిటో తెలియకపోతే విశిష్టాద్వైతమంటే ఏమిటో తెలియదు... శ్రీరామానుజుల గ్రంథాలను అధ్యయనం చేస్తే అద్వైతమంటే ఏమిటోకూడా స్పష్టపడుతుంది. అద్వైత గ్రంథాలను గమనించినపుడు కంటేకూడా శ్రీరామానుజుల గ్రంథాలను గమనించినపుడు అద్వైతమత స్వరూపం మిక్కిలి స్పష్టపడుతుంది.

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనేది ఛాందోగ్యోపనిషత్తులోని ఒక వాక్యం. సద్విద్యలో ఆచార్యుడు శిష్యునకు ఉపదేశించేటపుడు మొదట పలికిన వాక్యమిది. ఈ వాక్యానికి శంకరులు, అదేవిధంగా శ్రీరామానుజులు అర్థం చెప్పే రీతులను చూద్దాం. పూర్వం ప్రస్తావించిన నమ్మాళ్వార్ల సూక్తివల్ల యథార్థం వ్యక్తమైనట్లే, శ్రీరామానుజుల వ్యాఖ్యానంవల్ల కూడా యథార్థం. వ్యక్తమవుతుంది – అనే విషయాన్నికూడా గమనిద్దాం.

ఇపుడు వాదవివరమేమంటే –

మాధ్యమికుని మతంలో – బ్రహ్మం లేదు, జగత్తు లేదు.

ఆదిశంకరుల వాదంలో – బ్రహ్మం ఉన్నది, జగత్తు లేదు.

శ్రీరామానుజుల వాదంలో – బ్రహ్మం ఉన్నది, జగత్తుకూడా ఉన్నది, అంతే కాదు, బ్రహ్మానికి దివ్యమంగళవిగ్రహం ఉన్నది, బ్రహ్మానికి శరీరంగా చేతనాచేతనాలున్నాయి.ఆ బ్రహ్మం నారాయణుడే – అని.

శంకరుల వాదం – "బ్రహ్మం ఉన్నదని అంగీకరిస్తాము. అయితే, ఆ బ్రహ్మానికి గుణాలు లేవు, రూపం లేదు, అచిత్తు అనే తత్త్వం లేదు, చిత్తు అనే తత్త్వం లేదు, బ్రహ్మం శుద్ధమైనది" అని దీని భావమేమి – "బ్రహ్మం మాత్రం ఉన్నది. కనుక అది శుద్ధం" – అని.

చేతులు, కాళ్ళు మొదలైన అవయవాలతో కూడిన పిండం శరీరం. ఇది అచిత్. ఆవిధంగానే ఘటం, వస్త్రం మొదలైనవి అచేతన పదార్థాలు. అచేతనా లంటే – జ్ఞానం లేని వస్తువులు. బ్రహ్మం కంటే విసజాతీయతత్త్వమైన అచిత్తు అనేది లేదు. బ్రహ్మంలో జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు లేవు. బ్రహ్మం మాత్రం ఉన్నది. అది శుద్ధం – అనేది అద్వైతుల వాదం.

భగవద్రామానుజులు – బ్రహ్మంతో పోలిన జీవుడున్నాడు. అచిత్తు ఉన్నది. బ్రహ్మంతద్విశిష్ట మైనది? అని అంటారు. ఇదే ప్రధానంగా రెండు సిద్ధాంతాల మధ్య భేదం. విశిష్టమంటే కూడి ఉన్నది అని అర్థం. బ్రహ్మం జీవాత్మతో, అచేతనతత్త్వంతో, కల్యాణగుణాలతో, దివ్యమంగళ విగ్రహంతో కూడి ఉన్నది– అని శ్రీరామానుజుల వాదం. బ్రహ్మానికి గుణాలు లేవు. విగ్రహం లేదు. దానితో కలసి ఉన్నట్లు చెప్పే అచిత్తు, జీవుడుకూడా లేరు? అని అద్వైతుల వాదం.

అద్వైతశబ్దానికి "ద్వయోః భావః ద్వితా, ద్వితైవ ద్వైతమ్, న అద్వైతమ్ అద్వైతమ్" అని వ్యుత్పత్తి. రెండవ వస్తువనేది ఏదీ లేదు – అని దీని అర్థం. అచిత్తు లేదు, జీవుడు లేడు, గుణాలు లేవు, బ్రహ్మం మాత్రం ఉన్నది. అదే సత్యం. అదే తత్త్వం, అదే అద్వైతశబ్దార్థం.

బ్రహ్మం తనకంటే విసజాతీయమైన అచిత్తుతో కలసి ఉన్నది. సజాతీయమైన జీవతత్త్వంతో కలసి ఉన్నది. జ్ఞానం, శక్తి మొదలైన గుణాలను కలిగి ఉన్నది. ఆ బ్రహ్మానికి అనురూపమైన, గొప్ప దివ్యమంగళ విగ్రహం ఉన్నది – అని చెప్పే మతం విశిష్టాద్వైతం. గుణాలతో, చేతనా చేతనాలతో, దివ్యమంగళవిగ్రహంతో కూడిన వస్తువు ఒకటి ఉన్నది. ఆ వస్తువుతో సాటి వచ్చేది ఏదీ లేదు – అనేదే విశిష్టాద్వైతశబ్దానికి అర్థం. రెండు సిద్ధాంతాల మధ్య ప్రధానమైన భేదం ఇదే.

"బ్రహ్మం మాత్రమే ఉన్నది, వేరేమీ లేదు" అనే వాదానికి ప్రమాణంగా శంకరులు "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" – అనే శ్రుతివాక్యాన్ని ప్రమాణంగా చూపించారు. భగవద్రామానుజులు కూడా ఈ వాక్యాన్నే విశిష్టద్వైతసిద్ధాంతానికి ప్రమాణంగా గ్రహించారు. ఇందులో విశిష్టమైన బ్రహ్మం తెలుపబడుతున్నది, శుద్ధబ్రహ్మం చెప్పబడలేదు, ఆ విశిష్టబ్రహ్మం నారాయణుడే, అతడు అద్వితీయుడు. సాటి, మేటి లేనివాడు ఈ విషయన్ని

సదేవేత్యాది శ్రుతి తెలుపుతున్నది – అని శ్రీరామానుజు లన్నారు. భగవద్రామానుజుల ఈ అర్థప్రతిపాదనశైలిని కొంచెం చూద్దాం.

పూర్వం ఉదాహరించిన వేదాంతవాక్యంలో, పుత్రుని చూచి తండ్రి "సౌమ్య" అని సంబోధించి, "ఇదం పూర్వస్మిన్ కాల సదేవ ఆసీత్, ఏకమే వాసీత్, అద్వితీయమ్ ఆసీత్" అని అంటున్నాడు. ఇక్కడ వేదాంతవాక్యం లోని "అగ్రే" అనే పదానికి "పూర్వస్మిన్ కాలే" సృష్టికాలంలో? అని అర్థం. ఇపుడు శ్రీరామానుజులు శంకరులను అడుగుతున్నారు

ఇదం సర్వం – ఇది అంతా, అగ్రే సృష్టికి ముందున్న కాలంలో, సదేవ ఆసీత్ – సత్ అని చెప్పబడే వస్తువుగా మాత్రమే ఉన్నది, ఏకమేవాసీత్ – ఒకటిగానే ఉన్నది, అద్వితీయమ్? అనికదా వేదాంతవాక్య మున్నది! బ్రహ్మం మాత్రం ఉన్నది, దానికంటే విసజాతీయమైనదని చెప్పబడే అచిత్తు లేదు – అనికదా మీరంటున్నారు. ఈ సష్టికి ముందున్న కాలంలో సత్ అని చెప్పబడే వస్తువుగా బ్రహ్మం ఉన్నది – అని ఈ శ్రుతివాక్యంవల్ల తెలుస్తున్నది. అయితే, సృష్టికి మందున్న కాలం అనేది ఒకటి ఉన్నదా? లేదా? కాలాన్ని పురస్కరించుకొని చెప్పే శ్రుతివాక్యం ఉన్నదా? లేదా? అని శ్రీరామానుజులడిగారు. కాలమనేది ఒక తత్త్వం. అది అచిత్తత్త్వం. అది జ్ఞానశూన్యమైనది, అది. చైతన్యాన్ని కల జీవునివంటిది? అని చెప్పడానికి వీలు లేదు. భగవానునివంటిది? అని చెప్ప వీలు లేదు. "అగ్రే సదేవ ఆసీత్" సష్టికి ముందున్న కాలంలో, సచ్ఛబ్దవాచ్యమైన బ్రహ్మంమాత్రమే ఉన్నదని అంటున్నారే! కాని, శ్రుతివల్ల అపుడు కాలమనేది ఒకటి ఉన్నదని. అపుడు బ్రహ్మం ఉన్నదని తెలుస్తున్నది. ఆ కాలమనేది బ్రహ్మం కంటే విసజాతీయ మైనదా? లేక, బ్రహ్మసజాతీయమా? అనే విషయాన్ని మనం విచారించాలి. కాలం జ్ఞానశూన్యమైన అచిత్తత్త్వం. అది బ్రహ్మం కంటే విసజాతీయ మైనది. విసజాతీయతత్త్వమైన కాలం ఉండేటపుడేకదా సచ్ఛబ్దవాచ్యమైన బ్రహ్మం ఉన్నది – అని తెలుస్తున్నది. మరి, బ్రహ్మంకంటే విసజాతీయమైన వస్తువు ఏదీ లేదని మీరు అంటున్నారే! అదే తత్త్వమైతే అపుడు "అగ్రే" అనే పదం మరి దేనిని తెలుపుతున్నది – అని శ్రీరామానుజులడిగారు.

అద్వైతం ఎంతో వ్యాపించింది. దానినిగూర్చి వాదప్రతివాదాలు జరుగుతున్నాయి, ఎన్నో గ్రంథాలు రచింపబడ్డాయి, ఈనాటికీ రచింపబడు

తున్నాయి. ఈ ప్రశ్నకు తప్తి కలిగే విధంగా సమాధానం ఇప్పటివరకు ఎక్కడైనా చెప్పబడిందా – అని గమనించి చూడాలి. అద్వైతులు ఏమని అంటున్నారు? విశిష్టాద్వైతులు ఏమని అంటున్నారు? ఏది మన మనసుకు తప్తికరంగా ఉన్నది – అనేది మొదట గమనించాలి.

సృష్టికి ముందు చిత్ ఉన్నది. కాలం ఉన్నది. మరి, సష్టికి ముందు బ్రహ్మం కంటే ఇంకొకటి లేదని పలికే మీ మతంలో ఏ విధంగా పై శ్రుతి వాక్యానికి అర్థాన్ని తెలుపుతారు – అని శంకరులను చూచి శ్రీరామానుజుల ప్రశ్న.

ఇపుడు కాలమనే తత్త్వాన్ని అద్వైతులు అంగీకరించవలసి నట్లయింది కదా! కాదంటే శ్రుతివాక్యంలోని "అగ్రే" అనే పదానికి అర్థం చెప్పడంలో విరోధం వస్తుంది.బ్రహ్మం అనేది, కాలం అనేది ఒకటే? అనే వీలు లేదు. వేరు వేరు – అని అనాలి. కాలం, బ్రహ్మం ఒకటే. కాలమనేది బ్రహ్మస్వరూపమే కానీ. బ్రహ్మం జడమైనదే కానీ – అని అనవచ్చు. అయితే, ఆ రెండు ఒకటే ఆని చెప్పడానికి వీలులేదే! ఇక, బ్రహ్మంవలె కాలమనేది కూడా ఉందని అంటే, తత్త్వాలను రెండిటిని ఒప్పుకొన్నట్లవుతుంది. అపుడు అద్వైతసిద్ధాంతం పూర్తిగా వీగిపోతుంది.

ఇపుడిక సష్టికి ముందు జీవాత్మలు పలువురు ఉన్నారని శ్రీరామానుజులు నిరూపిస్తున్నారు. బ్రహ్మంతో సజాతీయమైనవారు, బ్రహ్మం కంటే భిన్నులైన జీవులు పలువురు, సృష్టికాలంలోవలె, సష్టికి ముందుకూడా ఉన్నారనే విషయాన్ని శ్రీరామానుజులు చాలా అందంగా నిరూపిస్తున్నారు.

మహాప్రళయకాలంలోను, సృష్టికాలంలోను ఏ తత్త్వం ఉన్నదో, అదే సత్యం. ఒక కాలంలో ఉండి వేరొక కాలంలో లేనిది అసత్యం. అది మిథ్య– అనేది అద్వైతుల వాదం.

భగవద్రామానుజులు "మహాప్రళయకాలంలోకూడా అచిత్తత్త్వంఉన్నది, జీవతత్త్వం ఉన్నది, బ్రహ్మతత్త్వం ఉన్నది. ఆ విధంగానే, సృష్టికాలంలోకూడా అచిత్తత్త్వం ఉన్నది, జీవులనేకులున్నారు, బ్రహ్మంకూడా ఉన్నది. అన్ని కాలాలలోను ఈ మూడు తత్త్వాలున్నాయి. బ్రహ్మంవలె అన్నీ సత్యం – అని స్థాపిస్తున్నారు.

సృష్టికి ముందు కాలమనే తత్త్వమున్నదని "అగ్రే" అనే పదం ద్వారా తెలిసేటట్లే, సష్టికి ముందు జీవులనేకులున్నారని శాస్త్రాలవల్ల తెలుస్తున్నది. దానినిబట్టి ముందు ఉదాహరించిన శ్రుతివాక్యంలోని "ఏకమ్" అనే శబ్దానికి అర్థం చెప్పాలి. దానికి చక్కని మార్గం చూపారు శ్రీరామానుజులు

..బ్రహ్మమానంలో? నూరు సంవత్సరాల కాలం మహాప్రళయకాలం. కతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం? అనే నాలుగు యుగాలు చతుర్యుగమనబడతాయి. ఇటువంటి చతుర్యుగాలు వేయి అయితే బ్రహ్మకు ఒక పగలు. వేయి చతుర్యుగాల కాలం ఒక రాత్రి. ఈ విధంగా రెండువేల చతుర్యుగాల కాలం అయితే బ్రహ్మకు ఒక దినం. ఇటువంటి దినాలు 365 అయితే బ్రహ్మకు ఒక సంవత్సరం. ఇటువంటి 100 సంవత్సరాల కాలం బ్రహ్మయొక్క ఆయుష్కాలం దీనికి పరమని పేరు. ప్రస్తుతం బ్రహ్మకు 50 సంవత్సరాలు పూర్తి అయి, 51వ సంవత్సరం జరుగుతున్నది. అందువల్లనే సంకల్పం చెప్పేటపుడు "ద్వితీయపరార్థే" అని చెప్పబడుతున్నది. బ్రహ్మ ఆయుష్కాలం కాగానే మహాప్రళయం ఏర్పడుతుంది. ఆ ప్రళయకాలంలో సర్వప్రపంచాల పేర్లు, రూపాలు నశించి, నీటిలో కరగిన ఉప్పువలె, బ్రహ్మంలో లీనమైపోతాయి. "తమః పరే దేవ ఏకీభవతి" అని వేదం ఈ విషయాన్ని తెలిపింది. ఈ ప్రళయకాలం పూర్తి కాగానే భగవానుడు మళ్ళీ సష్టిని ఆరంభిస్తాడు. ప్రళయకాలం బ్రహ్మమానంలో 100 సంవత్సరాలు. తరువాత సష్టి ఆరంభమవుతుంది. సృష్టి ఆరంభకాలంలో భగవానుడు కొందరిని దేవతలుగా, కొందరిని మానవులుగా, కొందరిని పశుపక్ష్యాదులుగా, ఇంకా మరి కొందరిని వక్షగుల్మాదులుగా సష్టిస్తాడు. దేవతల చరిత్రలను మనం విన్నపుడు వారికి సుఖం ఉన్నదని స్పష్టంగా తెలుస్తుంది. మానవులమైన మన చరిత్రలను గమనిస్తే, మనకు సుఖానుభవంతోపాటు దుఃఖానుభవంకూడా ఉన్నదని తెలుస్తున్నది. పశుపక్ష్యాదులకు మనకు కలిగే సుఖానుభవంకూడా కలుగదని తెలుస్తున్నది. వక్షగుల్మాదులకు జ్ఞానవికాసమే స్పష్టంగా లేదు. ఈ విధంగా భగవానుడు సృష్టి ఆరంభకాలంలో దేవతలను సుఖాన్ని పొందేటట్లు, మానవులను సుఖదుఃఖాలను పొందేటట్లు, పశుపక్ష్యాదులను దుఃఖమే పొందేటట్లు, వక్షగుల్మాదులకు జ్ఞానప్రకాశమే లేనట్లు ఎందుకు సృష్టిస్తున్నాడు? ఈ తేడాను భగవానుడు ఎందుకు

చూపిస్తున్నాడు? అందరిని ఒకే విధంగా సృష్టించడానికి ఆ స్వామికి ఏమి అడ్డు? – అని వేదాంతాలలో చర్చింపబడింది. భగవానుడే గీతలో దీనికి స్వయంగా బదులు పలికాడు. వ్యాసభగవానులు కూడా బ్రహ్మసూత్రాలలో దీనిని గూర్చి విచారించారు. దేవతలుగా కొందరిని సృష్టించడానికి కారణం వారి కర్మఫలం. వారి కర్మ ఫలానుసారంగా వారికి దేవశరీరాన్ని భగవానుడిచ్చాడు. ఆ విధంగానే మరి కొందరిని మానవులుగా, ఇంకా కొందరిని పశుపక్ష్యాదులుగా, లతాగుల్మాదులుగా వారి వారి కర్మఫలానుసారంగా సష్టించాడు.

"తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్" అనేది గీతలో భగవానుని సూక్తి. దీనికి ఆచార్యులు ఆశ్చర్యకరంగా వ్యాఖ్యానించారు. ఒక పొలాన్ని బాగా దున్ని వరివిత్తనాలను విత్తి, ఆ పొలంలోకి నీటిని పారించినపుడు వరి మొక్కలు మొలిచి పెరుగుతాయి. ఆ మొక్కలు వరిధాన్యాన్ని ఇస్తాయి. ఆ విధంగానే ఆ పొలంలోనే గోధుమవిత్తనాలను విత్తినపుడు గోధుమమొక్కలు మొలిచి పెరిగి గోధుమధాన్యాన్ని ఇస్తాయి. వరి మొక్కల ఆకులు, ధాన్యం ఒక విధంగా, గోధుమ మొక్కల ఆకులు ధాన్యం ఇంకొక విధంగాఉంటాయి. ఏ మొక్క మొలవాలని అన్నా మన్ను, జలాల సంయోగం కారణమని శాస్త్రంలో చెప్పబడింది. మన్ను, జలాల సంయోగం ఏర్పడినపుడు ఆయా విత్తనాలనుండి ఆయా మొక్కలు మొలిచి పెరుగుతున్నాయి. వరిమొక్కలు ఒక విధంగా, గోధమమొక్కలు ఇంకొక విధంగా మొలవడానికి కారణం? ఆయా విత్తనాలలోని సూక్ష్మం కారణమని శాస్త్రంలో చెప్పబడింది ఏదయినా. ఒక విత్తనం మొలవాలంటే మన్ను, జలం కారణమైనట్లే, ఈశ్వరుడుకూడా కారణమే. వరి మొక్కలు ఒకవిధంగా, గోధుమొక్కలు ఇంకొక విధంగా ఉండడానికి ఆ యా విత్తనాలలోని సూక్ష్మం కారణమైనట్లే, ఆయా జీవుల శరీరాలు దేవతలుగా మానవులుగా, పశుపక్ష్యాదులుగా, లతాగుల్మాదు లుగా ఉండడానికి ఆ యా జీవులు పూర్వం చేసికొన్న కర్మలే కారణం. "తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్", "న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా" ఇత్యాది భగవద్వాక్యాలలో ఈ విధమైన అర్థం సూచింపబడింది. భగవానునకు జీవుల విషయంలో వైషమ్యం కాని, పక్షపాతం కాని లేవు మహాప్రళయకాలం ముగిసి, సష్టి ఆరంభమైన కాలంలో కొందరిని దేవతలుగా,

కొందరిని మానవులుగా, కొందరిని పశుపక్ష్యాదు లుగా, ఇంకా కొందరిని లతాగుల్మాదులుగా భగవానుడు సృష్టించడానికి కారణం? వారి వారి కర్మఫలమే? అని వ్యాసులు స్పష్టంగా తెలిపారు. అందువల్ల భగవానునకు వైషమ్య, నైర్ఘణ్యాలనే దోషాలు లేవు. జీవుల కర్మలననుసరించే సృష్టిస్తాడు – అని తేలింది.

ఇపుడు ఏమని చెప్పవలసి ఉన్నది? అని అంటే, "లోకంలోని పదార్థాలు అన్నీ లయించిన కాలంలో భగవానుడనే తత్త్వం నశించకుండా నిలచి ఉన్నట్లే, జీవాత్మలకుకూడా నాశం లేదు. ఆ యా జీవులు చేసికొన్న కర్మలకు నాశం లేదు. అందువల్లనే మహాప్రళయకాలం ముగిసి, సృష్టి ఆరంభమైనపుడు వారి వారి కర్మలను బట్టి విచిత్రదేహాలను భగవానుడు సృష్టిస్తున్నాడు" – అని ఏర్పడింది. అందువల్ల జీవులు నిత్యులు. ఎప్పుడూ ఉంటారు. "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్" – అని శ్రుతికూడా జీవులనేకులని, నిత్యులని తెలిపింది. కనుక, ప్రళయంలోకూడా జీవులు పలువురున్నారని అంగీకరించాలి. ఆ విధంగా ఉండకపోతే, మళ్ళీ సృష్టించేటపుడు జీవుల శరీరాలు వేరు వేరుగా ,వారి సుఖదుః ఖాలు వేరు వేరుగా కనిపించే లోకసిద్ధమైన విషయాన్ని నిర్వహించడం సాధ్యం కాదు.

ఇపుడేమని తేలింది – అంటే, అన్నీ లయించిన కాలంలో, సృష్టి ఆరంభానికి ముందు కాలమనే, బ్రహ్మం కంటే వేరయిన తత్త్వమొకటి ఉన్నదని ఒప్పుకొన్నట్లే, "అగ్రే" అనే శబ్దాన్ని ఒప్పుకొన్నట్లే, దాని అర్థాన్ని ఒప్పుకొన్నట్లే, అన్నీ లయించినపుడు జీవాత్మలు అనేకులున్నారు, వారి కర్మలున్నాయి? అని ఒప్పుకోవాలసి ఉన్నది. అందువల్లనే విషమమైన, విచిత్రమైన సృష్టిలో భగవానునకు సంబంధం లేదని వేదాంతం నిర్ణయించింది ఈ విధంగా పరమాత్మతో సజాతీయతత్త్వమైన జీవులున్నారు, విసజాతీయ తత్త్వమైన అచేతనాలుకూడా కలసి ఉన్నాయి – అని సిద్ధిస్తున్నది.

సూక్ష్మప్రళయంలో ప్రకతికూడా నిలచి ఉంటుంది. "అజామేకాం లోహిత శుక్లకష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్" అనేది ఒక వేదవాక్యం. ఇక్కడ "అజా" అనే పదం ప్రకతిని తెలుపుతుంది. ప్రళయకాలంలోకూడా ప్రకతి సూక్ష్మమైన తత్త్వంగా ఉన్నది. అయితే, మనం లోకానుభవాన్నిబట్టి గమనించాలి.

ఘటాన్ని కుమ్మరివాడు చేస్తున్నాడు. వస్త్రాన్ని సాలెవాడు నేస్తున్నాడు. ఘటాన్ని చేయడానికి కావలసిన జ్ఞానశక్తులు కుమ్మరి వానికున్నాయి. ఆ విధంగానే, వస్త్రాన్ని నేయడానికి కావలసిన జ్ఞానశక్తులు సాలెవానికున్నాయి. అందువల్ల వారు ఘటాన్ని వస్త్రాన్ని చేస్తున్నారు. ఒకనివల్ల ఒక కార్యం పుడుతున్నదంటే, ఆ కార్యం పుట్టడానికి కావలసిన జ్ఞానశక్తులు అతనికి ఉన్నాయని అంగీకరించాలి. ఈ ప్రపంచమనే కార్యాన్ని భగవానుడు చేస్తున్నాడు కదా! అపుడు దానిని సష్టించడానికి ఆవశ్యకమైన జ్ఞానశక్తులు అతనికి ఉన్నాయని మనం తప్పక ఒప్పుకోవాలికదా!

"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" – అని అంటూ శ్రుతి భగవానునకు జ్ఞానం ఉన్నది, శక్తి ఉన్నది, బలం ఉన్నది, నియమించే శక్తి ఉన్నది – అని అతనికి ఉండే కల్యాణగుణాలను గూర్చి పలికింది – అవి స్వాభావికాలనికూడా పలికింది.

బ్రహ్మం కంటే వ్యతిరిక్తమైనది ఏదీ లేదని శంకరులన్నారు. కాని, కాలమనే బ్రహ్మవ్యతిరిక్తమైన వస్తువు ఒకటి ఉన్నదని చెప్పబడిందికదా! ప్రళయ కాలంలోకూడా సూక్ష్మమైన ప్రకతితత్త్వమున్నదని శ్రుతివల్ల తెలుస్తున్నదే! మరి బ్రహ్మం కంటే వేరయినది ఏదీ లేదని ఏవిధంగా అనడం? బ్రహ్మం కంటే వేరుగా జీవులు లేరని శంకరులంటున్నారు. అన్నీ లయించిన కాలంలో కూడా నిత్యులైన జీవాత్మలున్నారు. అచిత్తు ఉన్నది. జీవులు చేసిన కర్మలున్నాయి. అందువల్లనే, సష్టికాలంలో భగవానుడు ఆ యా జీవులకు వారు వారు చేసికొన్న కర్మలకు తగినట్లు శరీరాలను సష్టిస్తున్నాడు, సుఖదుఃఖాలనుకూడా ఆ యా జీవుల కర్మలకనుగుణంగానే కలుగ జేస్తున్నాడు? అని నిర్వహించాలని శాస్త్రాలలో తెలుపబడింది. కనుక బ్రహ్మంతో సజాతీయమైన జీవతత్త్వం ఉన్నదని తెలుస్తున్నది. ఆ బ్రహ్మానికి జ్ఞానశక్త్యాది కల్యాణగుణాలున్నాయని తెలుస్తున్నది. "అపాణిపాదో జవనో గహీతా" అని పరమాత్మ పాణి పాదాలను లేనివాడని అన్నా, అతని వైభవానికి తగిన గొప్ప దివ్యమంగళవిగ్రహ మున్నదనిళీ య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దశ్యతే..... హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ" అని వేదం ఆ భగవానుని భోగ్యమైన దివ్యరూపాన్నిగూర్చి పలికి దానికి కల లక్షణాలనుగూర్చి తెలిపింది."

"ఈ విధంగా వేదాంతాలలో గుణాలతో కూడినవాడై, దివ్యమంగళ విగ్రహంతో కూడినవాడై భగవానుడున్నాడు, అన్నీ లయించిన కాలంలోకూడా అతనికి సజాతీయమైన జీవతత్త్వం ఉన్నది, ఆ జీవులనేకులు. విసజాతీయ మైన అచేతనతత్త్వంకూడా ఉన్నది. బ్రహ్మం వాటితో కూడినవాడై ఉన్నాడు. అ సమయంలోకూడా చేతనాచేతనాలకు, బ్రహ్మానికి మధ్య శరీరాత్మభావ మున్నది" – అని వేదాంతాలవల్ల తెలుస్తున్నది కనుక, ఇపుడు విశిష్టాద్వైతమే వైదికతత్త్వమని అంగీకరించాలి. విశిష్టబ్రహ్మాన్నే ఒప్పుకోవాలి. బ్రహ్మమొకటే ఉన్నది, వేరేమీ లేదని అంటే, మరి, శ్రుతిలో "అగ్రే" అని చెప్పబడిందే! "అజా మేకామ్" అని అజశబ్దంతో శ్రుతి ప్రకతితత్త్వాన్ని చెప్పిందే! జీవులున్నారు, వారు నిత్యులు ,వారి కర్మలున్నాయి అని అన్నదే! "నిత్యానాం చేతనానాం బహూనామ్" – అనే చోట జీవుల బహుత్వం, నిత్యత్వం స్పష్టంగా చెప్పబడి ఉన్నదే! ఆ బ్రహ్మానికి కల్యాణగుణాలున్నాయని శ్రుతి తెలిపిందే! అందువల్ల, వేదవాక్యాలతోనే శ్రీరామానుజులు? బ్రహ్మమనేది గుణాలతో, విగ్రహంతో, చేతనాలతో, అచేతనాలతో కూడినది. ఎల్లప్పుడు విశిష్టమైనది – అని నిరూపించారు. దీనిని మనం తటస్థబుద్ధితో గమనిస్తే, "బ్రహ్మమనేది విశిష్టమైనదై ఉండాలి, శుద్ధమని చెప్పే వీలు లేదు" అనే తత్త్వం స్పష్టంగా, నిష్పక్షపాతంగా తెలుస్తుంది.

గీతలో గమనించవలసిన ఒక అందమైన విషయం ఉన్నది. అది మన సిద్ధాంతాన్ని అందంగా తెలుపుతున్నది. గీతలో భగవానుడు తన కల్యాణ గుణాలను గూర్చి, విభూతినిగూర్చి అర్జునునకు తెలుపదలచి, "నావలె విభూతిని కలవాడింకొకడు లేడు. నేను సర్వస్వామిని. ఇవన్నీ నా ఐశ్వర్యాలు. ఇవి నా విభూతులు. "ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః, సోఽ వికంప్యేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః" – నా కల్యాణ గుణాలను, విభూతులనుగూర్చి ఎవడు వింటున్నాడో నమ్ముతున్నాడో, అతనికి భక్తి కలుగుతుంది? అని అన్నాడు. ఇది అంతా 10వ అధ్యాయం ఆరంభంలో తెలుప బడింది. అపుడు అర్జునుడు "వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః" – అని అంటూ భగవానునకు కల విభూతిని అంతటినిగూర్చి చెప్పమని అతనిని అడిగాడు. అపుడు భగవానుడు దానినిగూర్చి విస్తతంగా తెలిపాడు.

తరువాత, 11వ అధ్యాయంలో భగవానుడు “దివ్యం దదామి తే ఛక్షుః పశ్య మే యోగమైశ్వరమ్” అని అర్జునునకు దివ్యనేత్రాలను ఇచ్చి, తన తిరుమేనిలో విభూతిని అంతటిని దర్శింపజేశాడు. తన దేహంలో ప్రపంచాన్ని అంతటిని తాను ధరించే రీతిని భగవానుడు చూపించినపుడు అర్జునుడు దర్శించి, “సర్వమేతదతం మన్యే” అని అన్నాడు దీనిని శ్రీరామానుజులు “అత స్సర్వ మేతద్యథావస్థితవస్తుకథనం మన్యే, న ప్రశంసాద్యభిప్రాయమ్” అని వివరించారు. ఇది అంతా నిజమే, పొగడ్త కాదని దీని భావం. దీనివల్ల “ప్రపంచం సత్యం, భగవానుడు సత్యం, ఆ భగవానుడు ప్రపంచాన్ని విభూతిగా కలిగి ఉన్నాడు. అతడు నారాయణుడు” అనే విషయం స్పష్టంగా తెలుస్తున్నది.

ఇక్కడ బాగా గమనించాలి. ఈ జగత్తు అసత్యమే అయితే, భగవానుడు అర్జునునకు దివ్యదష్టినిచ్చి, తన తిరుమేనిలో తాను జగత్తును ధరిస్తున్నట్లు చూపిస్తాడా? అని ఆలోచించాలి. “లోకత్రయం ప్రవ్యథితమ్” అనే ఒక వాక్యం 11వ అధ్యాయంలో ఉన్నది. దీనికి శ్రీరామానుజులు చాలా అందంగా అర్థాన్ని చెప్పారు ”ఏతేషా మప్యర్జునస్యేవ విశ్వాశ్రయరూపసాక్షాత్కారసాధనం దివ్యం చక్షుః భగవతా దత్తమ్. కిమర్థమితి చేత్, అర్జునాయ స్వైశ్వర్యం ప్రదర్శయితుమ్. అత ఇదముచ్యతే ”దష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్! – ఇతి”.

క్లుప్తంగా దీని భావమిది... భగవానుడు దివ్యనేత్రాలను ఇచ్చి, విశ్వరూపాన్ని చూపించేటపుడు అర్జునునకు మాత్రమే అటువంటి దివ్యనేత్రాన్ని ఇవ్వలేదు. బ్రహ్మాదులకుకూడా అటువంటి దివ్యచక్షుస్సును ఇచ్చాడు. ఆ విశ్వరూపంలో సంహర్తృత్వమనే తత్త్వం ప్రకాశిస్తున్నది. భగవానుడు తాను సంహర్త అనే తన మహిమను అర్జునునకు చూపించే టపుడు ఆ గుణాన్ని బ్రహ్మాదులకుకూడా దర్శింపజేశాడు. అర్జునుడు భయపడినట్లే, బ్రహ్మాదులుకూడా దానిని చూచి భయపడ్డారు.” బ్రహ్మ మొదలైన దేవతల కంటే శ్రీకృష్ణుని రూపంలో ఉండే నారాయణుడైన తానే పరుడు – అనే తత్త్వం అర్జునుని మనసులో పడాలి – దానిని అతడు గ్రహిస్తే తన పరత్వం అతనికి బాగా వ్యక్తమవుతుంది” – అని భగవానుడు తలచాడు. అందువల్లనే బ్రహ్మాదులకుకూడా దివ్యనేత్రాన్ని ఇచ్చి,

వారికి తన సంహర్తత్వాన్ని చూపించి, వారు భయపడేటట్లు చేసి, వారు ఆ విధంగా భయపడే విషయాన్ని అర్జునుడు తెలిసికొనేటట్లు భగవానుడు చేశాడు.

సంగ్రహంగా తెలిపితే – వేదాంతం అనాది. అందరికి అందులో శ్రద్ధ కలిగి శ్రీరామానుజుల గ్రంథాలను గ్రహించి, విశిష్టబ్రహ్మమే తత్త్వం – అనే వాస్తవాన్ని గ్రహించాలి. ఆ పరమపురుషుడు సాక్షాత్తు నారాయణుడే? అని తెలియాలి. ఆ స్వామివిషయంలో భక్తిని కలిగి ఉండాలి. అతని చరణార విందాలను ఆశ్రయించడం ఉజ్జీవనోపాయం, ఆ స్వామి మెచ్చే కైంకర్యమే పరమపురుషార్థం. అదే ప్రాప్యం – అని గ్రహించాలి. ఈ వైదికసిద్ధాంతం అంతటా వ్యాపించాలి. వద్ధిచెందాలి – అనే ఉద్దేశ్యంతోనే భగవద్రామా నుజులు అవతరించారు. వారి అవతారసమయంలో వారి పాదస్పర్శ కలగని ప్రదేశం ఈ దేశంలో ఏదీ లేదు. భారతదేశంలో సాలగ్రామ పర్యంతం వారు పర్యటించి, సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. పలు కోవెలలలోని సమయాచారాలను చక్కదిద్దారు. అనాదిగా మరుగపడి ఉండే విషయాలను అందరు తెలిసికొని, ఉజ్జీవించాలని వారు పడిన శ్రమ చాలా గొప్పది. అది ఈ మధ్యకాలంలో మళ్ళీ కొంత మరగునపడినా, ఇపుడు వారిపట్ల భక్తి ప్రపత్తులను కలవారు అందరు కలసి" వారి సిద్ధాంతం మళ్ళీ సర్వత్ర ప్రచారం కావాలి, అందరి ఉజ్జీవనానికి అది ఉపయోగపడాలి" – అనే పట్టుదలతో నడుం బిగించాలి. భగవత్కృపతో అటునంటివారు చేసే ప్రయత్నం సఫలం కావాలి.

**లోకా స్సమస్తా స్సుఖినో భవంతు**

**శ్రీమన్మహాభూతపురే**
**శ్రీమత్కేశవయజ్వనః,**
**కాంతిమత్యాం ప్రసూతాయ**
**యతిరాజాయ మంగళమ్.**

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః